# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 9 సంచిక : 9 హైదరాబాద్ 122 సెప్టెంబర్ 2011 పేజీలు : 68 రు. 15

★ ఫోకస్ : ఇరవై ఏళ్ల ప్రపంచీకరణ

★ దేవుడి సంపద ప్రజలదే

★ బ్రిటన్ పరిణామాలు

★ ప్రజా వ్యతిరేక పోస్కో ప్రాజెక్ట్

★ మర్డోక్ అక్షర ఘోరాలు

★ ప్రత్యామ్నాయ ప్రజా ఆర్థిక విధానాలు

★ వ్యవసాయానికి ఉపాధి హామీ పథకం

# వీక్షణంకు చేయూతనివ్వండి...

మీ ఆదరాభిమానాలతో త్వరలో పదో సంవత్సరంలో అడుగుపెడుతున్న వీక్షణం మీరు మరింత సహాయం అందించకపోతే ఎక్కువకాలం నడవడం కష్టం...

ఔను, వీక్షణం నష్టాలతో నడుస్తున్నదని, ఉత్పత్తి వ్యయం కూడ తిరిగి రావడం లేదని, ఆర్థిక పరిస్థితి నానాటికీ క్షీణిస్తున్నదని గత కొంతకాలంగా చెపుతూనే ఉన్నాం. అది ఇంకా విషమించింది. వీక్షణం నాలుగు కాలాల పాటు సజావుగా నడవడానికి ఇప్పటికే వందలాది మంది అభిమానులు తమ శాయశక్తులా ప్రయత్నిస్తున్నప్పటికీ, ఆ సహాయం చాలడం లేదు. సహాయం ఇతోధికంగా పెరగకపోతే వీక్షణం ఎక్కువకాలం మనగలగడం కష్టం.

వీక్షణం మీ పత్రిక. ప్రజల పత్రిక. ప్రజలకు అవసరమైన పత్రిక. ఇది ఆగిపోకుండా కాపాడండి.

❖ ప్రతి పాఠకుడూ/పాఠకురాలూ కనీసం మరొకరికి వీక్షణాన్ని పరిచయం చేయండి.

❖ ప్రతి చందాదారూ కనీసం మరొకరిని చందాదారుగా చేర్పించండి.

❖ మీకు తెలిసిన కళాశాలలు, కార్యాలయాలు, గ్రంథాలయాలు, ప్రజా సంస్థలు వీక్షణంను తెప్పించేలా చూడండి.

❖ మీ గ్రామంలో, పట్టణంలో న్యూస్ ఏజెంట్ దగ్గర వీక్షణం అమ్మేలా చూడండి

ఇవన్నీ వీక్షణం ప్రచురిస్తున్న భావాలు ప్రచారం చేయడానికి. కాని వీక్షణం ఆర్థిక పరిపుష్టికి అవి మాత్రమే సరిపోవు. వ్యాపార, ప్రచార ప్రకటనలు లేకుండా పత్రికలేవీ మనుగడ సాగించలేవు. వీక్షణంకు మీకు తెలిసిన వ్యక్తులనుంచీ, సంస్థల నుంచీ ప్రకటనలు సంపాదించండి. కళాశాలలు, వైద్యశాలలు, ఆస్పత్రులు, దుకాణాలు, వ్యాపార, పారిశ్రామిక సంస్థలు, గ్రామ స్థాయి నుంచి రాష్ట్ర స్థాయి దాకా పాలక సంస్థలు, దాతలు... సంస్థల బాధ్యులు, వ్యక్తులు ఎవరి నుంచి ఐనా సరే...

❖ జీవిత చందాలు, కానుకగా చందాలు, విరాళాలు సేకరించండి.

❖ ప్రకటనలు సేకరించండి.

**ప్రతినెలా కనీసం మూడు పేజీల ప్రకటనలు ఉంటేనే వీక్షణం ఆర్థిక స్థితి ఏనెలకానెల అన్నట్టు సాగుతుంది. తెలుగు సమాజం తనతో తాను జరుపుకుంటున్న సంభాషణ ఆగిపోకుండా మీ వంతు సాయం చేయండి.**

మీ సహకారం అందించాల్సిన చిరునామా :

**వీక్షణం**

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3 హిమాయత్‌నగర్

హైదరాబాద్ - 500 029. ఫాక్స్ ఫోన్ : 040-66843495

ఇమెయిల్ : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

KLVA1DSM109

122

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

సెప్టెంబర్ 2011
సంపుటి : 9
సంచిక : 9



## లోపలి పేజీల్లో...

### ఫోకస్ : ఇరవై ఏళ్ల ప్రపంచీకరణ





ప్రింటర్స్
డక్కన్ ప్రెస్ / చరితా ఇంప్రెషన్స్
అజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

డిస్ట్రిబ్యూటర్స్
ఆనంద్ ఏజెన్సీస్
హైదరాబాద్
ఫోన్ : 98484 28516
92468 26191

'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, చెక్కులు, డి.డి లు పంపాల్సిన చిరునామా

వీక్షణం
మైత్రి రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు | విద్యార్థులకు |
|---|---|---|---|
| విడి ప్రతి | రు. 15 | రు. 15 | రు. 15 |
| సంవత్సరం | రు. 180 | రు. 150 | రు. 120 |
| మూడు సంవత్సరాలు | రు. 500 | రు. 400 | రు. 350 |
| ఐదు సంవత్సరాలు | రు. 800 | రు. 650 | - |
| పది సంవత్సరాలు | రు. 1500 | రు. 1300 | - |

వీక్షణం అకౌంట్ నెంబర్ - **013911011002175**
ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్

3

## పరిశోధక విద్యార్థులకూ, రచయితలకూ, అధ్యాపకులకూ శుభవార్త

గత నెల నుంచి వీక్షణంకు ఇంటర్నేషనల్ స్టాండర్డ్ సీరియల్ నంబర్ (ఐ.ఎస్.ఎస్.ఎన్.) వచ్చింది. ISSN 2231-6892 అనే ఈ నంబర్‌ను పరిశోధక విద్యార్థులూ, రచయితలూ, అధ్యాపకులూ వీక్షణంలో అచ్చయిన తమ రచనలతో ఉదహరించడం వారి విద్యాపరమైన అవకాశాలను ఇనుమడిస్తుంది. ఈ నంబర్ ప్రపంచవ్యాప్తంగా ప్రతిష్ఠాత్మకమైన పరిశోధక పత్రికలకు ఇచ్చేదిగా ఎక్కడైనా గుర్తింపు పొందుతుంది. ప్రత్యేకించి 2009లో చట్టంగా రూపొందిన యు.జి.సి. రెగ్యులేషన్స్ ఆన్ మినిమమ్ క్వాలిఫికేషన్స్ ఫర్ అపాయింట్మెంట్ ఆఫ్ టీచర్స్ అండ్ అదర్ అకడమిక్ స్టాఫ్ ఇన్ యూనివర్సిటీస్ అండ్ కాలేజస్ అండ్ మెజర్స్ ఫర్ ద మెయింటెనెన్స్ ఆఫ్ స్టాండర్డ్స్ ఇన్ హయ్యర్ ఎడ్యుకేషన్ ప్రకారం ఐ.ఎస్.ఎస్.ఎన్. ఉన్న పత్రికలలో వ్యాసం అచ్చయితే అభ్యర్థికి ఉన్నత విద్యలో కానీ, పదవులలో కానీ, పదోన్నతులలో కానీ వేరు వేరు స్థాయిలలో పది మార్కుల నుంచి ఇరవై ఐదు మార్కుల వరకు వస్తాయి. ఈ సౌకర్యాన్ని పరిశోధకులూ, అధ్యపకులూ విరివిగా ఉపయోగించుకోవలసిందిగా కోరుతున్నాం. - సం.

జూలై 2011 సంచికలో కె. సుభాషిణిగారు రాసిన 'లేసు పరిశ్రమలో మహిళా కార్మికులు' అనే వ్యాసం చాలా తులనాత్మకంగా ఉంది. లేసు పరిశ్రమలో పనిచేసే మహిళా కార్మికుల సంవత్సర వేతనం వారిని కలవడానికి వెళ్ళిన రచయిత్రి నెలసరి వేతనం కంటే కూడా తక్కువగా ఉందని తెలియజేశారు. ఇక్కడ ప్రముఖంగా కార్మికులకు, ప్రభుత్వానికి మధ్య వ్యవహరిస్తున్న దళారులు కేవలం వారి సంపాదన కోసం పేద మహిళా కార్మికుల శ్రమను, వారి కళా నైపుణ్యాన్ని అన్యాయంగా దోచుకుంటున్నారని తెలియజేశారు. ఈ విధంగా అనేక కర్మాగారాల్లో ప్రస్తుతం జరుగుతూ ఉన్నది కాబట్టి ప్రభుత్వం ఇటువంటి దళారీ వ్యవస్థను రూపుమాపే విధంగా చర్యలు తీసుకొని, పేద కార్మికులకు వారి శ్రమకు, కళా నైపుణ్యానికి తగిన వేతనాన్ని ఇచ్చేలా చర్యలు తీసుకోవాలని తెలియజేస్తూ, ప్రజలను ఆలోచించే విధంగా వ్యాసాలు రాస్తున్న 'వీక్షణం'కు కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాను.

- కొమ్ము అశోక్
*కంభం*

వీక్షణం జూలై 2011 సంచికలోని సంపాదకీయ వ్యాఖ్య 'ఎప్పటికైనా రాజపక్షను శిక్షిస్తారా?'పై ఎస్. కృష్ణమూర్తి చేసిన విమర్శలో సెన్స్ ఆఫ్ ప్రపోర్షన్, సెన్స్ ఆఫ్ బ్యాలెన్స్ లోపించాయి. కృష్ణమూర్తి గారి విమర్శ కాస్త పాండిత్య ప్రకర్షగానూ అనిపించింది. అణగారిన వర్గాల వైపు నుంచి, మైనారిటీ జాతుల వైపు నుంచి ఒక సమస్యపై మాట్లాడినప్పుడు, అనేక సంవత్సరాలుగా ఒక సమస్య జవాబు లేకుండా మండుతూనే ఉన్నప్పుడు, న్యాయమైన పరిష్కారం దొరకనప్పుడు కాలక్రమంలో వ్యక్తీకరణకు కాస్త అతిశయం తోడు కావచ్చు. ఒక న్యాయమైన ఆకాంక్షను, వాదనను బలంగా వినిపించేటప్పుడు, బాధితులు నిత్య యుద్ధ స్థితిలో బతుకుతున్నప్పుడు వారి పక్షాన వినిపించే స్వరం, దానికి బాసటగా నిలిచే స్వరం తీవ్రస్థాయిలో మన ముందు పెడుతున్న ప్రశ్నలు ముఖ్యమవుతాయి. ఇన్ని మాట్లాడుకున్నాక, ఇప్పటికైనా శ్రీలంక తమిళులు అడుగుతున్న ప్రశ్నలూ, వ్యక్తం చేస్తున్న సమస్యలూ, వాటి పరిష్కారాలకు ఏమి చేయాలి, ఏం చేస్తే బాగుంటుంది, ఆ జాతి ఆకాంక్షలు ఏమిటి అనే వైపు చర్చ జరిగితే బాధితులకు, పీడితులకు ప్రయోజనకరంగా ఉంటుంది.

- పి. జాన్సన్
*టి నగర్, చెన్నై*

ప్రస్తుత ప్రపంచవ్యాపిత సంక్షోభంలో - చరిత్రకు సంబంధించి కొన్ని విషయాలు తెలుసుకోవలసిన అవసరం ఉందని భావిస్తున్నాను. 1930లలో వచ్చిన సంక్షోభ కాలంలో ఆనాడు ఆర్థిక పరిస్థితులు ఎలా ఉండేవో సీరియల్ పద్ధతిలో వ్యాసాలు రావలసిన అవసరం ఉందని నేను భావిస్తున్నాను. సంక్షోభ కాలంలో ఆర్థిక సంస్థలు, వాటి కార్యకలాపాలు వాటికి అనుగుణంగా సామ్రాజ్యవాద దేశాల ప్రభుత్వాలు చేసే నిర్ణయాలు, పోటీలు - కూటములు - ఆర్థిక కూటములు, వ్యాపార ఒప్పందాలు, వాణిజ్య కూటములు, మిలిటరీ కూటములు మొదలగు విషయాలకు సంబంధించి - 1930లల్లో జరిగిన చరిత్రను ఒకసారి మరల పాఠకులకు పరిచయం చేస్తే బాగుంటుందేమోననుకుంటున్నాను. ముఖ్యంగా ఈరోజు సంక్షోభంలో రికవరీకి సంబంధించిన అంశంలో ఏమిటి అనేది మాకు కొంత సమాచారం కావాలి. అమెరికా ఆర్థిక సంక్షోభం తీవ్రంగా పెరిగితే మన దేశంలో ఏ రంగాల మీద దాని ప్రభావం ఉంటుంది. ప్రభుత్వం వైపు నుంచి పరిష్కార మార్గాలు ఏమిటి? నేడు ప్రపంచంలో చైనా జనాభా విషయంలో మొదటి దేశంగా ముందుకు వచ్చింది. బహుశా కార్మికవర్గం సంఖ్య కూడా చాలా పెద్ద సంఖ్యలో పెరిగి ఉండవచ్చు కదా! 1949 నాటి, 1976ల నాటి చైనా కంటె నేటి చైనా పెట్టిబడిదారీ విధానంలో చాలా ముందుకుపోయిందనే పరిస్థితులు చెబుతున్నాయి. ఈ సంక్షోభం చైనాను ఎలా ప్రభావితం చేయగలదు? ప్రస్తుతం చైనా ఎగుమతులు ఆగిపోతే తన సొంత మార్కెట్‌లో అమ్ముకోగలదా? అంత కొనుగోలు శక్తి అక్కడ ఉందా? రాబోవు పరిణామాలు ఎలా ఉండబోతున్నాయి? మా వద్ద ఎక్కువ సమాచారం లేదు. యూరోప్, అమెరికాలు అభివృద్ధి రేట్లను నమోదు చేసుకుంటున్నాయి. నిరుద్యోగం పెరుగుతోంది. ప్రజల మీద భారం పెరుగుతోంది అని పేపర్ సమాచారమే గానీ, నిర్దుష్టంగా ఒక దేశానికి సంబంధించిన స్థితిగతులు ఎలా ఉన్నాయి అనే విషయాలపై మరిన్ని విశ్లేషణలు, సమాచారం అందించగలరు.

- గంగన్న
*రాజకీయ ఖైదీ, గుంటూరు జిల్లా జైలు*

దండకారణ్య ఉద్యమ నాయకులు అమన్ వ్యాసం కార్పొరేట్ మీడియా దుష్ప్రచారాన్ని బట్టబయలు చేసింది. ప్రభుత్వ యంత్రాంగానికి పాలకులుకు బాకాగా మీడియా మారింది. విశ్వరంజన్ అబద్ధాలు చెపితే దానికి కొండంతలు చేసి పతాక శీర్షికలతో రాసి మెరుగులుదిద్ది ప్రభుత్వ సేవను ప్రకటించుకున్నారు. మావోయిస్ట్ పార్టీ వెల్లడించిన వాస్తవ ప్రకటనలను ఓ మూల చిన్నవిగా ప్రకటించి చేతులు దులుపుకొని పాఠకులను తప్పుదోవ పట్టిస్తున్నారు. పాలకులు అభివృద్ధి పేరుతో చేస్తున్న దగా మొదలగు విషయాలు తెలియజేయడం అవసరం. ప్రజా కళాకారులు జీతన్ మరాండి, ఛత్రపతి మండల్, మనోజ్ రాజ్వర్, అనిల్ రామ్‌లకు విధించిన మరణదండన దేశంలో ప్రజా కళాకారులకు ఇటువంటి శిక్ష ఇదే మొదటిసారి అనుకుంటాను. 'అభివృద్ధి నమూనా రెండు ముఖాలు' ఎస్. శేషయ్య వ్యాసం 64 సంవత్సరాల 'అభివృద్ధి' తీరు తెన్నులు పూర్తిగా విశదీకరించింది.

- తుంపాల శ్రీరామమూర్తి
*గాజువాక, విశాఖపట్నం*

వీక్షణం ఆగస్ట్ 2011 సంచికలో 'అవన్నీ హిందీ రాష్ట్రాలు కావు' అనే శీర్షికతో వచ్చిన వ్యాసంలో మరింగంటి అప్పలాచారి భాషా, మాండలికాల విషయంలో స్పష్టతనిస్తూ, మంచి వ్యాసాన్ని అందించినందుకు అభినందనలు. అయితే, అటువంటి కారణాలతో ఒక ప్రాంతీయ ఆకాంక్ష తలెత్తడం వెనక ఉన్న రాజకీయ, ఆర్థిక, సామాజిక వెనుకబాటుకు సంబంధించిన కారణాలను, మొత్తంగా ఆ ఆకాంక్షను కాదనలేం. కేవలం భాషే కాదు, ఇంకా అనేక విషయాలపై, ఉద్యమంలో ఉన్న వెనుకబడిన ధోరణులపై, పోరాట రూపాలపై కూడా విస్తృతంగా చర్చ జరగడం భవిష్యత్తుకు మంచిదే.

- ఫిదా హుసేన్
*నెల్లూరు*

వీక్షణం ఆగస్టు సంచికలో పేదరికంపై ఔషధ ప్రయోగాలు అనే వ్యాసం నిడివిలో చిన్నదయినా విషయాన్ని రచయిత సూటిగా అర్థమయ్యేలా చెప్పారు. సామాన్య ప్రజల పేదరికాన్ని ఆసరగా చేసుకొని ప్రైవేట్ ఔషధ సంస్థలు ఎలా సొమ్ము చేసుకొంటున్నాయో ఉదాహరణలతో వివరించారు. ఈ విషయంలో ప్రభుత్వ బాధ్యతారాహిత్యాన్ని ఎత్తి చూపారు.

- శనిగరం మహేష్
*కరీంనగర్*

# మరోసారి రుజువవుతున్న 'అందరూ దొంగలే'

**ఈ** నెల రాష్ట్ర రాజకీయ రంగంలో జరిగిన, కొనసాగుతున్న పరిణామాలు పార్లమెంటరీ రాజకీయాలలో, వాటిని ఆశ్రయించుకుని ఉన్న ఉన్నతాధికార వర్గంలో, ప్రచార సాధనాలలో దుర్మార్గాన్ని మరింత నగ్నంగా బయట పెడుతున్నాయి. ఈ రాష్ట్రంలో అధికారం అనుభవించిన, అనుభవిస్తున్న రాజకీయ నాయకులు, వారి ఆదేశాలను పాటిస్తూ వారికి వందల కోట్ల నిధులు కట్టబెడుతూ, తమవంతుగా ఎంగిలి మెతుకులు ఏరుకున్న ఉన్నతాధికారులు, ఆ సమాచారంలో తమకు అనుకూలమైనవే బయటపెడుతూ, మిగిలిన వాస్తవాలను తొక్కిపెడుతున్న ప్రచార సాధనాలు – ఇదంతా ఇప్పుడు బయటపడుతున్న విషవలయం. అపారమైన వనరులు, అద్భుతమైన శ్రామిక శక్తి ఉన్న ఈ రాష్ట్రాన్ని పట్టిపీడిస్తూ మూలుగులు పీలుస్తున్న షడ్యంత్రం ఇది. ఈ మహాకుట్రలో అధికారంలోనూ, అధికారానికి దగ్గరగానూ ఉన్నవారందరూ భాగస్వాములే. ఏ ఒక్కరూ మినహాయింపు కాదు. ఇప్పుడు అధికారపక్షంలోని ముఠా తగాదాలు, లూటీసొమ్ము వాటా పంపిణీ కొట్లాటలు చిలికి చిలికి గాలివాన అయి రాష్ట్ర ప్రజల సంపద ఎంత అడ్డగోలుగా దొంగలపాలయిందో సమాచారమంతా వెలికివస్తున్నది. రాజశేఖర రెడ్డి ముఖ్యమంత్రిగా ఉన్న కాలంలో ఆ పదవిని అడ్డుపెట్టుకుని ఆయనా, కొడుకు జగన్మోహన రెడ్డీ సాగించిన అక్రమ ధనార్జన, ఆస్తుల సంపాదన వివరాలు ఒక్కటొక్కటిగా బయటపడుతున్నాయి. రాష్ట్రంలోనూ, దేశంలోనూ అందరు రాజకీయ నాయకులూ అటువంటి అక్రమార్జనకు పాల్పడినవారే. కాళోజీ అన్నట్టు "అసమ సమాజంలో ఆర్జనయే దౌర్జన్యం" అనే తాత్విక చర్చలోకి వెళ్లకపోయినా, అధికారాన్ని వాడుకుని సాగుతున్న అక్రమార్జన గురించి ఆలోచించకతప్పదు. గ్రామ సర్పంచ్ నుంచి రాష్ట్రపతి దాకా ఏ ఒక్కరినైనా తీసుకుని అధికారానికి రాకముందు ఆస్తి ఎంత, అధికారంలో ఉన్నప్పుడు న్యాయమైన జీతభత్యాల సంపాదన ఎంత, ప్రస్తుతం ఉన్న భోగభాగ్యాలు ఆ సంపాదనతోనే పోగయ్యాయా లెక్కవేస్తే దేశంలోని పదిలక్షలకు మించని రాజకీయ నాయకులలో వంద మంది కూడ నీతిమంతులుగా మిగులుతారో మిగలరో. ఈ దొంగల ముఠాలో అప్పుడప్పుడు ఉపముఠా తగాదాలు చెలరేగి "నువ్వు దొంగ" అంటే "నువ్వు దొంగ" అని తిట్టుకుని, అందరూ దొంగలేనని రుజువు అవుతుంటుంది. ఇవాళ అదే జరుగుతోంది. ఇవాల్టి ముద్దాయి ఆ దొంగతనంలోనూ అందరినీ మించిపోయాడు గనుక ముద్దాయి అయ్యాడు. అయినా మౌనంగా అధికారపక్షంలో ఉంటే ఈ దొంగతనం చర్చకు వచ్చేదే కాదు గాని, అధికారపక్షాన్ని ధిక్కరించాడు గనుక, తండ్రి పదవి తనకు దక్కవలసిందే అని రాజరికపు రోజుల్లోలాగ గొడవ చేస్తున్నాడు గనుక, సామంతుడిగా పడి ఉండనని సామ్రాజ్యాధినేతను ఎదిరిస్తున్నాడు గనుక ముద్దాయి అయ్యాడు. నిన్నటిదాకా ఆ అక్రమాలలో భాగం ఉన్న రాజకీయ నాయకులూ, ఇన్ని అక్రమాలు చేసే విద్య తమకు తెలియకపోయిందే అని అసూయ పడే ప్రతిపక్ష రాజకీయ నాయకులూ న్యాయస్థానానికి వెళ్లారు. ఈ బెదిరింపుతో ముద్దాయి మళ్లీ తమ శిబిరంలోకే వచ్చి బెడద తగ్గిస్తాడని అధికారపక్షమూ, ఇటువంటి ఆరోపణలతో ప్రజల కన్నుగప్పి మాయచేసి మళ్లీ అధికారానికి రావచ్చునని భావించే ప్రతిపక్షమూ న్యాయస్థానం తాము ఆశించినదానికన్న ముందుకు పోదని అనుకున్నట్టున్నాయి. కాని వ్యవస్థ సాధికారత రోజురోజూ ధ్వంసమైపోతుండగా, పోయిన ప్రతిష్టను తిరిగి తెచ్చే పనిని తలకెత్తుకున్న న్యాయస్థానం హఠాత్తుగా పరమ పవిత్రంగా మారిపోయింది. ఈ దేశంలో ఎన్నడూ ఏ అక్రమాన్నీ తాను సమర్థించలేదన్నట్టుగా ప్రవర్తిస్తోంది. ఈ అక్రమాల మీద విచారణ జరపవలసిందే అని కేంద్ర నేరపరిశోధక సంస్థను ఆదేశించింది. ఇంతకాలమూ అధికారవర్గాలు ఏమి చెపితే అది విశ్వాసపాత్రంగా అక్షరాలా పాటించిన పరిశోధక సంస్థ ఇప్పుడుకూడ అదే పని ప్రారంభించింది. ఇటువంటి నేరారోపణలనే, కంటి ముందర కనబడుతున్న వాస్తవాలనే గతంలో తాను చూసీ చూడనట్టు విస్మరించాననని మరచిపోయింది. గుడ్డిలో మెల్ల అన్నట్టు గతంలో వంద తప్పులు చేసినా, ఇవాళ చేసిన ఈ ఒప్పును సమర్థించవలసిందే. కాని ఈ నిర్ధారణల మీద స్వయంగా ముద్దాయిని సమర్థించే రాజకీయ నాయకులు, అధికారపక్షంతో సహా ఇతర రాజకీయ నాయకులు మాట్లాడుతున్న మాటలు చూస్తుంటే రాజకీయవ్యవస్థ విమర్శకులు అంటున్నదానికన్న ఎక్కువ కుళ్లిపోయిందని స్పష్టమవుతున్నది. ఉచితంగానో, కారుచౌకధరలకో భూములు, ఇతర రాయితీలు ఇస్తామని ఆశ చూపి, ఇచ్చి, ప్రతిఫలంగా అధికారపక్షం, నిర్ణయాధికారం ఉన్న మంత్రులు, అధికారులు ప్రయోజనాలు పొందడం ఈ రాష్ట్ర రాజకీయ వ్యవస్థలో మొదటి నుంచీ ఉన్నదే. హైదరాబాద్ రియల్ ఎస్టేట్ వ్యాపారమే ఈ అక్రమం పునాదిపై పెరిగింది. ఈ అక్రమాన్ని అత్యున్నత స్థాయికి పెంచినది చంద్రబాబు నాయుడు కాలం లోని ప్రపంచ బ్యాంకు, బహుళజాతి సంస్థల పాలన. ఆ తర్వాత రాజశేఖరరెడ్డి ఇంకా కొత్తకొత్త లాభార్జనా మార్గాలు కనిపెట్టి రెండాకులు ఎక్కువే చదివానని చూపుకున్నారు. ఇవాళ వస్తున్న ఆరోపణలన్నీ అందులో భాగమే. ఆ నివేదికను అధికారపక్షం ఎంత దురుద్దేశంతో తయారు చేయించినా అవన్నీ అక్షరాలా నిజాలే. ఆ నిజాలు బయటపడినందుకు రాజీనామా చేస్తామని కొందరు శాసనసభ్యులు అంటున్నారంటే వారు నిజాలు బయటికి రాగూడదంటున్నారన్నమాట. ఇదంతా ఒక వ్యక్తికో, లేదా ఆ వ్యక్తికి సహకరించిన కార్పొరేట్లకో మాత్రమే సంబంధించినదిగా అధికారపక్షమూ, ప్రధాన ప్రతిపక్షమూ చూపుతున్నాయి. అంటే ఈ అక్రమాల వ్యాధికి ఇవాళ పొడసూపుతున్న లక్షణాలమీదనే కేంద్రీకరిస్తున్నాయిగాని వ్యాధిమూలాల మీదనో, నిన్నామొన్నా బయటపడిన లక్షణాల మీదనో కాదన్న మాట. అసలు సంగతులను విస్మరింపజేసేలా, కొసరు విషయాల మీదికి దృష్టి మళ్లించి పక్కదారి పట్టించడం పాలకవర్గాలకు వెన్నతో పెట్టిన విద్య. అలా దృష్టి మళ్లించడం[illegible]ంగంగా ఒక ముఠాను మరొక ముఠా అత్యంత తీవ్రమైన పదజాలంతో విమర్శించుకుంటాయి. అధికారం ఉన్నప్పుడు మాత్రం ఆ విమర్శల ఆధారంగా విచారణ జరిపి శిక్షించడం ఉండదు. అంటే విమర్శలను, ఆరోపణలను కూడ పైపైన సాగించే నాటకంగా మార్చడం పాలకవర్గ ముఠాలు నేర్చుకున్నాయి. పైకి ఒకరినొకరు దొంగ అనుకుంటూ ఈ ముఠాలు ఆడుతున్న నాటకాలను ఎండగట్టి, అందరూ దొంగలేనని గుర్తించి, ఈ నాటకానికి నిజమైన చిట్టచివరి తెర దించవలసినదీ దించగలిగినదీ ప్రజలు మాత్రమే. వీ

# రామలీల మైదానంలో వ్యవస్థ దింపుడు కళ్లం

ఆధునిక దైవదూత, అపర ప్రవక్త అవతారమెత్తిన అన్నా హజారే రామలీల మైదానంలో గత పది రోజులుగా నిరాహారదీక్ష చేస్తున్నారు. ప్రభుత్వ సంపూర్ణ సహకారంతో, బడా కార్పొరేట్ సంస్థల ఆర్థిక సహాయంతో, విదేశీ నిధుల ప్రభుత్వేతర సంస్థల భాగస్వామ్యంతో, బడా ప్రచార సాధనాల ఇరవై నాలుగు గంటల ప్రసారాలతో సాగుతున్న ఈ దీక్ష అవినీతికి వ్యతిరేకంగా అని ప్రచారమవుతోంది. కాని అవినీతికి మూలవిరాట్టులైన ప్రభుత్వమూ కార్పొరేట్లూ ఎన్జీవోలూ టీవీఛానళ్లూ సమర్థించే దీక్ష అవినీతికి వ్యతిరేకం ఎట్లా అవుతుందో ఆలోచించాలి. నిజానికి ఈ దీక్ష పార్లమెంటులో ప్రవేశపెట్టబోయే ఒక బిల్లు కోసం మాత్రమే. ఆ బిల్లు చట్టమైతే జన లోక్‌పాల్ అనే వ్యవస్థను నిర్మిస్తుంది. ఆ వ్యవస్థ అధికారకేంద్రాలలో అవినీతిని అడ్డుకోవడానికి ఉపయోగపడవచ్చు. లేదా ఈ దేశంలో చట్టాలుగా ఉన్నప్పటికీ అమలులోకి రాని అనేక ప్రజానుకూల చట్టాలలాగనే కాగితపుముక్కగా మిగిలిపోవచ్చు. కనుక ఇవాళ్టి దీక్ష ఒక కాగితపు ముక్క కోసం మాత్రమే గాని నిజంగా అవినీతికి వ్యతిరేకంగా కాదు. అవినీతి అనే సర్వవ్యాపిత మహమ్మారిని అడ్డుకునే మార్గాలలో ఈ చట్టం ఒకానొక స్వల్ప అసమర్థ భాగం మాత్రమే. ఆ స్వల్ప, అసమర్థ భాగాన్నే మొత్తంగా, సర్వరోగ నివారిణిగా చూపడం ఇవాళ వ్యవస్థ అవసరం. అసలు అవినీతి అంటే ఏమిటి, అది ఎందుకు జరుగుతున్నది, ఎక్కడ జరుగుతున్నది, దాని ప్రధాన మూలం ఏమిటి, దాన్ని ఎవరు ఎలా పెంచి పోషిస్తున్నారు, దాన్ని అరికట్టడం ఎట్లా వంటి ప్రశ్నలు ఈ రామలీలా మైదాన దీక్షాపరుడి ఆలోచనలోనే లేవు. తాను రాసిన బిల్లు అక్షరం మారకుండా, తాను చెప్పిన సమయం లోపలనే చర్చ ముగించి చట్టమైపోతే, అవినీతి రద్దయిపోతుందని ఆయన ప్రజలను నమ్మిస్తున్నారు. ప్రజలలో అవినీతి పట్ల ఉన్న సార్వత్రిక వ్యతిరేకతను ఆయన తన ఎజెండా కోసం వాడుకుంటున్నారు. రాజకీయపక్షాలు, ముఖ్యంగా అధికారపక్షం ఎంత నిస్సిగ్గుగా, ఎంత మొరటుగా మారిపోయాయంటే, ఆ కాగితం ముక్కను ఉనికిలోకి రానివ్వడం కూడ వారికి ఇష్టం లేదు. ఇంతకీ ఇది నీతి అవినీతి చర్చ కాదు. పాలకవర్గాలలో రెండు ముఠాల మధ్య తగాదా. మరొక మాటలో చెప్పాలంటే అధికారం కోసం తగాదా. అవినీతి ఒక సాకు మాత్రమే. వలసపాలన కాలం నుంచీ సాగుతున్న అధికారిక అవినీతి, అధికారమార్పిడి తర్వాత వ్యవస్థీకృతమైన అవినీతి, నూతన ఆర్థిక విధానాల తర్వాత పెచ్చరిల్లిపోయిన అవినీతిలో రాజకీయ పక్షాలకూ, కార్పొరేట్ వ్యాపార సంస్థలకూ, ఉన్నతాధికారులకూ, ప్రజలకోసం సమాచారాన్ని బయటపెట్టవలసిన ప్రచార సాధనాలకూ భాగస్వామ్యం ఉంది. కామన్‌వెల్త్ క్రీడలు, ఆదర్శ్ హౌజింగ్, 2జి కుంభకోణాలు వెలుగు చూసిన తర్వాత రాజకీయ నాయకులు, అధికారులు, కార్పొరేట్లు, సైనికాధికారులు, న్యాయమూర్తులు, జర్నలిస్టులు అందరికీ ఈ తిలాపాపంలో తలాపిడికెడు భాగం ఉన్నదని తెలిసిపోయింది. అంటే ఈ వ్యవస్థ కొనసాగింపే అవినీతి అని తేటతెల్లమైపోయింది. ఇంకా వ్యవస్థను ఉనికిలో ఉంచాలని, ఈ వ్యవస్థలోపలనే, చట్టాల సాయంతోనే సమస్యల పరిష్కారం సాధ్యమేనని నమ్మించడమే ఈ దీక్ష లక్ష్యం. ఈ వ్యవస్థ పని అయిపోయిందనీ, దీన్ని తగులబెట్టక తప్పదనీ, ప్రజలు అంతకంతకూ ఎక్కువగా గుర్తిస్తున్న వేళ, ఈ శవయాత్రను ఆపి, దింపుడుకళ్లం దగ్గర చివరి ప్రయత్నం చేస్తున్నారు వ్యవస్థానిర్వాహకులు. ఈ సారి దింపుడుకళ్లం పేరు రామలీలా మైదానం. విచారకరమైన విషయమేమంటే దింపుడుకళ్లం ఆశలను వమ్ముచేసి వ్యవస్థను తగులబెట్టవలసిన ప్రజాశక్తి ఇంకా అందుకు సిద్ధంగా లేదు. వీ

# పతనం అంచున సామ్రాజ్యవాదం

సామ్రాజ్యవాదమంటే మరణశయ్య మీద ఉన్న పెట్టుబడిదారీ విధానమేనని లెనిన్ చేసిన సుప్రసిద్ధ సూత్రీకరణ తొమ్మిది దశాబ్దాల తర్వాత కూడ నిజం కాలేదని వెటకారం చేసేవారున్నారు. సామాజిక యుగాల మార్పు, సామాజిక పరిణామాల వయసు సంవత్సరాల్లో, దశాబ్దాల్లో లెక్కించగలిగేవి కావని స్థూలమైన జవాబు చెప్పవచ్చు. నాలుగు శతాబ్దాల పెట్టుబడిదారీ విధానం, రెండు శతాబ్దాలు కూడ నిండని సామ్రాజ్యవాదం అనుభవించిన సంక్షోభాలు, ప్రజలమీద రుద్దిన యుద్ధాలు, మారణకాండలు చూపి కూడ దాని కుళ్లిపోయిన స్వభావాన్ని చూపవచ్చు. అలా ఇటువైపునుంచి విమర్శకులు చెప్పే జవాబులే కాదు, ఇప్పుడు సామ్రాజ్యవాదం ఎలా పతనం అంచున ఉన్నదో ఆశ్చర్యకరంగా అమెరికా ఆర్థిక వ్యవస్థే జవాబు చెపుతున్నది. తన వనరుల కొరతనూ, మార్కెట్ దాహాన్నీ తీర్చుకోవడానికి, సంక్షోభాల నుంచి గట్టెక్కడానికి ప్రపంచీకరణ విధానాలను ఊతగా తెచ్చుకున్న ఈ రెండు దశాబ్దాలలోనే సామ్రాజ్యవాదం కనీసం అరడజను సంక్షోభాలను చవిచూసింది. ప్రతిసారీ ఏదో తాత్కాలిక పరిష్కారంతో ఆ సంక్షోభం నుంచి బయటపడినా, మరి కొద్ది కాలంలోనే మరింత పెద్ద సంక్షోభం సామ్రాజ్యవాదాన్ని చుట్టుముడుతోంది. సబ్ ప్రైమ్ గృహరుణాలతో మొదలై అమెరికా, యూరప్ ఆర్థిక వ్యవస్థలను అల్లకల్లోలం చేసిన 2008 సంక్షోభం నుంచి గట్టెక్కడానికి లెక్కలేనన్ని నిధులతో బెయిల్ ఔట్ ప్యాకేజీలు గుమ్మరించి, సమస్య పరిష్కారమైందని సంతోష పడినంత కాలం పట్టలేదు. మూడు సంవత్సరాలు కూడ పూర్తి కాకముందే అమెరికా ఆర్థిక వ్యవస్థ విదేశీ రుణభార సమస్యను ఎదుర్కొంది. చావు తప్పి కన్నులొట్ట పోయినట్టు కాంగ్రెస్ తీర్మానంతో దాని నుంచి బయటపడడానికి ప్రయత్నిస్తుండగానే, అమెరికన్ ఆర్థిక వ్యవస్థ పరపతి అరత రేటింగ్ తగ్గిపోయింది. ఈ రెండు పరిణామాలు కలిసి స్టాక్ మార్కెట్‌ను దెబ్బతీశాయి. స్టాక్ మార్కెట్ పతనం పారిశ్రామిక, వ్యాపార సంస్థలను దిగజార్చింది. క్రమక్రమంగా విదేశాలలో అమెరికన్ పెట్టుబడులు తగ్గడం, విదేశీ సంస్థలు అమెరికన్ సంస్థలనుంచి పెట్టుబడులు ఉపసంహరించడం, అమెరికాలో నిరుద్యోగం పెరగడం, అమెరికన్ సంస్థలు విదేశాలనుంచి ఔట్ సోర్సింగ్ తగ్గించడం, వంటి పరిణామాలకు దారితీశాయి. ఇవాళ ప్రపంచీకరణ యు[illegible]లో అన్ని దేశాల ఆర్థిక వ్యవస్థను, స్టాక్ మార్కెట్లు పరస్పర అనుసంధానంతో, సన్నిహిత సమ్మేళనంతో ఉన్నాయి గనుక అమె[illegible] సాగుతున్న ఈ పరిణామాలు యూరప్‌కూ, జపాన్‌కూ, తూర్పు ఆసియా దేశాలకూ పాకాయి. భారత ఆర్థిక వ్యవస్థ కూడ ఈ పరిణామా[illegible]లితాన్ని అనుభవించబోతున్నది. ఈ పరిణామాలన్నీ సామ్రాజ్యవాదం పైకి కనబడుతున్నట్టుగా పులి కాదనీ, కాగితపు పులి మాత్రమేననీ మళ్లీ ప్రకటిస్తున్నాయి. సామ్రాజ్యవాదం నిజంగానే దినదినగండంగా బతుకుతున్నదనీ, కాని సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజా ఉద్యమం ప్రపంచవ్యాప్తంగా ఉండవలసినంత బలంగా లేనందువల్ల ఆ దినదినగండపు బతుకు నూరేళ్లా ఆయుష్షుగా మారుతున్నది. ముసలిపులి ఇంకా ఇంకా పంజాలూ కోరలూ విసురుతున్నది. గాండ్రిస్తున్నది. ప్రజాశక్తుల బలాన్ని ఇనుమడింపజేయడమే, సామ్రాజ్యవాద అంతానికి చివరి తోపు తోయడమే ఇవాళ ప్రతిఒక్కరి కర్తవ్యం. వీ







- **తెలంగాణ జాతిపిత సర్ జయశంకర్** – మరుపురాని మనిషి – సంపాదకుడు : జూలూరు గౌరీశంకర్ – ఘటన ముద్రణ – 311 పేజీలు, 1/8 డెమీ, రు : 150
- **హక్కులపత్రం** – ఘటన ముద్రణ – 124 పేజీలు, 1/8 డెమీ, రు : 60
  పై రెండు ప్రతులకు: ఘటన ముద్రణ, C/o. జె.సిఎచ్. బసవయ్య, రిటైర్డ్ టీచర్, 4-114/2/2, భవానినగర్, కోదాడ – 508 206; రాష్ట్రంలోని అన్ని పెద్ద పుస్తకాల షాపుల్లో
- **తెలంగాణ వెతలే.. కథలై!** – రచయిత్రుల కథా సంకలనం – సంపాదకులు : అమృతలత, అనిశెట్టి రజిత, తుర్లపాటి లక్ష్మి, కిరణ్‌బాల – రజనీ పబ్లికేషన్స్ – 350 పేజీలు, 1/8 డెమీ, రు : 150, ప్రతులకు: రజనీ పబ్లికేషన్స్, కీర్తి బుక్‌స్టాల్, షాప్ నెం. 12, ఆర్.టి.సి. కాంప్లెక్స్, నిజామాబాద్ – 503 003; విశాలాంధ్ర బుక్‌హౌస్; నవోదయ బుక్‌హౌస్, ప్రజాశక్తి బుక్‌హౌస్
- **జిజ్ఞాస తరంగాలు** – వేల్పూరి కామేశ్వరరావు – సృజన ప్రచురణ – 111 పేజీలు, 1/8 డెమీ, రు : 50, ప్రతులకు: వి. కామేశ్వరరావు, మాజీ జోనల్ సెక్రటరీ, ఎ.ఐ.ఆర్.ఎం.ఎస్.ఎ., ఎ.ఐ.ఆర్.ఇ.సి., ఎడిటర్, పబ్లిషర్ రైల్ శక్తి, ఇ.నెం. 73, రైల్ విహార్, లింగంపల్లి, హైదరాబాద్ – 500 019; సెల్: 9849008986; ఇమెయిల్ : velpurik@gmail.com; www.readerswork.blogspot.com; మైత్రి బుక్‌హౌస్; నవోదయ బుక్‌హౌస్; దిశ పుస్తకకేంద్రం; నవయుగ బుక్‌హౌస్; ప్రజాశక్తి బుక్‌హౌస్; విశాలాంధ్ర బుక్‌హౌస్; తెలుగు బుక్‌హౌస్
- **కుల నిర్మూలనా పోరాటానికి ద్వేషం ప్రాతిపదిక కాదు** – (ప్రొ. కంచ ఐలయ్య 'నేను హిందువునెట్లయిత?'కు స్పందన) – ప్రొ. కేశవరావు జాదవ్, జి.ఎస్. రామ్మోహన్ – విజయవిహారం సమర్పణ – జనహర్ష ప్రచురణ – 78 పేజీలు, 1/10 డెమీ, రు:20, ప్రతులకు: జనహర్ష పబ్లిషర్స్ ప్రై. లి., 3-8-347, మన్సూరాబాద్, చంద్రపురి కాలనీ, ఎల్.బి.నగర్, హైదరాబాద్ – 500074. ఫోన్: 24026053, సెల్: 9848019076; విశాలాంధ్ర బుక్‌హౌస్; ప్రజాశక్తి బుక్‌హౌస్; దిశ బుక్ సెంటర్; నవోదయ బుక్‌హౌస్; నవయుగ బుక్‌హౌస్
- **గులాం రసూల్ ఖాన్** (1805 – 1839) – (క్రీ.శ. 1839లో బ్రిటిష్ వారిపై తిరుగుబాటు చేసిన కర్నూలు చివరి నవాబు పోరాట గాథ) – ఎస్.డి.వి. అజీజ్ – పాలపిట్ట బుక్స్ – 103 పేజీలు, 1/8 డెమీ, రు : 75, ప్రతులకు: పాలపిట్ట బుక్స్, ఇ.నెం. 16-11-20/6/1/1, 403, విజయసాయి రెసిడెన్సీ, సలీంనగర్, మలక్‌పేట్, హైదరాబాద్ – 500 036. సెల్ : 9848787284, ఇమెయిల్ : palapittabooks@gmail.com
- **విరుగుడు** – సంధి.. విగ్రహమూ.. ఆ తర్వాత.. సంపాదకుడు : జూలూరు గౌరీశంకర్ – తెలంగాణ రచయితల వేదిక – 356 పేజీలు, 1/8 డెమీ, రు:200, ప్రతులకు: జూలూరు గౌరీశంకర్, 1-8-702/33/20ఎ, పద్మాకాలనీ, నల్లకుంట, హైదరాబాద్ – 500044
- **న్యాయనిర్ణేతవూ నీవే** – కె. విల్సన్‌రావు – బుక్స్ అండ్ బుక్స్ – 72 పేజీలు, 1/8 డెమీ, రు:30, ప్రతులకు: కె. రాజమణి, ఎల్.ఐ.సి. ఆఫీసర్స్ క్వార్టర్స్, గాంధీనగర్, యలమంచిలి, విశాఖపట్నం – 531055, ఫోన్: 8985435515
- **మరో సరస్వతి కానున్న గోదావరి** (ఎండిపోనున్న గోదావరి) – మరికొన్ని వ్యాసాలు – కవితలు – తోటపల్లి జగన్మోహన్‌రావు – 109 పేజీలు, 1/8 డెమీ, రు : 80, ప్రతులకు: తోటపల్లి జగన్మోహన్‌రావు, ఫ్లాట్ నెం. 504, మారుతి రెసిడెన్సీ, ఓల్డ్ కూరగాయల మార్కెట్, ముకురంపుర, కరీంనగర్; ఫోన్: 9963608930, ఇమెయిల్ : jaganseetaadi@gmail.com
- **తెలుగు – ఇంగ్లిష్ బొమ్మల నిఘంటువు** – కూర్పు : నాయుని కృష్ణమూర్తి – వియన్నార్ బుక్‌వర్ల్డ్ – 253 పేజీలు, 1/4 క్రౌన్, రు:175, ప్రతులకు: వియన్నార్ బుక్ వర్ల్డ్, చౌడేపల్లి – 517257, ఫోన్: 08581-256090







## వైద్య విద్య లక్షల్లో!

ఈ ఏడాది యాజమాన్య కోటా (సి కేటగిరి) మెడికల్ సీట్లు ఆయా మేనేజ్‌మెంట్లకు కోట్ల రూపాయల ఆదాయాన్ని సమకూర్చి పెట్టినట్లు తెలుస్తోంది. ఒక్కో ఎం.బి.బి.ఎస్. సీటును రు. 40 లక్షల నుంచి రు. 80 లక్షల వరకు అమ్ముకున్నట్లు సమాచారం. ఒక్కో బి.డి.ఎస్. సీటు రు. 15 లక్షల నుంచి రు. 20 లక్షల ధర పలికిందని తెలుస్తోంది. ఈ లెక్కన 19 ప్రైవేట్ మెడికల్ కాలేజీల్లోని 2450 సీట్లలో 40 శాతం సి కేటగిరీ కింద వచ్చే సీట్లు 980 సీట్లు. ఈ సీట్లపై దాదాపు రు. 500 కోట్ల వ్యాపారం జరుగుతోంది.

## రాజీనామాల తిరస్కరణ

ప్రత్యేక రాష్ట్ర సాధన కోసం తెలంగాణ ప్రాంతానికి చెందిన శాసనసభ్యులు మూకుమ్మడిగా చేసిన రాజీనామాలను అసెంబ్లీ స్పీకర్ నాదేండ్ల మనోహర్ తిరస్కరించారు. భావోద్వేగాలతో నిర్ణయం తీసుకుని ఎం.ఎల్.ఎ.లు రాజీనామాలు చేసినందున వాటిని ఆమోదించడం లేదని స్పష్టం చేశారు. రాజ్యాంగంలోని 190 (3) అధికరణం ఇచ్చిన అధికారం మేరకే ఈ నిర్ణయం తీసుకున్నట్లు వివరించారు. తెలంగాణ ప్రాంతానికి చెందిన 12 మంత్రులతో పాటు 101 మంది ఎం.ఎల్.ఎ.ల రాజీనామాలు ఆయన తిరస్కరించారు.

## మంజీర రచయితల సంఘంకు 25 ఏళ్లు

ప్రగతిశీల సాహిత్యాన్ని సృష్టిస్తూ, తన ప్రస్థానంలో 25 ఏళ్లను మంజీర రచయితల సంఘం పూర్తి చేసుకుంది. ఈ సందర్భంగా జూలై 23, 24 తేదీల్లో రెండు రోజుల పాటు 'మరసం' తన 25 ఏళ్ల సభను జరుపుకుంది. ఈ సభల్లో పలువురు ప్రముఖ రచయితలు, కవులు, కళాకారులు పాల్గొన్నారు. ఈ సభకు హాజరు కాలేకపోయిన అరుంధతీ రాయ్ తన సందేశాన్ని పంపారు. చిన్న రాష్ట్రాలకు తెలంగాణ కొత్తదారి చూపించాలని తన సందేశంలో ఆకాంక్షించారు.

## విద్యార్థులు 100 లోపు ఉంటే హాస్టల్ బంద్

వంద లోపు విద్యార్థులు ఉన్న హాస్టల్ల మూసివేతకు ప్రభుత్వం నిర్ణయించింది. ఇలా దాదాపు రాష్ట్రంలో ఐదు వందల హాస్టల్లు రద్దయ్యే అవకాశం ఉంది. జూలై 23న విజయవాడలో జరిగిన జోనల్ శాఖ సమావేశ అనంతరం జరిగిన విలేకరుల సమావేశంలో సంక్షేమ శాఖ మంత్రి పితాని సత్యనారాయణ ఈ విషయాన్ని తెలిపారు.

## పంట విరామం !

కోనసీమలోని 13 మండలాలకు చెందిన రైతులు పంట విరామ ఉద్యమాన్ని చేపట్టారు. అల్లవరం మండలం బెండమూర్లంక గ్రామంలో ఈ ఉద్యమం ప్రారంభమైంది. ధాన్య ఉత్పత్తులకు మద్దతు ధరతో సహా, తాము ఎదుర్కొనే అనేక సమస్యలను పరిష్కరించడంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల నిర్లక్ష్య వైఖరిని నిరసిస్తూ రైతులు ఈ ఉద్యమం చేపట్టారు. పంట విరామ ఉద్యమంతో సుమారు లక్షల ఎకరాలలో సాగు నిలిచిపోయింది.

## విద్యా సంస్థల బంద్

పాఠశాలలు, కళాశాలల్లోని సమస్యలను పరిష్కరించాలని కోరుతూ జూలై 27న రాష్ట్రవ్యాప్తంగా విద్యా సంస్థల బంద్ జరిగింది. ఎస్.ఎఫ్.ఐ., ఎ.ఐ.ఎస్.ఎఫ్., పి.డి.ఎస్.యు., ఎస్.ఎస్.ఎ. తదితర విద్యా సంఘాల ఐక్య కార్యాచరణ కమిటీ ఈ బంద్‌కు పిలుపునిచ్చింది.

## ఎరువుల ధరలకు రెక్కలు

ఎరువుల ధరలను పెంచుకునేందుకు ఇటీవల కేంద్రం ఇచ్చిన అనుమతితో పలు కంపెనీలు తమ ఉత్పత్తుల ధరలను అమాంతం పెంచేశాయి. బస్తా డి.ఎ.పి. (యాభై కిలోలు) ధర రు. 57 పెరగగా, కాంప్లెక్స్ ఎరువులు రు. 110 కి పైగా పెరిగాయి. ఈ ఏడాదిలో ఎరువుల ధరలు పెరగడం ఇది మూడవసారి. పెరిగిన ధరలు ఆగస్ట్ 1 నుంచి అమల్లోకి వచ్చాయి.

## కళాకారులపై ఉరిశిక్షను రద్దు చేయాలి

జార్ఖండ్ ఆదివాసీ, దళిత సాంస్కృతిక కార్యకర్తలు జీతన్ మరాండీ, ఛత్రపతి మండల్, మనోజ్ రాజ్వర్, అనీల్ రామ్‌ల ఉరిశిక్షను రద్దు చేయాలని డిమాండ్ చేస్తూ గ్రీన్‌హంట్ వ్యతిరేక పోరాట కమిటీ ఆధ్వర్యంలో ఆగస్ట్ 2న హైదరాబాద్‌లోని బషీర్‌బాగ్ ప్రెస్ క్లబ్‌లో బహిరంగ సభ జరిగింది. అలాగే సల్వాజుడుం రద్దుపై సుప్రీం కోర్టు ఇచ్చిన తీర్పును కేంద్ర, చత్తీస్‌గఢ్ ప్రభుత్వాలు అమలు చేయాలని వక్తలు డిమాండ్ చేశారు. ఈ సభలో వక్తలుగా బొజ్జాతారకం, ప్రొ. శేషయ్య, ఝాన్సీ, వరవరరావు, గద్దర్ తదితరులు పాల్గొనగా, రఘునాథ్ ఈ సభకు అధ్యక్షత వహించారు.

## సత్యాంజనేయ కన్నుమూత

సుప్రసిద్ధ హరికథా కళాకారిణి వి. సత్యాంజనేయ భాగవతారిణి (65) ఆగస్ట్ 4న అనారోగ్యంతో చనిపోయారు. కడప జిల్లా రాయచోటి తాలుకా, సురభి గ్రామం ఆమె స్వస్థలం. ఆర్. శంభులింగం, శేషమ్మ దంపతులకు 1946లో ఆమె జన్మించారు. హరికథలు చెప్పడమే కాకుండా, సురభి సంస్థను స్థాపించి పలు నాటకాలు వేశారు. హరిశ్చంద్రలో నక్షత్రకుడు, కురుక్షేత్రంలో అశ్వత్థామ పాత్రలలో ఆమె అద్భుతంగా ఒదిగిపోయేవారు.

## జగన్, ఎమ్మార్‌లపై సిబిఐ దర్యాప్తు

మాజీ ముఖ్యమంత్రి వై.ఎస్. రాజశేఖరరెడ్డి కుమారుడు, కడప ఎం.పి. వై.ఎస్. జగన్మోహన్ రెడ్డి అక్రమ ఆస్తులు కూడబెట్టారని హైకోర్టు నిర్ధారించింది. జగన్ అక్రమ ఆస్తులపై పూర్తి స్థాయి దర్యాప్తు జరపాలని హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ నిస్సార్ అహ్మద్ కక్రూ, జస్టిస్ విలాస్ వి. అఫ్జల్ పూర్కర్‌లతో కూడిన ధర్మాసనం సిబిఐ ని ఆదేశించింది. అలాగే ఎమ్మార్ ఆస్తుల వ్యవహారంలోనూ సిబిఐ దర్యాప్తును ఆదేశించింది.

## 14 ఎఫ్ రద్దు

సుదీర్ఘకాలంగా తెలంగాణ ప్రజలను ఆందోళనకు గురిచేస్తూ, ఉద్యోగ నియామకాల్లో నష్టదాయకంగా మారిన 14 ఎఫ్ క్లాజును రద్దు చేస్తూ ఆగస్ట్ 12న రాష్ట్రపతి నోటిఫికేషన్ వెలువడింది. పోలీసు నియామకాలకు సంబంధించి హైదరాబాద్ పూర్తిగా తెలంగాణకు సొంతమైంది. 'ఫ్రీ జోన్' వాదానికి తెరపడింది. 1975 ఆంధ్రప్రదేశ్ పౌర ఉద్యోగాలు ఉత్తర్వు 14వ పేరాలోని 'ఎఫ్' క్లాజును తొలగిస్తున్నట్లు రాష్ట్రపతి నోటిఫికేషన్‌లో పేర్కొన్నారు. ఆ మేరకు రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి జి.ఒ. 494 జారీచేశారు.

## పని చేయని కాలానికి జీతం లేదు

ఉద్యోగులు పనిచేయని కాలానికి వారి జీతభత్యాలలో కోత విధించాలని నిర్ణయిస్తూ ప్రభుత్వం గతంలో జారీచేసిన జి.ఒ. 177ను రాష్ట్ర హైకోర్టు పునరుద్ధరిస్తూ ఆగస్ట్ 16న మధ్యంతర ఆదేశాలను జారీ చేసింది. ఉద్యోగ సంఘాల ఒత్తిడి మేరకు ప్రభుత్వం జారీచేసిన జి.ఒ. 1617పై హైకోర్టు స్టే విధించింది. వీ

*దేశంలోని సంపదలన్నీ ఆ సంపదను సృష్టించిన ప్రజలవే తప్ప దేవుళ్లవీ, రాజులవీ ఎంత మాత్రం కాదని అంటున్నారు*

**కె.వి. కూర్మనాథ్**

# సృష్టించిన ప్రజలదే ఈ సంపద

*రాజులు, రారాజులు బతికి మనల్ని చంపుతారు*
*మనల్ని చంపుతూ బతుకుతారు. అందుచేత*
*రాజులు బతకడం నాకిష్టంలేదు*

- రావిశాస్త్రి

పద్మనాభస్వామి ఆలయంలో బయటపడ్డ బంగారం, వజ్రవైఢూర్యాలను, ఆభరణాలను చూసి ప్రపంచం నివ్వెరపోయింది. ఎన్నో బ్యాంకుల డిపాజిట్ల మొత్తంకంటే, ఎన్నోదేశాల బడ్జెట్లకంటే విలువైన ఆ నిధుల్ని చూసి అందరూ అవాక్కయ్యారు. ఆ ఆస్తుల విలువ రెండులక్షల కోట్లనీ, ఐదులక్షల కోట్ల రూపాయల్లో ఉంటుందని, ఆరో గదిలో ఇంకా కళ్లు చెదిరే నిధులు నిక్షిప్తమై ఉన్నాయనీ వార్తలొస్తున్నాయి. నాగబంధం వేసివున్న ఆ ఆరోగది తెరిస్తే దేశానికి అరిష్టమనీ, తెరవాలో వద్దో దేవుడ్నే అడగాలని హిందూ ఛాందసవాదులు బెదిరిస్తున్నారు. దేవుడితో మాట్లాడిన 'జ్యోతిష్య శాస్త్రవేత్త'లు ఆరోగది తెరవడం 'ఆయనకి'ష్టం లేదని ప్రకటించారు.

పద్మనాభస్వామి నిధులు మనముందు చాలాప్రశ్నలు తీసుకు వచ్చాయి. దేవుడిపేరుతో ఈ దేశంలో జరిగిన అన్యాయాలు, ప్రజల మీద జరిగిన దాడులు, మతం- రాజకీయం మధ్య యుగాల నుంచీ నడుస్తున్న అవగాహన, దేవుడనే భావనచుట్టూ ఒక మాయ (మిత్)ను సృష్టించి ప్రజల్ని మోసగించడం, ప్రజల్ని పీడించి, వారి ఆస్తుల్ని కొల్లగొట్టి నిధులు సమకూర్చుకుని వాటి రక్షణ కోసం దేవుడ్ని అడ్డం పెట్టుకోవడం - ఇట్లాంటి ఎన్నో అంశాలు మనముందుకు వచ్చాయి. నిజానికి ఇవన్నీ ఇప్పటికే ఎన్నోసార్లు నిరూపితమైనప్పటికీ, దొరికిన నిధులు మొత్తం ఈ అంశాలను మరోసారి బలంగా మనముందుకు తీసుకొచ్చాయి.

మొట్టమొదటి అంశం-ఇంత పెద్దమొత్తం నిధులు ఒకచోట చేరడానికి ప్రజల మీద ఎంత పీడన, హింస జరిగి ఉంటుందో కదా. ఎన్ని అన్యాయమైన పన్నులు, ఎన్ని తీవ్రమైన శిక్షలు పడి ఉంటాయో కదా!

పదిహేడోశతాబ్దం మధ్యలో అనిలమ్ తిరునాల్ అనే రాజు ట్రావన్‌కోర్ రాజ్యాన్ని 'పద్మనాభస్వామి'కి ధారాదత్తం చేసాడు. తనూ, తన వారసులందరూ పద్మనాభుడికి దాసులమనీ, ఆయన తరఫునే రాజ్యాన్ని పరిపాలిస్తామనీ ప్రకటించాడు. అప్పట్నుంచీ ఇప్పటివరకూ అలా ఆ రాజకుటుంబీకులే 'దాసు'లుగా పద్మనాభుడ్ని కొలుస్తూ పాలించేవారు. ఇప్పటికీ రాజకుటుంబీకులే ప్రతిరోజూ అభిషేకం చేస్తారనీ, చెయ్యని రోజున పరిహారం చెల్లిస్తారని మీడియా కథలు కథలుగా రాసింది.

## సురక్షిత ప్రదేశం

దేవుడిదే రాజ్యమైనపుడు, ఆయన ప్రతినిధుల్ని కాదనే ధైర్యం ఎవరు చేస్తారు? 'దాసుడి' త్యాగనిరతిని ప్రశ్నించే వారెవరుంటారు? ప్రజల స్వేదం బంగారంగా, వజ్రాలుగా మారి ఉంటాయి. అడ్డూ అదుపులేని పన్నులు పద్మనాభుడి ఆరు గదుల్నీ డబ్బుతో వెల్లువెత్తించి ఉంటాయి. ప్రజల మిగులంతా పద్మనాభుడి కంఠహారాలై మెరిసి ఉంటాయి. దేవుడి 'లీలల' మీద, రాజుల విన్యాసాల మీద ఎంతో శ్రద్ధ చూపించి పుంఖాను పుంఖాలుగా పురాణాలు సృష్టించిన ఈ దేశం చరిత్ర రచన పట్ల, ముఖ్యంగా ప్రజల చరిత్ర పట్ల ఏనాడూ దృష్టి పెట్టలేదు. అందువల్ల గత 260 సంవత్సరాల్లో కేరళ రాజ్యంలో ప్రజలు ఎన్నెన్ని బాధలు పడ్డారో తెలిసే అవకాశం లేదు. లిఖిత సంస్కృతిలో వీటి ఆధారులు లేకపోయినా మౌఖిక సంప్రదాయంలో వాటి ఆనవాళ్లు దొరకొచ్చు. ఇక్కడి ఆస్తులు కేవలం 1750కి తర్వాత వచ్చినవి కావు. అంతకుముందు వైనాడ్ వంశానికి చెందిన భూతల వీరమార్తాండవర్మ రాజ్యాన్ని నలుదిక్కులా విస్తరించడంతో పాటు కోటలు కట్టాడు. 'పద్మనాభుని' సంపదను పెంచడంలో ముఖ్యమైనపాత్ర వహించాడు.

అప్పుడప్పుడే దేశంలోకి వర్తకానికని వచ్చి రాజ్యాలను ఆక్రమించుకోవడం మొదలుపెట్టిన డచ్, పోర్చుగీసు, బ్రిటిష్ ప్రభుత్వ ప్రతినిధులు కూడా పద్మనాభుడికి కానుకలిచ్చారు. డచ్ ఈస్టిండియా కంపెనీ సైన్యాన్ని నడిపిన ఎడ్మిరల్ లెనోయ్ అనిలమ్ తిరునాళ్ సైన్యానికి కమాండర్‌కు నేతృత్వం వహించాడంటే విదేశీయులతో ట్రావన్‌కోర్ రాజు ఎంతలా కలిసిపోయాడో అర్థంచేసుకోవచ్చు. బ్రిటిష్ ప్రభుత్వ ప్రతినిధైన కల్నల్ మన్రో బంగారం తాపినగొడుగును, బాగా అలంకరించిన గుర్రాన్ని పద్మనాభుడికి బహుమతిచ్చాడు.

'క్షత్రియుడు' అని అనిపించుకోడానికి ట్రావన్‌కోర్ రాజులు బ్రాహ్మలకు, దేవాలయాలకు విపరీతంగా 'మహాదానాలు' చేసేవారు. ఈ దానాల విలువ ఎంత ఉండేదంటే ఖజానా ఎప్పటికప్పుడు ఆర్చుకుపోయేది. ఇంతపెద్ద మొత్తం ఖర్చుపెట్టినా వారు సంపాదించుకున్న టైటిల్ ఆరేళ్లకంటే ఎక్కువ ఉండేది కాదు. మళ్లీ ఖర్చుపెట్టేవాళ్లు.

స్వయంగా ఆక్రమణదారుడూ, క్రూరుడూ అయిన డల్‌హౌసీ ఈ తతంగాన్ని చూసి రద్దు చెయ్యమన్నాడు. అంతిమంగా ప్రభుత్వం సొమ్మును రక్షించుకోవడం అతడి అసలు ఉద్దేశం.

ప్రజల డిమాండ్లకు తలొగ్గి చిట్టచివరి ట్రావన్‌కోర్ రాజు చితిర తిరునాళ్ దేవాలయాల ప్రవేశంపై ఉన్న నిషేధాన్ని తొలగించాడు. అయితే

# వేగుంట మోహన్ ప్రసాద్ (మో) మృతి

'మో'గా తెలుగు కవిత్వ ప్రపంచంలో ప్రసిద్ధులైన వేగుంట మోహన్ ప్రసాద్ (69) బ్రెయిన్ డెడ్ అయి 2011 ఆగస్ట్ 2న చనిపోయారు. అప్పటికి రెండు రోజుల క్రితం ఇంట్లో మంచం పైనుంచి పడిపోయిన ఆయన విజయవాడ లోని ఓ ప్రైవేట్ ఆసుపత్రిలో చికిత్స పొందుతున్నారు. తలలో తీవ్ర రక్తస్రావం కావడంతో కదలిక నిలిచిపోయినట్లు ఆగస్ట్ 2న డాక్టర్లు తెలియ పరిచారు. హైదరాబాద్‌లోని 'మోహన్' అనే స్వచ్ఛంద సంస్థకు ఆయన తన అవయవాలను దానం చేశారు. ఆ మేరకు కళ్లు, కిడ్నీలు, కాలేయం తీసుకోవడానికి కుటుంబ సభ్యులు సహకరించారు. తెలుగు కవిత్వంలో 'మో' చెరగని ముద్ర వేశారు. ఆధునిక ఆంగ్ల కవిత్వాన్ని తెలుగు పాఠకులకు రుచి చూపించారు. పాశ్చాత్య కవిత్వాన్ని ప్రత్యేకించి రష్యన్, ఫ్రెంచ్ సాహిత్యాలను



పరిచయం చేశారు. ఆత్మాశ్రయ ధోరణికి పెద్ద పీట వేసే స్వాప్నికుడిగా, అన్వేషకుడిగా తెలుగు సాహిత్యంపై బలమైన ప్రభావం వేశారు. 1969లో ఆయన తొలి కవితా సంపుటి 'చితి-చింత' వెలువడింది. వైవిధ్యం కలిగిన కవిగా మో అప్పటి నుంచి గుర్తింపు పొందారు. ఆయనవి మొత్తం తొమ్మిది కవితా సంపుటాలు వెలువడ్డాయి. ఆయన చివరి రచన 'నిషాదం' 2010లో వెలువడింది. 1990లో 'బతికిన క్షణాలు', 1991లో 'రహస్తంత్రి', 1993లో 'పునరపి', 1999లో 'సాంధ్య భాష', 2004లో 'వెన్నెల నీడలు' వెలువడ్డాయి. మో 1942లో గుంటూరు జిల్లాలో జన్మించారు. విజయవాడలో ఆంగ్లోపాధ్యా యుడుగా పనిచేసి పదకొండేళ్ల క్రితం పదవీ విరమణ చేశారు. ద్రవిడ యూనివర్సిటీలో అనువాదకుడిగా మూడేళ్లు పనిచేశారు.

ఈయన హయాంలోనే ప్రధానమంత్రి సిపి రామస్వామి అయ్యర్ పునర్ప్రా - వాయలార్ ఉద్యమాన్ని నిర్దాక్షిణ్యంగా అణచివేశాడు. వేలమందిని పొట్టన పెట్టుకున్నాడు. చివరకు ప్రజలచేతిలో చావు తప్పించుకుని మద్రాసు పారిపోయాడు.

ఒక అడుగు ఎత్తున్న పోతపోసిన బంగారు విష్ణువు విగ్రహం, పది అడుగుల పొడవున్న బంగారు చైన్, బస్తాలనిండా వజ్రాలు, వందల కిలోల బంగారు నాణేలు, వందల సంఖ్యలో రోమన్ బంగారు నాణేలు, బంగారు నాణేలతో చేసిన దండలు, వడ్డాణాలు, కిరీటాలు, బెల్జియం డైమండ్లు ఉన్నాయి. ఇవి కొన్ని మాత్రమే. ఐదుగదుల్లో దొరికిన ఆస్తులన్నింటిని లెక్కపెట్టడం పూర్తయితే అసలు విలువ తెలుస్తుంది.

## ఆరోగదీ, అధోగతీ!

మతం ఎంతకైనా తెగిస్తుంది. ప్రజల్ని అజ్ఞానంలో ఉంచడానికీ, బెదిరించడానికీ, బ్లాక్‌మెయిల్ చెయ్యడానికీ ఎన్ని కుయుక్తులు పన్నాలో అన్నీ పన్నుతుంది. ప్రజల రక్తమాంసాల్ని తోడుకున్న రాజుల్ని ఇన్నాళ్లూ కాపాడడమే కాదు, ఇంకా వాళ్లకే సంపద దక్కేట్టు చెయ్యడానికి ఎలా అడ్డుపడుతోందో చూడండి. గుడిలోని ఐదు నేలమాళిగల్ని తెరవచ్చేమో గాని, నాగబంధంతో ముడివేసిన ఆరోగదిని తెరవరాదంటున్నారు ఆలయ పూజారులు, మతపెద్దలు. తెరిస్తే అపచారమని, మొత్తం దేశానికే అరిష్టం చుట్టుకుంటుందనీ ప్రచారం చేస్తున్నారు. తెరవాలా వద్దనేది దేవుడ్నే అడుగుదామని చెప్పి పూజలు చేసి నాటకమాడి దేవుడికిష్టం లేదని తేల్చేశారు. దేవుడికంటే దేవుడికనికాదు, దేవుడి ట్రస్ట్ నడిపే రాజకుటుంబానికని. అంతే, సుప్రీంకోర్టు ఆగిపోయింది ఇంకేం మాట్లాడకుండా. నాగబంధం తెంచితే ఏమవుతుంది? చంద్రముఖి సినిమాలో లాగా పెద్దపాము వచ్చి చుట్టుకుంటుందా? లేకపోతే సునామీ వస్తుందా? అడిగేవారెవరూ లేరు. పునర్ప్రా-వాయలార్ ఉద్యమంలో వేలాదిగా ప్రజలను మార్తాండ వారసులు ఊచకోత కోస్తే ఏ పాములూ రావు, వరదలూ ఉపద్రవాలూ ముంచెత్తవు! ఎందుకంటే ఊచకోతకు గురైనవారు రాజకుటుంబీకుల ఉనికిని ప్రశ్నించారు. అధికారాన్ని ప్రశ్నించినప్పుడల్లా రాజుల కాలంలో అయితే దేవుడూ, ఇప్పుడైతే చట్టాలూ ప్రభుత్వం చేతిలో తిరుగులేని ఆయుధాలవుతాయి. దేవుడ్నీ, చట్టాల్నీ ప్రశ్నించడమంటే రాజధిక్కారమూ, దేశధిక్కారమూ అవుతుంది. ప్రైవేటు ప్రాజెక్టుల కోసం, సెజ్‌లకోసం ప్రజల ఆస్తుల్ని తీసుకునేటప్పుడు దేవుడ్ని అడగాలనీ, జ్యోతిష్యుల్ని సంప్రదించాలనీ, షారిమాటల్ని వినాలనీ కోర్టులు ఎందుకు అనుకోవు?

ఆధునిక రాజులకు, అప్పటి రాజులకూ తేడాలేదు. కేవలం కాలం మార్పులకు అనుగుణంగా జరిగిన రూపాంతరం మాత్రమే. ఇప్పుడెలా అయితే స్విస్‌బ్యాంకుల్లోంచి డబ్బును వెనక్కి తీసుకురావడం అసాధ్యమని అంటున్నారో, అప్పటి సంపదనుకూడా ప్రజలకు దక్కడం అసంభవమని అంటున్నారు. ప్రజల రక్తమాంసాల, స్వేదాల సాక్షిగా పోగుపడ్డ సంపద ప్రజలది కావాలి. ప్రజలది కావడమంటే ప్రభుత్వ ఖజానాలో జమచేసి మరోరకం అవినీతికి తెరతియ్యమని కాదు. కేరళలో అట్టడుగు వర్గాలకు ఆ సంపద చేరేలా చెయ్యాలి. దీనికోసం రాజకీయ నాయకుల, అవినీతి పరుల వాసనలేని కమిటీ వెయ్యాలి. ఆరోగది తెరవాలి. పౌరసమాజం నుంచి మచ్చలేనివారితో కమిటీ వేసి, వారిని ధర్మకర్తలుగా చేసి ఏయే వర్గాలైతే శతాబ్దాలుగా నలిగిపోయారో ఆయావర్గాలకు ఉపయోగపడే కార్యక్రమాలు చేపట్టాలి. చిన్న, చిన్న ఉద్యోగాల కోసం దేశం నలుమూలలా, ప్రపంచవ్యాప్తంగా తిరగాల్సి వస్తున్న కేరళవాసులకు ఉన్న చోట తలెత్తుకు తిరగగలిగే ఉపాధి అవకాశాలను ఏర్పర్చాలి.

దేవాలయాల చుట్టూ, దేవుళ్ల చుట్టూ ఉన్న మాయపొరల్ని విడగొట్టే చైతన్యాన్ని పెంచే కార్యక్రమాల్ని చేపట్టాలి.

ఇది కేవలం పద్మనాభస్వామి దేవాలయానికి సంబంధించిన అంశం మాత్రమే కాదు. దేశంలోని అన్ని దేవాలయాల ఆస్తులపై సమగ్ర విచారణ జరిపించాలి. 'దేవుడి' సంపద, భూములు ఎవరి చేతుల్లో ఉన్నాయో లెక్కతియ్యాలి. సంపదనంతటినీ దాన్ని సృష్టించిన ప్రజలకి చెందేటట్టు చూడాలి. సంపద ప్రజలది - దేవుడిదీ, రాజులదీ, ప్రభువుల్దీ, ప్రభుత్వానిదీ కాదు.

(రచయిత పాత్రికేయులు)

ఇటీవలి బ్రిటన్‌లోని పరిణామాలకు ప్రజల్లో పేరుకుపోయిన నిరాశా నిస్పృహలతో పాటు మొత్తంగా దిగజారిపోయిన జీవన స్థితిగతులే కారణమంటున్నారు **ఎ. నరసింహారెడ్డి**

# బ్రిటన్‌లో ప్రజాగ్రహ జ్వాలలు..

బ్రిటన్ పోలీసులు అకారణంగా ఒక అమాయక వ్యక్తిపై తప్పుడు ఆరోపణలు చేసి ఆగస్ట్ 6న టోటెన్‌హాం లోని ఫెర్రిలేన్ ప్రాంతం వద్ద ఒక వ్యాన్‌లో ప్రయాణిస్తున్న ఆఫ్రో-కరీబియన్ జాతీయుడైన మార్క్ దుగ్గన్‌ను అదుపులోకి తీసుకొని కాల్చి చంపడంతో లండన్ ప్రజల్లో ఆందోళన ఆగ్రహం వెల్లువెత్తింది. ఇంత విస్తారమైన అశాంతికి, అది ఒక్కసారిగా పెల్లుబికడానికి కేవలం మార్క్ దుగ్గన్ అనే 29 ఏళ్ల ఆఫ్రో-కరీబియన్ యువకుడిని పోలీసులు కాల్చి చంపడమే కారణం అని భావిస్తే పొరపాటే అవుతుంది. బ్రిటన్‌లో పేదలు విస్తారంగా నివసించే పలు చోట్ల పౌర హక్కులకు ఎప్పుడూ విలువుండక పోవడం, వారి పట్ల వివక్ష, అత్యాచారాలు నిరంతరంగా కొనసాగడం, అందుకు వారి నిరసనలు సాధారణమేగాని, నిజానికి అటువంటి ఘటనల పట్ల ఆగ్రహం ఇంతగా కట్టలు తెంచుకోవడానికి తగిన నేపథ్యం అక్కడ నివసించే ప్రజల జీవన స్థితిగతుల్లోనే ఉంది. బ్రిటన్‌లో చెలరేగిన ప్రజా ఆగ్రహ జ్వాలలు ప్రధాని డేవిడ్ కామెరూన్‌కు పెనుసవాళ్లు విసిరాయి. మీడియా కామెరూన్ ప్రభుత్వాన్ని అసమర్థ ప్రభుత్వంగా ప్రచారం చేసింది.

వలసల కాలంలో, ఆ తర్వాత కూడా వలస దేశాల నుండి బ్రిటన్, ఫ్రాన్స్, అమెరికా లాంటి సామ్రాజ్యవాద దేశాలకు అత్యధికులు వెళ్లి అక్కడనే స్థిరపడ్డారు. స్థిరపడిన వారిలో అత్యధికులు ప్రధాన నగరాలకు పొలిమేరలో నివసిస్తున్నారు. వారి చదువులు, ఉపాధి, ఆరోగ్యం, భద్రత, పౌర వసతులు, సంస్కృతి విషయంలో స్థానిక ప్రభుత్వాలది ఇప్పటికీ వివక్షా దృష్టే. అక్కడ పేదరికం, నిరుద్యోగంతో పాటు నేరాలు కూడా ఎక్కువే. వలసవాద కాలం నాటి వివక్ష, అణచివేత విధానాలు ఇప్పటికి కూడా అదే విధంగా కొనసాగుతుండడం ఈ అశాంతికి అగ్గికి ఆజ్యం పోసినట్లయింది. అల్లర్లకు అసలు మూలాలు పాశ్చాత్యుల వలస సామ్రాజ్యవాద దృక్పథంలో ఉన్నాయి. వీరు తమ పొరుగున గల ఆఫ్రికా, అరబ్, లాటిన్ అమెరికాలు, ఆసియా దేశాలను సుదీర్ఘకాలం పాటు అన్ని విధాల కొల్లగొట్టడమే గాక, అక్కడి నుంచి కోట్లాది మందిని బానిసలుగా, కాంట్రాక్టు కూలీలుగా, ఇతర పనులకు తమ దేశాలకు, తమ పాలనలోని కాలనీలకో బలవంతంగా తీసుకొని పోయారు. రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత ఆయా దేశాలు స్వాతంత్ర్యం సాధించుకున్న తర్వాత కూడా చౌకరేట్ల కూలీలుగా వలస దేశాల నుండి తమ దేశాలలో పని చేయడానికి రానిచ్చారు. కానీ ఆ కూలీల పేదరికం, వారి పట్ల కొనసాగిన వివక్ష పెరుగుతూనే వచ్చింది. మరోవైపు బయటి నుంచి వచ్చిన వారిపై నిఘా, రకరకాల ఆంక్షల విధింపు పెరుగుతోంది. అందులో నుంచి ఉద్భవించిన అసంతృప్తే ప్రస్తుత అల్లర్లకు అసలు కారణం.

గత ఎన్నికల్లో టోరీ - ఉదారవాద - ప్రజాస్వామిక సంకీర్ణ ప్రభుత్వం డేవిడ్ కామెరూన్ నాయకత్వంలో అధికారంలోకి వచ్చింది. థాచర్ నాయకత్వంలోని గత లేబర్ పార్టీ ప్రభుత్వం పెరిగిన యుద్ధ వ్యయాన్ని తీర్చడానికి 156 బిలియన్ డాలర్ల దేశీయ రుణాన్ని చేసింది. పెద్ద ఎత్తున అప్పులు చేసి బడ్జెట్ లోటును పూడ్చడం వలన ఈ సంక్షోభ పరిస్థితులు వచ్చాయి. ఈ నేపథ్యంలో అధికారంలోకి వచ్చిన కామెరూన్ మునిగె నావను ఒడ్డెక్కించడం కోసమని కఠినమైన ప్రజావ్యతిరేకమైన నిర్ణయాలు తీసుకున్నారు. 83 బిలియన్ డాలర్ల మేరకు ప్రభుత్వ వ్యయంలో కోత విధిస్తున్నట్లుగా కామెరూన్ ప్రకటించాడు. ఫలితంగా ప్రజలపై భారం పడింది. తమ ఆదాయాలు కోల్పోయారు. జీవన వ్యయం పెరిగిపోయింది. 'విశాల సమాజం' అనే ఆలోచనల్ని ప్రచారంలో పెట్టాడు. 'ప్రజా అధికారం', 'స్థానిక సంస్థల సాధికారత' అనడం మొదలు పెట్టాడు. స్థానిక సంస్థలు తమ స్వీయ నిధుల నుండే తమ పనులను నెరవేర్చుకోవాలని, ప్రజా సేవలకై ప్రభుత్వంపై ఆధారపడడాన్ని మానుకోవాలనీ ప్రజలకు సలహాలిచ్చాడు. 'సాధికారత, స్వచ్ఛందం' లాంటి పడికట్టు పదాలన్నీ ప్రజల పట్ల గల ప్రభుత్వ బాధ్యతల నుండి తప్పుకోవడానికి, ప్రజలను మరింతగా దోపిడివర్గాల కోరలకు ఎరవేసేందుకు దోపిడి పాలకులు ఉపయోగించే పరిభాష తప్ప మరోటి కాదు.

బ్రిటన్ యువతలో నెలకొన్న అసంతృప్తి, చుట్టుముట్టిన నిరాశ, అస్థిరతపై ఆందోళన, ఉపాధి అవకాశాల కరువు, ఆజ్యం పోసిన పొదుపు చర్యలు, జీతాల కుదింపులాంటి సమస్యలకు తోడు ఆగస్ట్ మొదటి వారంలో పోలీసు కాల్పుల్లో దుగ్గల్ మరణించిన నేపథ్యంలో ప్రజల నిరసన తీవ్రరూపం సంతరించుకోవడంతో లండన్ నగర ఉత్తర, ఆగ్నేయ ప్రాంతాలు అల్లర్లతో అల్లకల్లోలమయ్యాయి. బ్రిటన్ ప్రభుత్వం ఒక లండన్ నగరంలోనే 16 వేల మంది పోలీసులను అదనంగా మోహరించింది. వేలాది మందిని అరెస్టు చేసింది. అరబ్ సమాజంలో పలు దేశాల్లో పెను మార్పులకు గురి చేసిన ప్రభుత్వ వ్యతిరేక ఉద్యమాలకు సహకరించిన సోషల్ నెట్‌వర్కింగ్ వెబ్‌సైట్లు, ట్విట్టర్, ఫేస్‌బుక్ వంటివి ప్రజల ఆగ్రహానికి ఆజ్యం పోశాయి. కొంత ఆధునికంగా బ్రిటన్‌లో జరుగుతున్న ఘర్షణల్లో యువతను బ్లాక్‌బెర్రీ, ఐఫోన్‌లు త్వరితంగా ఒక చోటికి చేర్చాయి. తక్షణ సమస్యగా ఆగస్ట్

6న మార్క్ దుగ్గన్ మరణంతో ఈ ఘటనల పరంపర మొదలైంది. దుగ్గనే కాల్పులు జరిపినట్లు పోలీసులు చేసిన ప్రకటనను కట్టుకథగా మీడియా ప్రచారం చేసింది. అతను లండన్‌లోని టోటెన్‌హాం ప్రాంతంలో నివసిస్తున్న ఆఫ్రో-కరీబియన్ యువకుడు. అతనికి లండన్‌లోని టోటెన్‌హాం ప్రాంతంలో మాదక ద్రవ్యాలు విక్రయిస్తున్న ముఠాతో సంబంధముందని పోలీసులు చెబుతున్న విషయాన్ని కూడా ప్రజలు నమ్మలేదు. మరోవైపు దుగ్గనే తమపై కాల్పులు జరిపాడని పోలీసులు బుకాయించడంతో దక్షిణ లండన్‌లో కొద్దిమంది యువతీ యువకులు పోలీస్ స్టేషన్ ఎదుట నిరసన ప్రారంభించారు. ఆ చిన్న నిరసనను కూడా సహించలేని పోలీసులు నిరసనకారులపై తీవ్ర నిర్బంధాన్ని ప్రయోగించారు. దీనితో ప్రజాగ్రహానికి కారణమై నిరసనలు పెల్లుబికాయి. క్రమంగా అల్లర్లు ఒకటి రెండు రోజుల్లోనే బ్రిటన్‌లోని లండన్, మాంచెస్టర్, సల్‌ఫార్డ్, లివర్‌పూల్, నోవర్‌హాంప్టన్, నాటింగ్‌హాం, లీసెస్టర్, బర్మింగ్‌హాం, బ్రిస్టల్, కెంట్ నగరాలకు విస్తరించాయి. ఇంగ్లాండ్‌లోని ప్రతి నగరం ఏదో ఒక అశాంతితో రగిలిపోతోంది.

బ్రిటిష్ నిరుద్యోగ యువజనులలోని అసంతృప్తిని, ఆగ్రహావేశాలను దారి మళ్లించడానికి విదేశీయులు నివసిస్తున్న మురికి వాడలను బూచిగా ప్రభుత్వం, మీడియా చిత్రీకరించింది. బ్రిటన్‌లో నివసించే ఆఫ్రికన్, కరీబియన్, అరబ్ జాతి ప్రజల పట్ల విద్వేషాన్ని రెచ్చగొడుతున్నారు. వారిని నేరస్తులుగా, రౌడీలుగా ప్రచారం చేస్తున్నారు. మీడియా గత కొంత కాలంగా చేస్తున్న దుష్ప్రచారమిది. చెరుకు తోటల్లో పనులు చేస్తున్న విదేశీ శ్రామికుల్ని అవమాన పరుస్తున్నా భరించారు, కానీ వారి పిల్లలు అలా భరించడానికి సిద్ధంగా లేరు. ఈ యువతే నేడు ముసుగులు ధరించి తమ ఆగ్రహాన్ని దహనాలు, లూటీల ద్వారా తెలియజేస్తున్నారు. మరోవైపు శ్వేతజాతి నిరుద్యోగ యువత కూడా ఈ ఆందోళనలో పాలు పంచుకుంటోంది. నిరసనకారుల హింసకాండను నేర ప్రవృత్తి కలిగిన దోపిడి మూకల పనిగా బ్రిటన్ ప్రధాన రాజకీయ పార్టీలతో సహా అక్కడి మీడియా కూడా విస్తృతంగా ప్రచారం చేసింది. ప్రభుత్వం తీసుకున్న పొదుపు చర్యలకు వ్యతిరేకంగా, పోలీసుల దురాగతాలకు వ్యతిరేకంగా ఆకస్మికంగా ఎగిసిన నిరసన జ్వాలల్లో కొందరు నేరగాళ్లు కూడా పాల్గొన్నమాట నిజమే. కానీ, ఈ ప్రచారం మాటున ప్రజా ఆగ్రహాన్ని అణచివేసే ప్రభుత్వ నిరంకుశ ధోరణి లేకపోలేదు. మరోవైపు నిరసనకారుల ఆందోళనలు లక్ష్యాత్మకంగా జరగడం లేదు. రాజకీయ పోరాటాలకు బదులు లూటీలు, దహనాలు ప్రధాన ఎజెండాగా ముందుకు రావడం ప్రజాస్వామిక వాదులకు ఆందోళన కలిగిస్తోంది.

ఆందోళనకారులు దుకాణాలను లూటీ చేసి తగులబెట్టారు. వాహనాలకు నిప్పుపెట్టారు. అల్లర్లు జరుగుతున్న నగరాల్లో ఉదయం నుంచి సాయంత్రం 5 గంటల వరకు అంతా ప్రశాంతంగా కనిపిస్తోంది. సాయంత్రం ఐదు గంటల నుండి అర్ధరాత్రి వరకు లూటీలు, దహనకాండ కొనసాగుతోంది. ప్రతిఘటించిన వారిపై దాడులు చేశారు. పెట్రోల్ బాంబులతో దుకాణాలను, వాహనాలను తగులబెట్టారు. అలంకార వస్తువులు, బంగారు నగలు, టీవీలు, బ్రాండెడ్ దుస్తులు, బూట్లు లాంటి వినిమయ వస్తువులనే నిరసనకారులు అందిన కాడికి దోచుకున్నారు. దుకాణాలలోని గల్లపెట్టెలు, ఏటిఎంలు, బ్యాంకుల జోలికి నిరసనకారులు పోలేదు. పెద్ద పెద్ద షాపులను లూటి చేశారు తగులబెట్టారు కాని చిన్న దుకాణాల జోలికి వెళ్లలేదు, ఒకవైపు వర్గ దృష్టి, మరోవైపు విపరీతంగా పెరిగిన వినిమయ సంస్కృతి ప్రభావం నిరసన కారుల్లో ఉందనడానికి నిదర్శనం. విలాస జీవితం గడిపే స్థితిపరులపైనే దాడులు కొనసాగాయి కానీ, సామాన్య ప్రజల జోలికి నిరసనకారులు వెళ్లలేదు. ఆందోళనకారులు అంతా 15-25 ఏళ్ల యువతే. ఆందోళనకారులను అడ్డుకునేందుకు పచ్చి మితవాద గ్రూప్ 'ఇంగ్లిష్ డిఫెన్స్ లీగ్' రంగంలోకి దిగినట్లు ఐడిఎల్ నేత స్టెఫెన్ లెన్నన్ అసోసియేటెడ్ ప్రెస్‌కు తెలుపడంతో ఆందోళనకర పరిణామంగా పరిస్థితి మారింది. గత నెలలో 77 మందిని చంపిన ఆండ్రెస్ బెహ్రింగ్ బ్రీవిక్ ఐడిఎల్‌ను ఒక స్ఫూర్తిగా పేర్కొనడం మరింత ఆందోళనకరమైన అంశం.

పాలకవర్గాల సంస్కృతిలో భాగంగా ప్రజల అసంతృప్తిని, ఆందోళనలను పక్కదారి పట్టించేందుకు ప్రభుత్వానికి సానుకూలంగా కార్పొరేట్ మీడియా ఈ నిరసనోద్యమాన్ని జాత్యహంకారానికి సంబంధించిన అల్లర్లుగా, లూటీగా ప్రచారం కొనసాగించింది. మీడియా చేసిన దుష్ప్రచారంతో కొంతమంది ఉన్మాదచర్యలకు పూనుకున్నారు. బ్రిటన్‌లోని పలు నగరాల్లో ఆసియన్లు అధికంగా ఉండే ప్రాంతాల్లో తమ తమ ప్రజలను రక్షించుకునేందుకు పౌర బృందాలు రంగంలోకి దిగాయి. ఇరుగు పొరుగు వారిని, గురుద్వారాలు, మసీదులను కనిపెట్టుకుని ఉన్నాయి. ఈ నేపథ్యంలోనే బర్మింగ్‌హాంలో నివసిస్తున్న షహజాద్, హారిహుస్సేన్ సోదరులు వారి మిత్రుడైన ముసావెర్ అలీతో కలిసి మసీదు నుండి తిరిగి వస్తుండగా ఒక శ్వేత జాతీయుడు కారును వేగంగా నడుపుతూ వారిని ఢీకొట్టడంతో ఆ ముగ్గురు అక్కడికక్కడే మరణించారు. మరణించిన వారు రోడ్డుకు అడ్డంగా లేరని, మార్గ నిరోధకం చేయలేదని పోలీసులు నిర్ధారించారు. నిందితునిపై కేసు నమోదు చేశారు, కాని అతన్ని అరెస్టు చేయలేదు. శ్వేత జాతీయులే ఎక్కువగా అల్లర్లలో పాల్గొంటున్నారని పోలీసులు చెబుతున్నారు.

బ్రిటన్‌లోని డేవిడ్ కామెరాన్ సారథ్యంలోని మితవాద - ఉదారవాద ప్రజాస్వామిక సంకీర్ణ ప్రభుత్వం ఆర్థిక మాంద్యం కారణంగా భారీ రుణభారాన్ని అదుపులోకి తెచ్చే పేరుతో ఈ ఏడాది ప్రారంభంలో పెద్ద ఎత్తున పొదుపు చర్యలు ప్రకటించింది.. రెండో ప్రపంచ యుద్ధం తర్వాత ఇంత స్థాయిలో పొదుపు చర్యలు అమలు చేయడం బ్రిటన్ చరిత్రలోనే లేదు. ఈ పేరుతో ప్రజా వ్యయానికి కామెరూన్ ప్రభుత్వం భారీగా కోత పెట్టింది. దాదాపు ఐదు లక్షల మంది ప్రభుత్వ ఉద్యోగాలు కోల్పోయి వీధిన పడ్డారు. పోలీసులకు సైతం ఉద్వాసనలు తప్పలేదు. లక్షలాది మంది బ్రిటన్ పౌరులకు సామాజిక లబ్ధి దూరమైంది. మరోవైపు పన్నులు అధికం చేశారు. పలు సామాజిక పథకాలకు 7 బిలియన్ డాలర్ల కోతపడింది. ప్రభుత్వ శాఖల బడ్జెట్‌లనూ కుదించివేశారు. దాంతో ఆ దేశంలో ప్రజా సంక్షేమ కార్యక్రమాలు మూలన పడ్డాయి. ఉద్యోగాలు ఆవిరైనాయి. జీవన ప్రమాణాలు ఘోరంగా పడిపోయాయి. గత కొద్ది నెలల కాలంలోనే విశ్వ విద్యాలయం ట్యూషన్ ఫీజును ప్రభుత్వం మూడు రెట్లు పెంచింది. 16 - 18 ఏళ్ల యువతకు ఉన్నత విద్యాభ్యాసం కోసం ప్రభుత్వం చెల్లించే 6.4 లక్షల పౌండ్ల ఎడ్యుకేషన్ మెయిన్‌టెనెన్స్ అలవెన్స్‌కు బ్రిటన్ ప్రభుత్వం మంగళం పాడింది. ఆఖరుకు చిన్నారుల

సంక్షేమానికి ఉద్దేశించిన పథకాలను సైతం కామెరూన్ ప్రభుత్వం రద్దు చేసింది. దీని ప్రభావం దాదాపు కోటీ 20 లక్షల కుటుంబాలపై పడింది. నిరుద్యోగులకు కల్పించే ప్రయోజనాలకు సైతం గండిపడింది. ఈ చర్యలు దేశంలోని పేదల, ధనికుల మధ్య అగాధాన్ని గణనీయంగా పెంచింది. ప్రస్తుతం రోడ్లపైకి వచ్చి ఆగ్రహా వేశాలు వ్యక్తం చేస్తూ లూటీలకు దిగుతున్న వారు వీటికి ప్రభావితులైన వారే. నిజానికి పొదుపుచర్యల ఫలితాన్ని నిపుణులు ముందే ఊహించారు. ప్రస్తుతం బ్రిటన్‌లో నిరుద్యోగిత 7.7 శాతంగా ఉంది. మరోవైపు ఉద్యోగాలకు అర్హత ఉన్న యువత దాదాపు పది లక్షల దాకా ఉంది.

పెట్టుబడిదారీ దేశాలన్నింటా అమలు చేస్తున్న నయా ఉదారవాద ఆర్థిక విధానాల కారణంగా ప్రజా సంక్షేమం నానాటికీ అడుగంటుతోంది. అభివృద్ధి చెందిన దేశాలన్నింటిలో ఆదర్శ ప్రాయమైనదిగా చెప్పబడే బ్రిటన్ వైద్య రంగంలో సైతం సంక్షేమానికి కోత పెట్టడానికి టోరీ ప్రభుత్వం సిద్ధపడింది. వైద్య సేవల ప్రైవేటీకరణ నిర్ణయాన్ని ప్రకటించింది. ఇతర రంగాల్లోనూ సంక్షేమ వ్యయాన్ని కత్తిరిస్తున్నారు. 2015 నాటికి ప్రభుత్వ వ్యయంలో 8 వేల కోట్ల పౌండ్లు (ఆరు లక్షల కోట్ల రూపాయలు) కోత విధించాలని సర్కారు నిర్ణయించింది. ఇప్పటికే కత్తిరింపులు మొదలయ్యాయి. మార్క్ దుగ్గన్‌ను కాల్చి చంపిన దక్షిణ లండన్‌లోని టోటెన్‌హాం ప్రాంతంలో యువజన సర్వీసులకిచ్చే బడ్జెట్‌లో 75 శాతం కోత పెట్టారు. ఆ ప్రాంతంలో నిరుద్యోగిత 20 శాతం నమోదయింది. సంక్షేమ బడ్జెట్ కోత పడడంతో యువతీ యువకుల్లో అసంతృప్తి విపరీతంగా పెరిగింది. బ్రిటన్ ప్రజల్లో ముఖ్యంగా యువతలో అసంతృప్తి జ్వాలలు రగలడానికి ఇలాంటి ఎన్నో ఉదాహరణలు చెప్పుకోవచ్చు. అసంతృప్తులను అసమ్మతులను అణచివేసేందుకు ఉపయోగించే పోలీసుల్లోనూ అసంతృప్తి చోటు చేసుకుంటోంది. మీడియాను సైతం టోరీ పాలన వదిలిపెట్టలేదు. ఆ దేశంలోని అతి పెద్ద మీడియా సంస్థ అయిన బిబిసికి ప్రభుత్వం నుంచి ఇచ్చే కేటాయింపులకు కోత పెట్టింది. అందుకు నిరసనగా గడిచిన రెండు నెలల్లోనే బిబిసి పాత్రికేయులు రెండుసార్లు సమ్మె చేశారు. ఇలా బ్రిటన్‌లోని వివిధ వర్గాలు, తరగతులకు చెందిన ప్రజానీకం ప్రభుత్వం చర్యలతో అసంతృప్తి చెందాయి. అదే చినుకుచినుకు చేరి మహా ప్రవాహంలా మారిన రీతిలో ఇప్పుడు వివిధ ప్రాంతాల్లో అల్లర్లు, ఘర్షణల రూపంలో నిరసనోద్యమాలు సాగుతున్నాయి.

బ్రిటన్‌లో ఆగస్ట్ మొదటి రెండు వారాల్లో జరిగిన అల్లర్లపై అనేక వ్యాఖ్యానాలు, విశ్లేషణలు వెలువడుతున్నాయి. నిపుణులు అనేక కారణాలను ప్రస్తావిస్తున్నప్పటికీ... తగ్గిపోతున్న ఉపాధి అవకాశాలు, చాలి చాలని వేతనాలు, భవిష్యత్తుపై సడలుతున్న విశ్వాసం, రాజకీయ వ్యవస్థపై అపనమ్మకం, ఆగ్రహం యువతను ఇలాంటి తీవ్రమైన చర్యలకు పాల్పడేలా చేస్తున్నాయని సామాజికవేత్తలు చెబుతున్నారు. వ్యవస్థ తిరస్కారానికి గురై, విశ్వాసం కోల్పోయిన యువతే ఈ హింసాకాండకు, లూటీలకు దిగుతున్నారని పలువురు భావిస్తున్నారు. అభివృద్ధి పేరు మీద సమాజంలో సాగే కార్యకలాపాల్లో భాగస్వామ్యం కల్పించకపోగా, వారిని దూరంగా నెట్టివేశామని దాని పర్యవసానమే ఇదని ఒక యూనివర్సిటీకి చెందిన సామాజిక పరిశోధకుడు డాక్టర్ పాల్ బగ్లీ చెప్పారు. పెరుగుతున్న నిరుద్యోగం ఈ అశాంతికి ఒక ఉత్ప్రేరకంగా పనిచేసిందని ఆయన విశ్లేషించారు. మనం మన కుటుంబానికో సమాజానికో ఏం చేశామనే దాన్ని బట్టి గతంలో మనపై ఒక అంచనా ఉండేది. ఇప్పుడలా కాదు... మనం ఏం కొన్నామనే దాన్ని బట్టి మనల్ని అంచనా వేస్తున్నారు. మనకు విలువనిస్తున్నారు. అవి కొనలేని వారిలో నిరాశను ప్రేరేపిస్తున్నాయి. ఈ లూటీలు అలాంటి వారికి ఒక అవకాశానిచ్చాయని మరొక సామాజిక వేత్త వివరించారు. యువతలో నెలకొన్న అసంతృప్తి ఆగ్రహంగా వ్యక్తమైంది కానీ, ఆందోళనలో ప్రస్తుత వ్యవస్థకు ప్రత్యామ్నాయంగా ప్రజాతంత్ర వ్యవస్థను సాధించుకోవాలనే సంకల్పం గానీ, ఉద్యమాన్ని ఏకతాటిపై నడిపించే పరిణతి కల్గిన నాయకత్వంగానీ కొరవడిందన్నది స్పష్టం. మొత్తంగా చూస్తే 2008 నుంచి అమెరికా, యూరప్ దేశాలతో సహా యావత్ ప్రపంచాన్ని కుదిపేస్తున్న ఆర్థిక మాంద్యం ఆయా దేశాలలో అనేక సామాజిక ఆర్థిక రాజకీయ పరిణామాలకు దారి తీసింది. నయా ఉదారవాద ఆర్థిక విధానాలను అమలు చేస్తున్న దేశాలలో అంతరంగికంగా అశాంతి నెలకొంది. దినదినం పెరుగుతున్న ఆర్థిక అసమానతలు, వ్యవస్థీకృతమైన అవినీతి, ప్రజా ఉద్యమాల పట్ల అణచివేతను పెంచి పోషిస్తున్న పాలకుల పట్ల యువతలో గూడుకట్టుకున్న అసంతృప్తి ఇటీవలి కాలంలో అనేక దేశాలలో ఆగ్రహజ్వాలగా బయట పడుతోంది. ఈ క్రమంలోనే బ్రిటన్‌లో ప్రజా ఆగ్రహం ఆందోళన రూపంలో వ్యక్తమైంది. ప్రభుత్వం పట్ల, పాలన పట్ల ప్రజల్లో ఎంత ఏహ్యాభావం, తిరస్కారభావం చోటు చేసుకుందో ఈ అల్లర్లను చూస్తే అర్థమవుతుంది. అయినా బ్రిటన్ ప్రభుత్వం తాను చేపట్టిన చర్యల నుండి వెనక్కు వచ్చే సూచన కన్పించడం లేదు. పోలీసు బలంతోనూ, అధికార మదంతోనూ నిరసనలను టోరీ ప్రభుత్వం అణచి వేయవచ్చునని కలలు కంటుంది. కానీ, ప్రజల్లో అసంతృప్తి మాత్రం నివురుగప్పిన నిప్పులా మిగిలిపోతుంది. నిరసనలకు మూల కారణమైన ఉదారవాద ఆర్థిక విధానాలను అక్కడి ప్రభుత్వం వెనక్కి తీసుకోవాలి. వివక్షలను తొలగించి, సంక్షేమ పథకాలను ప్రజలందరికి వర్తింపచేయాలి. అప్పుడే బ్రిటన్‌లో మంటలు చల్లారుతాయి. కాకపోతే చింకి గుడ్డకు మాసికలు వేస్తే దాని ప్రక్కనే మరో చీరిక పడుతుందన్న తీరున ఈ సమాజం అతలాకుతలం అవుతుందని బ్రిటన్ పాలకులు, అలాంటి విధానాలను తలకెత్తుకొన్న ఇతర దేశాల ఏలికలు గుర్తెరగాలి. వీ

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు)*

**రచయితలకు సూచన :** తక్షణ, సమకాలీన అంశాలపై రచనలు చేసి ఆ సంచికలోనే రావాలనుకొనే రచయితలు 23వ తేదీ లోగా పంపగలిగితేనే మరుసటి నెల సంచిక కోసం పరిశీలించడం సాధ్యమవుతుంది. ఆ తరువాత వచ్చిన రచన, అంశం ఎంత ముఖ్యమైనదైనా పరిశీలించడం, ముద్రణకు సిద్ధం చేయడం అసాధ్యమవుతుంది. రచయితలు గుర్తించగలరు. – సం.

ఇటీవల బ్రిటన్‌లోని వివిధ నగరాలలో చోటుచేసుకున్న పరిణామాలు ఆ దేశంలోని ప్రజల్లో పేరుకుపోయిన అసంతృప్తికి చిహ్నాలని అంటున్నారు డా. జి. లచ్చయ్య

# లండన్ ఎందుకు తగలబడింది?

అన్ రియల్ సిటీ... / అండర్ ది బ్రౌన్ ఫోగ్ ఆఫ్ ఎ వింటర్ డాన్... / ఎ క్రౌడ్ ఫ్లోడ్ ఓవర్ లండన్ బ్రిడ్జ్, సో మెనీ.. / ఐ హాడ్ నాట్ థాట్ డెత్ హాడ్ అన్‌డన్ సో మెనీ.. / లండన్ బ్రిడ్జ్ ఈజ్ ఫాలింగ్ డౌన్, ఫాలింగ్ డౌన్.. / ది రివర్ స్వెట్స్ ఆయిల్ అండ్ టార్..

మొదటి ప్రపంచ యుద్ధానంతరం లండన్, ప్యారిస్ నగరాల దుస్థితిని చూసి 1921లో టి.ఎస్. ఇలియట్ రాసిన పై పద పంక్తులు తొంభై సంవత్సరాల తర్వాత కూడా అక్షర సత్యాలని తెలుస్తున్నవి. సామాజికంగా, రాజకీయంగా విలువల పరంగా పతనమైపోతున్న, శ్వేతజాతి దురహంకారంతో, రవి అస్తమించని సామ్రాజ్య విస్తరణతో కళ్లు బైర్లు కమ్మిన అంధత్వంతో మొత్తం ప్రపంచాన్ని తన గుప్పిట్లో పెట్టుకున్నానని విర్రవీగే బ్రిటిష్ పాలకులను ఉద్దేశించి 'పనికి రాని' భూమిగా మహానగరాలను అభివర్ణిస్తూ, భవిష్యత్తును అప్పుడే ఊహించిండు ఇలియట్.

చంపడానికి ఒక కారణం కావాలి. చంపిన తర్వాత ఏదో ఒక ఆరోపణ ఆపాదించి పెట్టాలి. ఇండియా అయినా, అమెరికా అయినా, వీరి తాతమ్మ ఇంగ్లండు అయినా పోలీసు నీతి పోలీసు నీతే! టాక్సీలో మారణాయుధాలతో పోతున్నాడని, పోలీసులకు ప్రాణహాని ఉందని (భావించి / ఊహించి) మొత్తంగా కథకు నలుపు రంగును పులిమి, అయినా నల్ల జాతీయుడు కాబట్టి, చంపే అధికారం పోలీసులకు ఉంది కాబట్టి 29 సంవత్సరాల మార్క్ దుగ్గన్ అనే ఆఫ్రో కరేబియన్ జాతీయున్ని ఉత్తర లండన్‌లోని టోటెన్‌హాంలో స్కాట్‌లాండ్ యార్డ్ యూనిట్ పోలీసులు ఆగస్ట్ 6న కాల్చి చంపారు.

జరిగిన సంఘటనను అక్కడి యువతీ యువకులు నమ్మలేదు. వారికి గత అనుభవాలు ఉన్నాయి. ముందు శాంతియుతంగా నిరసన తెలిపారు. ప్రభుత్వం నుంచి గానీ, పోలీసుల నుంచి గానీ సరైన సమాచారం రాలేదు. అంతే! టునీషియా విప్లవం లాగా, ఈజిప్ట్ స్ఫూర్తితో సోషల్ నెట్‌వర్కింగ్ ప్రారంభమైంది. ట్విట్టర్, ఫేస్‌బుక్ సమాచారం క్షణాల్లో దావానంలా వ్యాపించింది. బ్లాక్‌బెర్రి మొబైల్ మార్మోగింది. బర్మింగ్‌హమ్, లివర్‌పూల్, బ్రిస్టల్, లైసెస్టర్, నాటింగ్‌హమ్ నగరాలను చుట్టుముట్టి ఆదివారం నాటికి (07 ఆగస్ట్ 2011) ఆందోళన దక్షిణాన గల బ్రిక్స్‌టన్‌ను తాకింది. ఆత్మరక్షణార్థమే కాల్పులు జరపాల్సి వచ్చి- పోలీసుల కథనాన్ని నమ్మని ఓ 18 సంవత్సరాల యువ క్రీడాకారి- ఎన్‌ఫీల్డ్‌లో పోలీసు వాహనంపై ఓ ఇటుకను విసిరింది. దీంతో యువకులు రెచ్చిపోయారు. ఆ క్రీడాకారిణి స్ఫూర్తితో ముందు గార్బేజుల్ని, తర్వాత బస్సుల్ని, కార్లని తగులబెట్టడం మొదలైంది. ఈ దమనకాండ లండన్ నగరమంతా పాకి పెద్ద పెద్ద షోరూం అద్దాలు పగిలాయి. పోలీసుల దృష్టిలో పడకుండా యువతీ, యువకులు ముసుగులు ధరించి దుకాణాల్ని, ఇళ్లను కొల్లగొట్టారు. మాల్స్, గోదాంలు తగలబడ్డాయి. ఆ మంటల్ని ఆర్పడానికి ఎక్కడి ఫైరింజన్లూ సరిపోలేదు. ఒకవైపు గుంపులు గుంపులుగా యువకులు, మరోవైపు తగలబడుతున్న లండన్ నగరం. పోలీసులకు దిక్కుతోచలేదు. ఆగస్ట్ 9 నాటికి మాంచెస్టర్‌ను తాకింది. నల్లవారు, తెల్లవారు అనే తరతమ బేధం లేకుండా పిల్లల్నుంచి నడి వయస్కుల దాకా ఈ దొమ్మిలో పాల్గొన్నారు. దొరికిన వస్తువుల్ని కాక నచ్చిన వస్తువుల్ని తీసుకెళ్లారు.

లూటీ అయిన వస్తువుల్లో అత్యధిక శాతం ఎలక్ట్రానిక్ వస్తువులు, బట్టలు కావడం గమనార్హం. కొంతమంది కేవలం మత్తుపానీయాల్ని తీసుకెళ్లారు. వేసవి తాపాన్ని తట్టుకోవడానికి ఇటలీకి విహార యాత్రకు వెళ్లిన బ్రిటిష్ ప్రధానమంత్రి డేవిడ్ కామెరాన్ హుటాహుటిన లండన్‌కు తిరిగి వచ్చాడు. వెంటనే పార్లమెంట్ సమావేశాన్ని ఏర్పాటు చేసి పరిస్థితిని సమీక్షించాడు. అల్లర్లను, నిరసనలను అదుపు చేయడానికి తగినంత పోలీసు సిబ్బంది లేరని ఒప్పుకుంటూనే, ప్రజలపైన వాటర్ కెనాన్‌లను, రబ్బర్ బులెట్లను ప్రయోగించడం తమ మతానికి వ్యతిరేకమని ప్రకటిస్తూనే పోలీసులు తగిన చర్య తీసుకోవాలని హౌస్ ఆఫ్ కామన్స్‌లో ఇరు పార్టీల నాయకులు ప్రకటించారు. ఇలాంటి ఘటనలు బ్రిటన్‌కు కొత్తేమీ కాకున్నా, ఇంత పెద్ద ఎత్తున అల్లర్లు గతంలో చోటు చేసుకోలేదు. ముందుగా ఆరు వేల మంది పోలీసుల్ని రంగంలోకి దింపినా, అల్లర్లు అదుపులోకి రాకపోవడంతో పదహారు వేల మంది పోలీసుల్ని ఒక్క లండన్ నగరంలోనే రంగంలో దించారు.

ఈ అల్లర్లకు గల కారణాల్ని ఒక్కొక్కరు ఒక్కో కథనాన్ని వినిపించగా మీడియా అనేక కథనాల్ని ప్రచురించింది. ఈ తిరుగుబాట్లకు గత ప్రభుత్వం చేపట్టిన ప్రజా వ్యతిరేక విధానాలే ప్రధాన కారణమని, దీనికి తోడు ఈ మధ్యన అందుబాటులోకి వచ్చిన సామాజిక సంబంధ సమాచార (సోషల్ నెట్‌వర్కింగ్) సాంకేతిక పరిజ్ఞానమని అత్యధికులు చెప్పడం గమనార్హం. డేవిడ్ కామెరాన్ మాత్రం ఇదంతా తల్లిదండ్రుల పెంపక లోపమని సూత్రీకరించాడు. ఈ అల్లర్ల సందర్భంగా దేశవ్యాప్తంగా 1700 మందిని అరెస్టు చేయగా, 600 మందిపైన ఆందోళనలతో సంబంధాలున్నట్లు అభియోగం మోపడం జరిగింది.

బ్రిటిష్ పాలకులు ప్రపంచాన్ని ఏలుతున్న కాలంలోనే బ్రిటన్‌లోని ఉన్నత వర్గాల అవసరాలను తీర్చడానికి పని మనుషులుగా, కూలీలుగా, పాకీపని వారిగా, రోడ్లను, డ్రైనేజీలను ఊడ్చడానికి, శుభ్రం చేయడానికి లేబర్ అవసరం పడింది. దీంతో బ్రిటిష్ వాళ్ల అజమాయిషీ దేశాల నుంచి బతుకు తెరువు కోసం బ్రిటన్‌కు వలసలు ప్రారంభమయ్యాయి.

ఈ వలసలు 1950 నుంచి అధికమయ్యాయి. (నేడు అమెరికాకు ఉన్నట్లు.) ఈ విధంగా బ్రిటన్‌కు వలస వచ్చిన వారిలో అత్యధికులు ఆఫ్రో కరేబియన్ వాసులుండగా, తర్వాత పాకిస్తాన్, బంగ్లాదేశ్, ఇండియా పౌరులున్నారు. ఇండియా, పాకిస్తానీయులు వివిధ రకాల వ్యాపారాలను చేసుకొని జీవిస్తుండగా, కరేబియన్లు, బంగ్లాదేశీయులు దినసరి వేతన కూలీలుగా పనిచేసేవారు. అయితే వీరందరిని నల్లవారిగానే బ్రిటిష్ ప్రజలు, ప్రభుత్వం గుర్తిస్తూంది. ఈ విధంగా వలస వచ్చిన వారి సంఖ్య బ్రిటన్ జనాభాలో 8 శాతం (ఐదు మిలియన్లు)గా ఉంది. ఇతర పట్టణాల్లో లాగా కాకుండా, లండన్‌కు వలస వచ్చినవారు నగరం మధ్యలో గల ఖాళీస్థలాల్లో, చిన్న చిన్న ఇళ్ల సముదాయాల్లో నివసిస్తారు. వీరికి బ్రిటిష్ పౌరులుగా గుర్తింపు లేకపోవడం, కనీస సౌకర్యాలకు నోచుకోకపోవడం, ఎలాంటి నైపుణ్యతలు లేకపోవడంతో సరియైన ఉపాధి అవకాశాలు లభించకపోవడం, ప్రభుత్వపరంగా సంక్షేమ పథకాలు రద్దుకావడం తదితర కారణాలతో అత్యధిక కరేబియన్లు జులాయిలుగా తిరుగుతారని వివిధ సర్వేలు తెలియజేస్తున్నాయి. 2004లో జరిపిన జాతీయ గణాంక లెక్కల ప్రకారం శ్వేత జాతీయుల్లో 5 శాతం నిరుద్యోగులుంటే, ఇతర జాతుల వారిలో ఇది 13-14 శాతంగా ఉంది. వర్క్ అండ్ పెన్షన్ సర్వే ప్రకారం ఈ మైనారిటీ జాతులు 60 శాతంగా ఉన్న బ్రిటిష్ మధ్యతరగతి పౌరుల జీవన స్థాయి కంటే అతి కింది స్థాయిలో ఉంటుందని, 65 శాతం బంగ్లాదేశ్ కుటుంబాల్లో, 50 శాతం పాకిస్తాన్ కుటుంబాల్లో ఒక్కొక్కరు చొప్పున ఉపాధి అవకాశాలు పొందగా, కరేబియన్లలో కేవలం 31 శాతం కుటుంబాల్లోనే ఒకరికి ఉపాధి అవకాశాలు లభిస్తున్నట్లు తెలిపింది. 16-24 సంవత్సరాల మధ్య వయస్సు గల వారిలో బ్రిటన్ మొత్తంగా ఒక మిలియన్ మంది నిరుద్యోగ యువకులుండగా, ఇందులో అత్యధిక ఆఫ్రో కరేబియన్లే! అయితే అనధికారిక లెక్కల ప్రకారం మొత్తం యువతలో 20 శాతం దాకా నిరుద్యోగులేనని తెలుస్తున్నది.

గత 25 సంవత్సరాలుగా బ్రిటన్ ఆర్థిక ఇబ్బందులతో ఉండడం, ఆర్థికాభివృద్ధి ఒక శాతానికి మించకపోవడం, ఉద్యోగాల్లో కోత విధించడం, సంక్షేమ పథకాల నిలిపివేత, వివిధ పథకాలపై ఖర్చును 19 శాతం తగ్గించడం లాంటి తదితర చర్యలు యువతను నిరాశ నిస్పృహలకు గురిచేస్తున్నాయి. ఇతర అభివృద్ధి చెందిన దేశాలతో పోల్చినప్పుడు బ్రిటన్‌లో సోషల్ మొబిలిటీ చాలా తక్కువని సర్వేలు (ఒ.ఇ.సి.డి.) తెలుపుతున్నాయి. ఈ విధంగా సాంఘిక కదలిక లేక పోవడంతో యువత అంతా కొన్ని ప్రాంతాలకే పరిమితి కావడం, పని గంటలు తక్కువగా లభించడంతో అత్యధికులు మాదక ద్రవ్యాలకు అలవాటు పడుతున్నారు. దీనికితోడు పతనమౌతున్న కుటుంబ వ్యవస్థ, విద్యా విధానం, భద్రతలేని ఉపాధి యువతను పెడదారి పట్టిస్తున్నాయని, 20-30 సంవత్సరాల మధ్య వయస్సుగల వారు అత్యధికంగా నేర ప్రవృత్తికి ఆకర్షితులౌతున్నారని హరియట్ సర్జెంట్ అనే సామాజికవేత్త ఆవేదన వ్యక్తం చేసాడు. వీరి విద్యాస్థాయి కూడా చాలా తక్కువగా ఉంటోందని, 14 సంవత్సరాల వయస్సువారు 7 సంవత్సరాల వయస్సు వారు విద్యా స్థాయిని కలిగి ఉంటున్నారని, అత్యధిక శాతం పిల్లలు మధ్యలోనే బడి మానివేస్తున్నారని ఆయన గుర్తించాడు. ఈ విధంగా సరియైన విద్యాస్థాయి లేక, పాఠశాల విద్యను కూడా పూర్తిచేయని యువకులు బ్రిటన్‌లో అత్యధికమని ఆయన తెలిపాడు. ఇలా దశ దిశలేని యువకులు నేరాలు చేసి జైలుకు వెళ్లేవారి సంఖ్య బ్రిటిష్ యువకుల కన్నా ఏడు రెట్లు అధికంగా ఉంటుందని తెలుపుతూ, తెల్లవారి పిల్లలు పాఠశాల నుంచి విశ్వవిద్యాలయాలకుపోతే, కరేబియన్లు పాఠశాలను మధ్యలోనే వదిలి జైళ్లకు వెళ్లుతున్నారని ఓ యువకుడు ప్రస్తావించిన విషయాన్ని సర్జెంట్ ఈ సందర్భంగా ఉటంకించడం గమనార్హం.

గతంలో పాఠశాల విద్య నిర్బంధంగా ఉండేదని, 19 సంవత్సరాల వయస్సుకే చక్కని ఉపాధి అవకాశాలు లభించేవని, కాని ప్రపంచీకరణతో బ్రిటన్ అతలాకుతలమైందని, దేశం మొత్తంగా దాదాపు 1.8 మిలియన్ల నిరుద్యోగులుండగా, 99 శాతం మంది ఇతరదేశాలకు ఉపాధి కోసం పోవాలనే ఆలోచనలో ఉంటున్నట్లు ఆయన స్పెక్టేటర్‌కు రాసిన వ్యాసంలో పేర్కొన్నాడు. అయితే ప్రస్తుత ప్రభుత్వ చర్యల వల్ల ఇప్పుడు 82 శాతంకు పడిపోయిందన్నాడు. కుటుంబ వ్యవస్థ కూడా దీనికి ప్రధాన కారణభూతమని పేర్కొంటూ, వలస కుటుంబాల పిల్లలకు ఇంట్లో సరియైన పోషణ లభించదని, వారంలో అత్యధిక సాయంత్రాలు ఇంటికి దూరంగా స్నేహితులతో గడుపుతారని, మెజారిటీ కుటుంబాల్లో తండ్రి అనేవాడుండక ఒంటరి తల్లి కుటుంబ పెద్దగా ఉంటుందని, యూరప్ మొత్తంలో అతి పిన్న వయస్సులో గర్భం ధరించడం బ్రిటన్‌లోనే ఉన్నదని ఆయన ఈ సందర్భంగా తెలిపాడు. దీనికితోడు బ్రిటన్ ప్రభుత్వ విధానాలు కూడా ఇలాంటి వ్యవస్థకు దోహదపడుతున్నాయని, ప్రభుత్వమే తండ్రి పాత్రను, భర్త పాత్రను పోషిస్తూ 1997 నుంచి ఇలాంటి కుటుంబాలకు ప్రోత్సాహకాలు ఇవ్వడం జరిగినా ఈ రెండు పాత్రల్లో ప్రభుత్వ వైఫల్యం కనపడుతుందని ఆయన పేర్కొన్నాడు.

ఒసాగియోపో టంగోగ్రా అనే మరో సామాజిక కార్యకర్త ఈ సందర్భంగా మాట్లాడుతూ, ప్రపంచ వ్యాపితంగా చోటు చేసుకుంటున్న పరిస్థితులు, అభద్రతా భావం యువకుల్ని ఈ విధంగా ప్రేరేపిస్తూ న్నాయని, వీటిని అల్లర్లని అనడం కన్నా తిరుగుబాట్లుగా గుర్తించాలని, మార్గరేట్ థాచర్ ప్రధానమంత్రిగా ఉన్నప్పుడే ఇవి మొదలయ్యాయని, 1981లో బ్రిక్సటన్‌లో, తర్వాత 1985, 2001లలో కూడా ఈ ఘటనలు జరిగాయని ఆయన ప్రస్తావించారు. 2009లో మానవ హక్కుల కమిషన్ 'హౌ ఫేర్ ఈజ్ బ్రిటన్' అనే నివేదికను ప్రచురించింది. దీని చైర్మన్ ట్రెవోరో ఫిలిప్స్ మాట్లాడుతూ, ఎంత వెతుకులాడినా యువతకు ఉపాధి దొరకకపోవడం, అన్ని మార్గాలు మూసుకుపోవడంతో ఈ నేరాలకు యువత ఉత్సాహాన్ని చూపుతున్నారని అన్నాడు. 1981 నాటి బ్రిక్సటన్ అల్లర్లపై వేసిన లార్డ్ స్కార్‌మాన్ నివేదిక ప్రకారం, ఈ అల్లర్లన్ని అత్యధికంగా పోలీసులకు వ్యతిరేకంగానే జరుగుతున్నాయని తెలిపారు.

నిజానికి ప్రపంచ సంపన్న నగరాలలో లండన్ నగరం కూడా ఒకటి. కాని అక్కడి ప్రభుత్వాల విలాసవంతమైన విధానాలు సాధారణ, కిందిస్థాయి ప్రజల్ని ఎప్పుడూ పట్టించుకోలేదు. ప్రభుత్వ రంగంలో ఉద్యోగాల్ని కల్పించకపోగా, కోత విధించడం మొదలుపెట్టారు. మొన్నటి అల్లర్లకు ముందే దేశవ్యాపితంగా 16,200 మంది పోలీసు అధికార్ల పోస్టుల్ని రద్దు చేయాలని భావించింది. ఒకవైపు సంక్షేమ పథకాలపై కోత, మరోవైపు పట్టించుకోని ప్రభుత్వ విధానం వెరసి లండన్ నగరం తగలబడడానికి కారణమైంది. తమని పట్టించుకోని ప్రభుత్వాలున్నప్పుడు, తమ అవసరాల్ని తామే చూసుకోవడంలో తప్పులేదని అల్లర్లు జరిగిన ప్రాంతంలోని ఓ 16 సంవత్సరాల యువకుడు అన్నాడంటే పరిస్థితి ఎలా ఉందో అవగాహన అవుతున్నది.

వచ్చే ఏడాది ఒలింపిక్స్‌కు ఆతిథ్యమిస్తూ, దాదాపు 14 బిలియన్ల డాలర్లను ఖర్చు చేస్తూ, వివిధ నిర్మాణాలను చేపడుతున్నా ఈ మైనారిటీ జాతుల పిల్లలకు పెద్దగా ఉపాధి అవకాశాలు పెరగలేదంటే అక్కడి పరిస్థితులు ఎంత దారుణంగా ఉన్నాయో తెలుస్తున్నది. ఒకవైపు

*అమెరికా, యూరప్‌లలో తలెత్తిన ఆర్థిక మాంద్యం, నిరుద్యోగం వెనక ఉన్న పెట్టుబడిదారీ సంక్షోభాన్ని వివరిస్తున్నారు* **ఇ.ఎస్. బ్రహ్మచారి**

# తిరగబెడుతున్న మరొక మాంద్యం

అమెరికాలో మహాసంక్షోభం 1930 దశకంలో వచ్చింది. ఇప్పటిది మహా మాంద్యం. మధ్యలో 11 మాంద్యాలు వచ్చినా అవి ఈ స్థాయివి కావు. ఇది 2007 డిసెంబర్‌లో మొదలై 2009 జూన్‌లో ముగిసింది. అలాగని ఎన్.బి.ఈ.ఆర్ అధికారికంగా ప్రకటించింది. తర్వాత వస్తే అది మరొక మాంద్యమే గాని దీనికి కొనసాగింపు కాదు అని చెప్పింది. అప్పటి నుంచీ ఈ జూన్ కి రికవరీ మొదలై రెండేళ్లు నిండాయి. ఎకానమీ ఎత్తుకున్న దాఖలాలు పెద్దగా లేవు. దాంతో క్రుగ్మన్, రుబినీ లాంటి కొందరు రికవరీ అయినట్లే అయి మళ్లీ మాంద్యంలో పడే ప్రమాదం ఉందని అభిప్రాయపడ్డారు. సరిగా రికవరీ కాకుండా మాంద్యం తిరగబెడితే డబల్ డిప్ అంటారని తెలిసిందే. ఇప్పటికీ మాంద్యంలోనే ఉన్నాం, డబల్ డిప్ ఏమిటని లారెన్స్ మిషెల్ ప్రశ్నిస్తున్నాడు. కొందరు ఆర్థికవేత్తలు మరొక మాంద్యం పొంచివుంది అని చెబుతున్నారు. తిరగబెడుతున్న మాంద్యం అన్నా, మాంద్యంలోనే ఉన్నామన్నా, మరో మాంద్యం అన్నా ఉన్న పరిస్థితి ఒకటే. సామాన్యులు ఆందోళన పడుతున్నారు. కొందరైతే ఈసారి ఇది మరింత ఎక్కువ స్థాయిలో ఉంటుందంటున్నారు.

'భిన్నమైన , కొత్త తుఫాను వచ్చే క్షణాల్లో ఉన్నాం. అది 2008లో వచ్చినటువంటిది కాదు' అని ప్రపంచ బ్యాంక్ అధ్యక్షుడు రాబర్ట్ జోలిక్ అన్నాడు. ప్రపంచ ఎకానమీ మరింత ప్రమాదకరమైన దశలో ప్రవేశించింది అని అభిప్రాయ పడ్డాడు.

ఒబామా వీటిలో దేన్నీ ఒప్పుకోవడం లేదు. రికవరీ నడుస్తున్నదనీ, అయితే నెమ్మదిగా కదులుతున్నదనీ అంటున్నాడు. ఓహియోలో ఎకానమీ సరైన దారిలోనే నడుస్తున్నది అని అన్నాడు. ఒబామా రికవరీ మొగ్గలు చూడమంటున్నాడు. ఎంతచూసినా జనానికి మొలకలన్నా కనబడడం లేదు. మాంద్యం లోతులే దర్శన మిస్తున్నాయి. వాళ్లని భయపెడు తున్నాయి. కార్పొరేట్లకి మాత్రం రికవరీ ఫలాలు లభిస్తున్నాయి. లాభాల పంటలు పండుతున్నాయి. అందువల్లే పెట్టుబడిదారీ ఆర్థికవేత్తలు మాంద్యంలో లేము. మరో మాంద్యం రాదు అంటున్నారు. కార్పొరేట్లకి రికవరీ, శ్రామికులకి వర్రీ – కళ్లకి కట్టినట్లుంది.

'అది మహోజ్వల మహాయుగం, అది వల్లకాటి అధ్వాన్న శకం' – అంటూ చార్లెస్ డికెన్స్ తన నవల 'ఏ టేల్ ఆఫ్ టూ సిటీస్' ని మొదలుపెట్టాడు. ప్రస్తుత పరిస్థితి అలాగే ఉంది. పై వర్గాలకి మహా యుగం, కిందివాళ్లకి అధ్వాన్న శకం.

2007 డిసెంబర్ నుంచీ 2009 జూన్ వరకూ సాగిన మాంద్యం

---

సంపదలు పోగుపడడం, మరోవైపు నిర్మాణాత్మకంగా దేశ నిర్మాణంలో పాల్గొనాల్సిన యువత నిరాశ, నిస్పృహలతో ఉన్నప్పుడు లండన్‌లాంటి పరిణామాలే చోటు చేసుకుంటాయి.

అయితే ఈ సందర్భంగా గమనించాల్సిన అంశాలు కూడా కొన్ని ఉన్నాయి. ఇంత పెద్ద ఎత్తున బ్రిటన్ అంతటా దమనకాండ, లూటీలు జరిగినా బ్రిటిష్ పోలీసు విధానం మాత్రం అభినందనీయమే. వారం రోజుల పాటుగా సాగిన ఈ అల్లర్లను అణచడానికి సైన్యాన్ని వినియోగించకపోవడం గమనార్హం. అలాగే గుంపులపై, ప్రజా సమూహాలపై వాటర్ కెనాన్స్‌ను ఉపయోగించకుండా, రబ్బర్ బుల్లెట్లను కూడా ప్రయోగించకుండా అల్లర్లను అదుపు చేసారంటే అక్కడి పోలీసుల్లో ఉన్న నైతిక విలువలకు నిదర్శనం కాకున్నా ఒప్పుకోవాల్సి వస్తుంది. లండన్ మెట్రోపాలిటి పోలీసు సిబ్బంది మొత్తం 32,500. అందులో కేవలం 2,700 మందికి మాత్రమే అనుమతించిన ఆయుధాలున్నాయి. అలాగే దేశవ్యాపిత పోలీసుల్లో కేవలం 4,128 మంది దగ్గర మాత్రమే ఆయుధాలున్నాయంటూ, ఇతర దేశాలతో పోలిస్తే, బ్రిటిష్ పోలీసు వ్యవస్థ భిన్నమైదని ఆ దేశ హోం సెక్రటరీ థెరిస్సా మే ప్రకటిస్తూ ఐర్లాండ్‌లో మాత్రమే వాటర్ కెనాన్స్‌ను ఉపయోగిస్తారు గాని, ముఖ్యమైన ప్రాంతాల్లో వినియోగించమని, పోలీసు వ్యవస్థ స్థానిక సంస్థల సూచనల మేరకే పని చేస్తుందని బిబిసికి ఇచ్చిన ఇంటర్వ్యూలో తెలిపింది.

అల్లర్లు జరిగిన తీరు, దోచుకున్న వస్తువులను బట్టి, కేవలం కరేబియన్లే పాల్గొన్నారని అనడానికి వీలులేదని, చెఫ్‌లు, స్టీవర్డ్స్ (కొన్ని నిర్దేశించిన పనులను చేసేవారు) లాంటి వారు కూడా పాల్గొన్నారని, వీరంతా చేసిన నేరాన్ని ఒప్పుకోవడానికి నిరాకరించడాన్ని బట్టి అసలైన కారణాలు అర్థం కావడం లేదని గార్డియన్ పత్రిక వ్యాఖ్యానించింది. అలాగే మార్క్ దుగ్గన్‌ను ప్రాణ రక్షణార్థం చంపామన్న పోలీసు కథనాన్ని కూడా బాలిస్టిక్ నేషనల్ ఇంటెలిజెన్స్ సర్వీసు తప్పుపట్టింది. అసలు దుగ్గన్ ముందుగా కాల్పులే జరపలేదని, పోలీసులు చెబుతున్నట్లు పోలీసులపై పడిన బుల్లెట్ల పౌడర్, పోలీసు బుల్లెట్లదేనని ఆ పరిశోధన తేల్చింది.

ఏది ఏమైనా, భ్రష్టుపట్టిన ఆర్థిక, సామాజిక వ్యవస్థ బాగుపడనంత కాలం, పాలకులు ప్రజాస్వామ్యయుతంగా పాలించనంతకాలం టునీషియా, ఈజిప్ట్, లండన్ వంటి సంఘటనలు జరుగుతూనే ఉంటాయి. ఇండియా కూడా వీటికి అతీతం కాదని ఈ మధ్యన జరుగుతున్న సంఘటనలు తెలియజేస్తున్నాయి. అన్నా హజారే దీక్ష సందర్భంగా పనిచేసిన సోషల్ నెట్‌వర్కింగే దీనికి చక్కని ఉదాహరణ.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు)* వీ

రెండు భిన్న ఫలితాల్ని ఇచ్చింది. సామాన్య కుటుంబాలూ, శ్రామిక కుటుంబాలూ అతి నిరుద్యోగంతో, ఫోర్‌క్లోజర్స్ (అప్పులకి ఇళ్లు వదులుకోవడం) తో సతమతవుతున్నాయి. మరోపక్క పెట్టుబడిదారులూ, సంపన్నులూ మరింత ఆదాయాలు పొందారు. అడుగు 80 శాతం మంది మొత్తం కుటుంబ ఆస్తి 2.2 పర్సెంటేజ్ పాయింట్లు తగ్గి 12.5 శాతం అయింది. అదే సమయంలో 1 శాతం మహా ధనికుల సంపద సామాన్యుని కుటుంబ ఆస్తికి 225 రెట్లు పెరిగింది. ఇదిప్పటికి రికార్డ్. 25 శాతం కుటుంబాలకి సంపదే లేదు. కొన్ని కుటుంబాలకి ఆస్తి లేకపోగా అప్పులున్నాయి.

2008లో పదివేల కుటుంబాల్లో ఒకటి సగటున 2 కోట్ల 70 లక్షల డాలర్ల ఆదాయం పొందింది. అడుగు 90 శాతం కుటుంబాలకు సగటున 31,244 డాలర్లు. సామాన్య శ్రామికుడి ఆదాయానికి సి.ఈ.ఓ ఆదాయం 185 రెట్లు.

అతి సంపన్నుల ఆదాయాల్ని 'కారీడ్ ఇంటరెస్ట్' గా పేర్కొంటూ పన్నులు 15 శాతం దాకా తగ్గిస్తారు. వారెన్ బఫెట్ (2008లో ప్రపంచంలోనే అత్యంత ధనవంతుడు) అన్ని పన్నులూ కలిపి 69,38,744 డాలర్లు చెల్లించాడు. అతని నికర ఆదాయంలో అది 17.4 శాతమే. అదే ఆఫీస్‌లో పనిచేస్తున్న ఇతరులు సగటున 36 శాతం చెల్లిస్తున్నారు. డబ్బుతో డబ్బు సంపాదిస్తే పన్ను తక్కువ. ఉద్యోగం చేసి సంపాదిస్తే ఎక్కువ. పన్నులు ఎక్కువగా ఉంటే పెట్టుబడులు పెట్టరు అంటూ వాళ్లకి రాయితీలిస్తారు.

కార్పొరేట్లు పన్నులకు, నియంత్రణలకు సంబంధించి సందిగ్ధత తొలగనంత కాలం ఉద్యోగుల్ని పెట్టుకోలేము అంటారు. అయితే వాళ్లు రికార్డ్ స్థాయిలో లాభాలు పొందారు. ప్రభుత్వ బెయిల్ అవుట్ల ద్వారా, వేతనకోతల ద్వారా రెండు లక్షల కోట్ల డాలర్ల నిల్వ నిధి వాళ్ల వద్ద ఉంది. అయినా ఉద్యోగాలు సరిగా ఇవ్వడం లేదు. ఇచ్చిన వాటికి జీతాలు తక్కువే. పైగా తమకు పన్నులు తగ్గించమని కోరుతున్నారు. వాళ్లకి పందుం తిన్నా పరగడుపే, ఏదుం తిన్నా ఏకాశే.

సంక్షేమ కార్యక్రమాల్ని తగ్గించమంటున్నారు. ఇవి జరిగితేనే ఉద్యోగాలు ఇస్తామని చెబుతున్నారు. ఇదొకరకంగా ప్రభుత్వాన్ని బ్లాక్ మెయిల్ చెయ్యడమే. కార్పొరేట్లకి భారీ నిరుద్యోగం ఉండాలి. అప్పుడే కార్మికులు జీతాల కోతకి తలొగ్గుతారు. ఎక్కువ పని చెయ్యడానికి ఒప్పుకుంటారు. అందుకే మిలియన్ల మంది శ్రమజీవులకు కొద్ది ఆధరువుగా ఉన్న సంక్షేమ కార్యక్రమాలకు కోత పెట్టడమూ, కార్పొరేట్లకూ సంపన్నులకూ పన్నులు పెన్నీ అయినా పెంచకుండా చూడడమూ. అప్పులిచ్చేవాళ్లకు బెయిల్ అవుట్ వచ్చింది. కాని అప్పు తీసుకున్నోళ్లకి రాలేదు. వచ్చినా అరకొరే. అది కుదుటపరిచే స్థాయిది కాదు - అని ఫ్లాయిడ్ నారిస్ చెప్పాడు.

అమెరికా రుణ రేటింగ్ తగ్గింది. దీని ప్రభావంతో అమెరికా అప్పుల మీద చెల్లించాల్సిన వడ్డీ పెరుగుతుంది. ఉద్యోగులూ, యజమానులూ కట్టాల్సిన వడ్డీ కూడా ఎక్కువవుతుంది. వడ్డీ రేటు పెరిగితే ఉద్యోగాలు రద్దు కావచ్చు. థర్డ్ వే అనే ఒక నిష్పాక్షిక సంస్థ అంచనా ప్రకారం 0.5 శాతం వడ్డీ రేటు పెరిగితే 6,40,000 ఉద్యోగాలు రద్దు కావచ్చు.

అమెరికా శ్రామికుల్లో నూటికి 20 మంది ప్రభుత్వరంగంలో పనిచేస్తున్నారు. మాంద్యం ముగిసి రెండేళ్లయినా ప్రభుత్వరంగంలో ఉద్యోగాలు పోతూనే ఉన్నాయి. ఈ ఎనిమిది నెలల్లో ప్రభుత్వాలు 2,38,000 ఉద్యోగాలు తీసేశాయి. ఫెడరల్ మద్దతు తగ్గేటప్పటికి ప్రభుత్వ రంగంలో చాలా ఉద్యోగాలు (టీచర్లు, పోలీస్ ఆఫీసర్లు, అగ్నిమాపక సిబ్బంది) పోయాయి అని ఒబామా ఒక పత్రికా గోష్టిలో చెప్పాడు. మూడో త్రైమాస్యంలో రాష్ట్ర, స్థానిక ప్రభుత్వాలు 1,10,000 ఉద్యోగాలు రద్దు చేసాయి. 2008 ఆగస్ట్ తో పోలిస్తే ఇప్పుడు 5,10,000 తక్కువ. ఫెడరల్ ఉద్యోగాల్లో 10 శాతం కోత పెట్టాలని రిపబ్లికన్ల ప్రతిపాదన.

అమెరికా, యూరప్‌లు రాగల 6 నుంచీ 12 నెలలపాటు మాంద్యానికి ప్రమాదకరమైనంత దగ్గరగా ఉంటాయి అని మోర్గన్ స్టాన్లీ అభిప్రాయ పడింది. ప్రపంచవృద్ధి ముందు చెప్పినట్లు 4.5 శాతం ఉండదనీ,3.9 అనీ సవరించింది. 2012 వృద్ధి 4.5 కాదనీ, 3.8 మాత్రమే ఉండవచ్చనీ అన్నది. జర్మనీ వృద్ధి 2011 తొలి క్వార్టర్లో 1.3 శాతం. రెండో దాంట్లో 0.1 శాతానికి దిగజారింది. జూన్లో కాపిటల్ గూడ్స్ ఆర్డర్లు 15.1 శాతం తగ్గాయి. వినియోగ సరుకులకి సంబంధించి విదేశీ, స్వదేశీ ఆర్డర్లు కూడా తగ్గిపోయాయి.

ఐరోపా పీకల్లోతు సంక్షోభంలో ఉంది. జర్మనీ వృద్ధి, పతనం ప్రపంచ పోకడకి అనుగుణంగానే ఉంది. 17 దేశాల యూరోజోన్ వృద్ధి రెండో త్రైమాస్యంలో 0.2 మాత్రమే. మొదటి మూణ్ణెలల్లో 0.8. ఫ్రాన్స్ వృద్ధి రెండో క్వార్టర్లో సున్న. నెదర్‌లాండ్స్ 0.1, స్పెయిన్ 0.2. పోర్చుగల్ సున్న. ఇటలీ 0.3. రష్యా వరసగా రెండు త్రైమాస్యాలూ బలహీనపడ్డది. ఇక జపాన్ రెండో దాంట్లో 0.3 శాతం క్షీణించింది. హాంకాంగ్ కూడా క్షీణత నమోదు చేసింది.

జపాన్, చైనా, ఇండియాలు ప్రపంచ వృద్ధికి ఊతమిచ్చే స్థితిలో లేవు. చైనా 6.5 శాతం ద్రవ్యోల్బణంతో ఉంది. దీన్ని తగ్గించే చర్యలకు పూనుకుంది. ఇండియా అదేపనిలో పడింది. కనక వృద్ధి పెరగదు. వృద్ధిచెందిన దేశాలు మాంద్యంలో పడ్డప్పుడు వర్ధమాన దేశాలు వాటిని బయటకు లాగలేవు. వీటికి అంత శక్తి ఉండదు. ఇంజన్లుగా పనిచెయ్యాలి అని సమావేశాల్లో చెబుతుంటారు. వీటి కొనుగోలు శక్తి తక్కువ. కనక ఇవి ఇంజన్ లాగా లాగలేవు. ఇప్పటికి బోగీలుగా మాత్రమే ఉంటాయి

ఉద్యోగాలు రావాలంటే వృద్ధి పెరుగుతూ ఉండాలి. మందగించే కొద్దీ కొత్తవి రాకపోగా ఉన్నవి కొన్ని పోతాయి. ప్రస్తుత పరిస్థితి సరిగ్గా అదే. అమెరికాలో 2007 నాలుగో క్వార్టర్ నుంచీ 2011 తొలి క్వార్టర్ వరకూ నిజ జి.డి.పి.. సగటున సంవత్సరానికి 0.2 శాతం క్షీణించింది. 2011 మొదటి ఆరు నెలల వృద్ధి 0.9 శాతమే. అందువల్ల నిరుద్యోగం రేటు తగ్గక పోగా ఇటీవల పెరుగుతోంది. రేటు నిలకడగా ఉండాలంటే నెలకి 1,25,000 ఉద్యోగాలు రావాలి. నిరుద్యోగం ఒక ఏడాదిలో ఒక్క పర్సెంటేజ్ పాయింట్ తగ్గాలంటే నెలకి 2 లక్షల ఉద్యోగాలవంతున రావాలి. 18 నెలల మాంద్యంలో పోయినవి 87.5 లక్షలు. జూన్ చివరిదాకా వచ్చినవి 17.7 లక్షలు. రావలసినవి 70 లక్షల దాకా ఉంటాయి. కొత్తగా పని ఈడు వచ్చేవాళ్లు 1,25,000 అని అంచనా. పోనీ లక్ష అనుకున్నా, ఆ లెక్కన 43 లక్షలు కావాలి. కలిపితే 1కోటీ 13 లక్షలు. ఇన్ని వస్తే మాంద్యం ముందున్న నిరుద్యోగం రేటుకి చేరుతుంది. ఇది మూడేళ్లలో ముగియాలంటే నెలకి 4 లక్షల చొప్పున రావాలి. ఇది అయ్యేది కాదు. జులైలో వచ్చినవి 1,17,000.

జూలైలో మొత్తం శ్రామికులు 15 కోట్లా 30 లక్షలు. నిరుద్యోగులు 1 కోటీ 39 లక్షలు. అంటే 9.1 శాతం. టీనేజర్ల నిరుద్యోగం 25శాతం. దీర్ఘకాల నిరుద్యోగులు (27 వారాలు అంతకు మించీ ఉద్యోగం లేనివాళ్లు) దాదాపు 62 లక్షలమంది.

రాజధాని వాషింగ్టన్ నగరంలో యువత (16-19 ఏళ్లవాళ్లు) నిరుద్యోగం 49 శాతం. కనీస వేతనం తీసుకునే వాళ్లలో నూటికి 40 మంది టీనేజర్లేనని సెన్సస్ బ్యూరో చెప్పింది.

ఉద్యోగం పోతే మళ్లీ వచ్చేటప్పటికి సగటున 279 రోజులు పడుతున్నది. 2009 నుంచీ ఏటా 40 రోజుల చొప్పున పెరుగుతూ వస్తున్నది. పని ఈడొచ్చిన జనంలో ఎంత శాతానికి పని ఉంది అనేది సరైన విషయాన్ని చెబుతుంది. జనాభా-ఉద్యోగిత నిష్పత్తి. 2007 జూన్‌లో 63 శాతం. 2009 జూన్‌లో (మాంద్యం ముగిసిన మాసం) 59.4 శాతం. రికవరీ రెండేళ్లు కొనసాగాక 2011 జూన్‌లో 58.2 శాతం. మాంద్య కాలంలో దాదాపు 5 పర్సెంటేజ్ పాయింట్లు పడిపోయింది. నిరుద్యోగ భృతికోసం కొత్త దరఖాస్తులు ఆగస్ట్ 13 తో ముగిసిన వారంలో 4,08,000. 4 కోట్లా 60 లక్షల మంది అన్నం చీటీల డబ్బుతో బతుకుతున్నారు.

ఉద్యోగం పోతే 26 వారాలపాటు భృతి లభిస్తుంది. దాన్ని 5 సార్లు పొడిగించి 99 వారాలకి పెంచారు. అవీ అయిపోయి నిరాధారంగా ఉన్న వాళ్లు 2010 జులైలో 14 లక్షల మంది ఉన్నారు. ఉద్యోగాలు ఉన్నవాళ్లకి కొనుగోలుశక్తి తగ్గింది. అప్పటికప్పుడు 1000 డాలర్లు ఖర్చు తప్పనిసరి అయితే నూటికి 64 మంది దగ్గర ఉండదు. అప్పో సొప్పో చెయ్యాల్సొస్తుంది. పనిగంటలు తగ్గిస్తున్నందువల్ల ఆదాయాలు పడిపోతున్నాయి. జూన్‌లో వారానికి సగటు పనిగంటలు 34.3కి తగ్గాయి. సగటు వేతనం గంటకి ఒక సెంట్ తగ్గి 22.99 డాలర్లయింది. సగటున వారి వేతనం 788.56 డాలర్లుగా లెక్కకొస్తుంది. 2010 జనవరిలో కంటే ఇది తక్కువ.

ఇళ్ల ధరలు 2011 రెండో క్వార్టర్లో 2010 అదే కాలంతో పోలిస్తే ఇళ్లధరలు 2.8 శాతం తగ్గాయి. 2006 తో పోలిస్తే 32 శాతం తగ్గాయి. తనఖా పెట్టిన వాళ్లు కొందరు ఇళ్లు వదులుకుంటున్నారు సొంత ఇళ్లున్న వాళ్లు తగ్గిపోతున్నారు. ఇళ్లున్నవాళ్లు అమెరికాలో ఇప్పుడు 59.2 శాతం అని మోర్గన్ స్టాన్లీ తేల్చింది. 2004 లో ఎక్కువగా 69.2 శాతం ఉండేది. అమెరికా అద్దెకుండే వాళ్ల దేశంగా మారుతోందని సెన్సెస్ బ్యూరో వ్యాఖ్యానించింది. మధ్యతరగతి దెబ్బతింటున్నది. 2010 సెప్టెంబర్ 20 న ఒక టౌన్ హాల్ మీటింగ్‌లో వెల్మా హర్ట్ అనే మధ్యతరగతి మహిళ లేచి ఒబామాతో మాట్లాడింది. ఆమె ఒబామాకి గట్టి మద్దతు దారు. అతనేదో మధ్యతరగతిని ఉద్ధరిస్తాడనుకున్నది. 'నిన్నూ నీ పాలననీ సమర్థించి సమర్థించి విసిగి పోయాను' అన్నది. ఇక మేము చౌక తిండితో (హాట్ డాగ్స్ అండ్ బీన్స్) బతకాలసిందేనా. ఇది మా కొత్త వాస్తవం కాబోతున్నదా? అని ప్రశ్నించింది. సూటిగా చెప్పమని అడిగింది. అయితే ఒబామా ఆమె అడిగిందానికి సూటిగా జవాబు చెప్పలేదు. 'ఇది అందరికీ గడ్డు కాలమే' అనిచెప్పాడు. మరో సందర్భంలో కార్పొరేషన్లూ ప్రజలే, అన్నాడు. అంటే సంపన్నులూ, నిరుపేదలూ అందరూ ఇబ్బందుల్లో ఉన్నారని చెబుతున్నాడు. అవసరాలకోసం సామన్యులు ఇబ్బందులు పడతారు కాని సంపన్నులు పడరు. అందరికీ గడ్డు కాలం అంటే ఎలా? ఈ ఆర్థిక కష్టాలు/అరిష్టాలు ఒకరోజులో వచ్చినవి కావు. అలాగే ఒకరోజులో పరిష్కారం కావని చెపుతూ బాధ్యతనుంచి తప్పుకునే ప్రయత్నం చేస్తుంటాడు.

అప్పుపరిమితి పెంచాక పెట్టుబడులు పెడతారనీ, ఉద్యోగాలు వస్తాయనీ ఒబామా అంటున్నాడు. సరుకులకు డిమాండ్ పెరిగితేనే ఉత్పత్తి పెరగాలి. అమ్ముడయ్యేకొద్దీ తిరిగి అవసరం మేరకు తయారు చేస్తారు. ఆదాయాలు తగ్గిన జనం, అప్పుల్లో నుంచి బయటపడని జనం కొనేందుకు పెద్దగా ఇష్టపడరు. ప్రస్తుతం ఉన్న ఉత్పత్తి సత్తా కొంత అవసరం ఉండదు. మరి పెట్టుబడులెందుకు పెరుగుతాయి? ఉద్యోగాలు ఎలా వస్తాయి? అప్పు పరిమితి సమస్య ఇప్పటికిప్పుడు తలెత్తింది కాదు. ఎప్పటి నుంచో అందరికీ తెలిసిందే. మునిముక్కుకు వచ్చేదాక ఆగాడు. పోయిన డిసెంబర్‌లో బుష్ పన్నుల కోతని పొడిగించినప్పుడు అప్పు పరిమితి పెంచాలని షరతు పెట్టి ఉండవచ్చు. చివరలోనయినా 14వ రాజ్యాంగ సవరణని ప్రయోగించి అప్పు చేయవచ్చు అలా చేయలేదు. రిపబ్లికన్లతో సంప్రదింపులు జరిపి బడ్జెట్ కోతకి ఒప్పుకున్నాడు. అప్పు పరిమితి పెంచకపోతే సంక్షోభం ఏర్పడుతుందని గగ్గోలు పెట్టారు. అయితే వీళ్లకి నాలుగేళ్లుగా సంక్షోభంలో ఉన్న శ్రామికుల పట్ల శ్రద్ధ లేదు.

అమెరికాకి నిజమైన సంక్షోభం అప్పుకి సంబంధించింది కాదు, నిరుద్యోగానికి సంబంధించింది. అప్పు పెంపు ఒప్పందం నిరుద్యోగాన్ని తగ్గించకపోగా పెంచుతుంది. 2.1 లక్షలకోట్ల డాలర్ల కోత ఎన్ని ఉద్యోగాలను కాజేస్తుందో! ఎంతమంది పేదల్ని నిరుపేదల్ని చేస్తుందో! ఎందరు మధ్యతరగతి వాళ్లని దిగలాగుతుందో! ఇదీ సమస్య. వాళ్లకి మాంద్యం ముగిసేదేలా?

ఇది అప్పు సంక్షోభం కాదు, నిరుద్యోగ సంక్షోభం. పోస్టల్ సర్వీస్ 2,20,000 ఉద్యోగాలు రద్దుచేస్తోంది. శనివారం బట్వాడా ఆపి 40,000 మందికి ఉద్వాసన చెప్పబోతోంది. ఏ పార్టీ ప్రజలకు ప్రతినిధిగా వ్యవహరించడం లేదు. సంపన్నుల సంపదని పెంచే యోచనలు చేస్తున్నారు, ఖర్చుల తగ్గింపు పేరుతో మెడికేర్, మెడికైడ్, సామాజిక భద్రత, అన్నం చీటీలకు కోత పెడుతున్నారు.

మొదట్లో త్యాగాలు అందరూ చేయాలి అన్న ఒబామా చివరకి శ్రామికులకే పరిమితం చేశాడు. సంపన్నుల పన్నులు పెంచలేదు. అప్పుపరిమితి మీద దృష్టి కేంద్రీకరించాడు. ఇది వాల్‌స్ట్రీట్ కి అనుకూలం. రిపబ్లికన్లు సంపన్నుల సంపాదనలో పెన్నీ కూడా కోత పడకుండా చూస్తున్నారు. ఇద్దరు చేస్తున్నదీ సంపన్నులకి మేలూ, ప్రజలకి కీడూ. మొత్తం మీద ఇరు పార్టీలూ ఒకరికొకరు వ్యతిరేకంగా కనబడుతూ పెట్టుబడిదారులకు ఏమాత్రం నొప్పి కలగకుండా చూస్తున్నారు. వాళ్ల ఆర్థిక డిమాండ్లు నెరవేరుస్తున్నారు. వాళ్ల పనులు చక్కబరిచే పనిలో నిమగ్నమై ఉన్నారు. మొత్తం సంక్షోభ భారాన్ని శ్రామికుల మీదకి నెట్టేసి పెట్టుబడిదారులకి నొప్పి కలగకుండా కాపాడుతున్నారు.

డిఫాల్ట్ బూచిని చూపిస్తూ, అప్పుపరిమితి పెంచాలి. రిపబ్లికన్ల మద్దతు లేకుండా చట్ట సభలో అది నెగ్గదు. అంటూ సంప్రదింపులకి దిగి ఇద్దరూ కలిసి ఖర్చుల కోత విధిస్తున్నారు. రిపబ్లికన్లు పన్నులు పెంచడానికి ఒప్పుకోవడం లేదంటూ బాధ్యత నుంచి తప్పించుకో చూస్తున్నాడు ఒబామా.

నాలుగేళ్లక్రితం మాంద్యం రాబోతున్నదని మొదట చెప్పిన వ్యక్తి రూబినీ. ఆయన ఇటీవల వాల్‌స్ట్రీట్ జర్నల్ ఇంటర్వ్యూలో మార్క్స్ ప్రస్తావన తెచ్చాడు. పెట్టుబడిదారీ విధానంలో ఉన్న వైరుధ్యాన్ని గురించిన మార్క్స్ విశ్లేషణ కరెక్ట్ అన్నాడు. ఒకానొక స్థాయి వద్ద పెట్టుబడి దారీ విధానం తన్ను తాను ధ్వంసం చేసుకోగలదు. శ్రమ నుంచి పెట్టుబడికి ఆదాయన్ని చేరుస్తూ పోలేం. మార్కెట్లు అన్నీ చక్కబెడతాయి అనుకున్నాం. కాని అవి సరిగా పనిచెయ్యడం లేదు - అన్నాడు. ఆయన మార్క్సిస్టు కాదు. పరిస్థితుల్ని చూసి చెప్పాడు. మరి బాధలు పడుతున్న ప్రజలు కూడా నెమ్మదిగానయినా తెలుసుకుంటారు. పాలక వర్గాలు పెట్టుబడికి మద్దతివ్వడం గమనించకుండా ఉండరు. పాలక పార్టీల నాటకాల్ని ప్రజలు గ్రహించడం లేదు అనుకుంటే అంతకంటే పొరపాటు ఉండదు. అనుభవం వాళ్లని చైతన్యవంతుల్ని చేస్తుంది. వాళ్ల కష్టాలు తీరే పంథాని ఎంచుకునేట్లు ముందుకు నడిపిస్తుంది.

*(రచయిత రిటైర్డ్ లెక్చరర్)* వీ

భూమి కోసం, బతుకు కోసం ఆరేళ్లుగా పోస్కో ప్రతిరోధ్ సంగ్రామ్ సమితి ఆధ్వర్యంలో ఒడిశాలోని జగత్సింగ్‌పూర్ జిల్లా ప్రజలు చేస్తున్న పోస్కో వ్యతిరేక పోరాటాన్ని వివరిస్తున్నారు **డి.వి. రామకృష్ణారావు**

# బతుకును హరిస్తున్న 'అభివృద్ధి'

ఒడిశాలో పోస్కో స్టీల్ ప్రాజెక్టు నెలకొల్పడాన్ని వ్యతిరేకిస్తూ ప్రజలు చేస్తున్న పోరాటం ఇటీవలి పరిణామాలతో మళ్లీ మన ముందుకు వచ్చింది. 2011 జూలై 16న 8 ప్లాటూన్ల పోలీసులు నువా గాంవ్ గ్రామంలోని ఆందోళనకారులపై లాఠీచార్జ్ చేశారు. ఈ నిరసనకారుల్లో అత్యధికంగా మహిళలే ఉన్నప్పటికీ పురుష పోలీసులే వారిపై లాఠీచార్జ్ చేశారు. చాలా మంది స్త్రీలు గాయాల పాలవగా, కొంతమందికి తీవ్ర గాయాలయ్యాయి. తమ భూములను, చెట్లను, తమ జీవనాధారాల ఆక్రమణను జరగనివ్వబోమని ప్రజలు ప్రతిఘటిస్తున్నారు. ఇదేమీ వారికి కొత్తకాదు. గత ఏడాది మే నెలలో 100 గ్రామాల ప్రజలు పోస్కో ప్రాజెక్టుకు వ్యతిరేకంగా నిరసన చేపట్టినపుడు పోలీసుల హింసను చవిచూసారు. 18 మందిని అరెస్ట్ చేయగా వారిలో ఐదుగురు మహిళలే. ఆందోళనకారులను అణిచివేయడానికి జూన్ 2011లో 26 ప్లాటూన్ల పోలీసులను (వెయ్యి మందికి పైగా) ఈ ప్రాంతంలో మోహరించారు. 3 జూన్ 2011న తమ పొలాలను స్వాధీనం చేసుకోవడాన్ని వ్యతిరేకించిన 17 మందిని అరెస్ట్‌చేసి (ఐదుమంది పిల్లలతో సహా) చితగ్గొట్టారు. ప్రాజెక్టుకు అవసరమైన భూమిని అహింసాయుత పద్ధతిలో, బలప్రయోగం జరపకుండా, శాంతియుతంగా స్వాధీనం చేసుకుంటామని ప్రభుత్వం మళ్లీ మళ్లీ ప్రకటిస్తూనే ఉంది. మరో పక్క ఇటువంటి హింసకు పూనుకొంటుంది.

ఇంతకీ ఈ పోస్కో ఏమిటి? పోస్కో కొరియా దేశానికి చెందిన పొహాంగ్ స్టీల్ కంపెనీ. ప్రపంచంలోని ఉక్కు ఉత్పత్తిచేసే కంపెనీలలో పోస్కోది నాలుగవ స్థానం. పోస్కో ఒడిశాలోని జగత్సింగ్‌పూర్‌లో పన్నెండు మిలియన్ టన్నుల వార్షిక ఉత్పత్తి కలిగిన ఉక్కు కర్మాగారాన్ని ఏర్పాటు చేయడానికి ఒడిశా ప్రభుత్వంతో అవగాహన పత్రాలు కుదుర్చుకుంది. ఈ ప్రాజెక్టుపై పెట్టుబడి విలువ పన్నెండు బిలియన్ డాలర్లు (యాభై నాలుగు వేల కోట్ల రూపాయలు). ఈ ప్రాజెక్టును భారత దేశంలోనే అతిపెద్ద విదేశీ ప్రత్యక్ష పెట్టుబడిగా పేర్కొంటున్నారు. ఇనుప ఖనిజాన్ని ఎగుమతి చేయడానికి ఒడిశాలోనే సుందర్‌గడ్, కియోంఝర్ జిల్లాల్లో ఇంకో మూడు మైన్స్‌కు సంబంధించిన అవగాహన పత్రాలపై కూడా పోస్కో సంతకాలు చేసింది. పారాదీప్‌కు ఉత్తరాన పది కిలోమీటర్ల దూరంలో నౌకాశ్రయాన్ని ఆనుకొని ఉన్న 5063 ఎకరాల భూమిని పోస్కో కోరింది. అయితే ప్రభుత్వం (నిర్వాసితుల సంఖ్యను తగ్గించడానికి) సూచించిన 4050 ఎకరాలతో సరిపెట్టుకోవాల్సి వచ్చింది. ఇందులో 3598 ఎకరాలు ప్రభుత్వ భూమి కాగా మిగిలింది ప్రైవేటు భూమి. 853 ఎకరాల అటవీ భూమి ఈ ప్రాజెక్టు కింద పోతుందని ముందు అంచనా వేసినా, ప్రాజెక్టు నిర్మించే క్రమంలో అంతకన్నా చాలా ఎక్కువ భూమి పోతుందని అర్థమయింది. ఈ పరిస్థితి అక్కడి రెవెన్యూ, అటవి అధికారుల మధ్య కొరకరాని కొయ్యగా మారింది. ఒకవైపు పరిస్థితి ఇలా ఉండగానే సరైన అటవీ అనుమతులు లేకుండానే, తప్పుడు సమాచారంపై ఆధారపడే 2011 మే 2న కేంద్ర పర్యావరణ, అటవీ శాఖ మంత్రి జయరాం రమేశ్ పోస్కో ప్రాజెక్టుకు అనుమతులు మంజూరు చేశారు. ఇక్కడ గమనించాల్సిన ఇంకో ముఖ్యమైన విషయం ఏమంటే 2005 జూన్ 22న మొదట సంతకాలు చేసిన అవగాహన పత్రం ఐదేళ్ల కాలపరిమితి ముగిసింది. ఇటు ప్రభుత్వం, అటు పోస్కో చివరి దశ సంప్రదింపుల్లో భాగంగా అవగాహన పత్రాన్ని పునరుద్ధరించు కోవాల్సే ఉంది.

పోస్కో ప్లాంట్ వల్ల 3700 కుటుంబాలకు చెందిన 22 వేల మంది ప్రజలు నిర్వాసితులవుతారు. వీరంతా ధింకియా, నువాగాంవ్, గడకుగంజ్ గ్రామ పంచాయతీ పరిధిలో నివసిస్తున్నారు. మరీ ముఖ్యంగా గోబిందపూర్, ధింకియా గ్రామాల ప్రజలు ఈ ప్రాజెక్టును తీవ్రంగా వ్యతిరేకిస్తున్నారు. వీరి వ్యతిరేకతకు కారణం, కంపెనీకి ఇవ్వబోతున్న భూములు చాలా సారవంతమైనవే కాక వారి జీవనాధారంతో ముడిపడినవి కావడం. 18 వందల తమలపాకుల తోటలు, 3 లక్షల సరుగుడుచెట్లతో సహా 6 లక్షల చెట్లు ఈ ప్రాజెక్టు వలన కోల్పోతారు. దాదాపు 10 వేల మంది ఇక్కడి తమలపాకు తోటలపై ఆధారపడి జీవిస్తున్నారు. ఈ తమలపాకు తోటలు రు. 50 కోట్ల వార్షికాదాయాన్ని ఇస్తున్నాయి. చాలా మందికి తమలపాకు తోటలే జీవనోపాధి. ఇక్కడ నిరుద్యోగం, ఆకలి అనే మాటలకు తావులేకుండా బతుకు గడుస్తోంది. వాస్తవానికి భూమిలేని, నైపుణ్యంలేని కూలీలే పోస్కోను తీవ్రంగా వ్యతిరేకిస్తున్నారు. ఎందుకంటే వారు తమలపాకు తోటలపైన రోజుకు రు. 200 లేక అంతకన్నా ఎక్కువగానే కూలీ సంపాదించుకుంటున్నారు. కూలీతోపాటు, భోజనం కూడా లభిస్తోంది. దగ్గరనే ఉన్న భువనేశ్వర్‌లో భవన నిర్మాణ కార్మికులకన్నా వీరి సంపాదన ఎక్కువే. ఒడిశాలోని మిగతా ప్రాంతాలతో పోలిస్తే ఈ ప్రాంతంలో చెప్పుకోదగ్గ కూలీ దొరుకుతోంది. ఒక ఎకరంలో పదవ వంతు (పది సెంట్లు) తమలపాకు తోటలో 540 రోజుల కూలిపని దొరుకుతోంది. పోస్కో ఇలాంటి ఉపాధి భరోసాను, జీవికను ఇవ్వదు.

ఇప్పటికీ అటు ప్రభుత్వంగాని, ఇటు పోస్కోగాని చేసిన హామీలు ఏ ఒక్కటీ నిలుపుకోలేదు. బడగోబాపూర్-ఎరాసమా వద్ద పోస్కో ఏర్పాటు చేసిన క్యాంపు పరిస్థితి చాలా దారుణంగా, దైన్యంగా ఉంది. ఈ క్యాంపులో ఉంటున్న కొద్ది మందికి మంచి నీళ్లు, నిత్యావసరాలకు సరిపడా నీళ్లు లేవు. యువకులు, వృద్ధులు పనిలేకుండా ఉండే పరిస్థితి. నష్టపరిహారం కింద రోజుకు రు. 20 ఇస్తున్నారు. ప్రాథమిక ఆరోగ్య సదుపాయం కోసం కూడా 11 కిలోమీటర్లు ప్రయాణించాల్సిందే.

పోస్కోకు అనుకూలంగా మాట్లాడుతున్న వారు అక్కడి కాంట్రాక్టర్లు, రియల్ ఎస్టేట్ వ్యాపారులు, వారి అనుయాయులు మాత్రమే. వీరి ప్రభావంతో ఇంకా కొద్దిమంది భూమిలేని పేదలు పోస్కోకు అనుకూలంగా మాట్లాడుతున్నారు. ఈ కాంట్రాక్టర్లు కూడా ఇప్పుడు స్థానికేతరులకు కాంట్రాక్టులు ఇవ్వడంతో అసంతృప్తికిలోనై ఉన్నారు.

మొత్తంగా ధింకియా, గోవిందపూర్, నువాగాంవ్, నాళియాసాహి, పోలాంగ్, భుయన్‌పాల్, బయనకాంధ, జతాదర్ అనే ఎనిమిది గ్రామల ప్రజలు పోస్కో ప్రాజెక్టును తీవ్రంగా వ్యతిరేకిస్తున్నారు. ఆహింసాయుత పద్ధతులలో తమ నిరసనను తెలియజేస్తున్నారు. ఈ నిరసనలు 2005లో ఒడిశా ప్రభుత్వం పోస్కోతో అవగాహన పత్రాలు సంతకాలు చేశాక ప్రారంభమయ్యాయి. ఇక్కడి గ్రామాల ప్రజలంతా పోస్కో ప్రతిరోధ్ సంగ్రామ సమితి (పి.పి.ఎస్.ఎస్.) గా ఏర్పడి ఈ పోరాటం కొనసాగిస్తున్నారు. ఆరేళ్లుగా పోరాడుతున్న ఈ ప్రజలు అనేక మార్లు పోలీసులతో దెబ్బలు తిన్నారు. బెదిరింపులకు, హింసకు గురయ్యారు. వెయ్యి మందికి పైగా ప్రజలు క్రిమినల్ కేసులు ఎదుర్కొంటున్నారు. వీరి పోరాటంలో ప్రత్యేకత ఏమంటే మహిళలు ముందు భాగాన ఉండడం. అంతే కాదు మహిళలు అనేక కేసులను ఎదుర్కొంటున్నారు. వీరు శాంతియుత పద్ధతుల్లో చేస్తున్న పోరాటం అటు ప్రభుత్వానికి, ఇటు పోస్కోకి మింగుడు పడడంలేదు.

ఒడిశా ప్రభుత్వం ఈ ఏడాది ప్రారంభం నుంచి భూసేకరణ ప్రక్రియను వేగవంతం చేసింది. ఆ క్రమంలో పోస్కో ప్రతిరోధ్ సంగ్రామ సమితి సభ్యులపై బెదిరింపులు పెరిగాయి. అక్కడి ప్రజలు వంతుల వారిగా ఇంటికొకరు చొప్పున ప్రతిరోజూ కనీసం 150 మందికి తక్కువ కాకుండా ప్రభుత్వం స్వాధీనం చేసుకోవాలనుకుంటున్న భూమిపై ప్రతిఘటించడానికి కూర్చుంటున్నారు. వారు గత ఆరేళ్లుగా ఈ పని చేస్తున్నారు. పోలీసులు పెద్ద ఎత్తున దిగితే ప్రజలు కూడా వెను వెంటనే పెద్దఎత్తున పోగవుతున్నారు. ఈ విధంగా పిల్లల, మహిళల ప్రతిఘటనతో పోలీసులను నిలువరించగలుగుతున్నారు. ఇప్పుడక్కడ స్కూళ్లన్నీ పోలీసు క్యాంపులుగా మారిపోయాయి.

2011 జూలై 4న జాతీయ బాలల హక్కుల పరిరక్షణ కమిషన్ (ఎన్‌సిపిసిఆర్) తరపున ముగ్గురు సభ్యులు పోస్కో ప్రాజెక్టు ఏరియాలో పర్యటించారు. ఈ పోరాటంలో పిల్లలు పాల్గొంటున్నా వారిని మానవ కవచాలుగా ఉపయోగించు కుంటున్నారనే ఆరోపణల్ని దృష్టిలో ఉంచుకొని ఆ బృందం పరిశీలించింది. వాళ్లు ఇచ్చిన నివేదికలోని విషయాలు మీడియాలో వచ్చాయి. ఎన్‌సిపిసిఆర్ తన నివేదికలో - పోస్కో వ్యతిరేక ఉద్యమంలో పాల్గొంటున్న పిల్లలు తమ కుటుంబ ఆశయాన్ని పరిరక్షిస్తున్నట్లు భావిస్తున్నారని పేర్కొంది. కుటుంబానికి బతుకుదెరువు పోతున్నదన్న భయం పిల్లల మనసులను ఆవరించి వారిని ఆందోళనకు గురిచేస్తోందని పేర్కొంది. ఈ కారణంతోనే పిల్లలు కూడా ఆందోళనలో భాగమవు తున్నారని కమిషన్ సభ్యులు తమ నివేదికలో పేర్కొన్నారు. కమిషన్ సభ్యులు ఒడిశా ప్రభుత్వ ధోరణిని తీవ్రంగా ఖండించారు. స్కూళ్లను పోలీసులు ఆక్రమించారని మధ్యాహ్న భోజన పథకం అమలులో ప్రభుత్వం విఫలమయిందని తమ నివేదికలో పేర్కొన్నారు. అలాగే జిల్లా శిశు రక్షణ కమిటీ కూడా తన బాధ్యతలు నిర్వహించడంలో విఫలమయిందని పేర్కొన్నారు.

ఆ తరువాత 2011 జూలై 15న జగత్సింగ్‌పూర్ జిల్లా శిశు సంక్షేమ కమిటీ నుంచి ఒక బృందం వచ్చి పిపిఎస్ఎస్ నాయకులు అభయ్ సాహు, మనోరమా ఖతువాలతో మాట్లాడుతూ పిల్లలు స్కూళ్లకు వెళ్లకుండా ఉద్యమంలో పాల్గొంటున్నారా అని అడిగినపుడు - తమ తల్లితండ్రులు పోలీసులతో దెబ్బలు తింటుంటే పిల్లలు ఎక్కడయినా ప్రశాంతంగా పుస్తకాలు తీసుకొని స్కూలుకు వెళ్లగలరా అని వారు ఎదురు ప్రశ్నించారు. ఈ ఆరేళ్ల పోరాటంలో పన్నెండేళ్ల వాళ్లంతా ఇప్పుడు పద్దెనిమిదేళ్లవాళ్లు అయ్యారు. ఓటు వేసే వయసుకు చేరారు. ఆరేళ్ల వాళ్లంతా పన్నెండేళ్లవాళ్లు అయ్యారు. తమ కళ్లెదుటే తమ భూమి, మొత్తంగా బతుకుదెరువే పోతుంటే తమ పిల్లలకు అసలు భవిష్యత్తు ఎక్కడ మిగిలిందని వారు ప్రశ్నించారు. అయినా పిల్లలు నిజంగానే చదువుకుందామనుకున్నా వాళ్ల స్కూళ్లను పోలీసులు ఆక్రమించారని తెలిపారు. మమ్మల్ని మీరు మా పిల్లలకోసం అడిగే ముందు హోటళ్లలోనూ అతి ప్రమాదకరమయిన మైనింగ్ పరిశ్రమల్లోనూ పనిచేస్తున్న పిల్లల్ని ఎందుకు నిరోధించలేక పోతున్నారని ప్రశ్నించారు. మా పిల్లలు పోస్కో వ్యతిరేక పోరాటంలో భాగంగా శాంతియుత పద్ధతుల్లో, అహింసాయుత పద్ధతుల్లో కార్పొరేట్లకు అనుకూలంగా, ప్రజా వ్యతిరేకంగా పనిచేస్తున్న ప్రభుత్వంతో ఎలా పోరాడాలి అనే విద్యను నేర్చుకుంటున్నారని అన్నారు. వాస్తవానికి మా పిల్లలు మాతో సహా ఇలా పోరాడుతున్నందుకు మీరంతా అభినందించాలన్నారు. వీరి కన్నా ముందు వచ్చిన ఎన్.సి.పి.సి.ఆర్. తన నివేదికలో పేర్కొన్న విషయాలను కూడా ఈ బృందం పట్టించుకోలేదు.

ఎన్.సి. సక్సేనా కమిటీ, మీనా గుప్తా కమిటీలు చేసిన నిజనిర్ధారణలో చాలా స్పష్టంగా ప్రతిపాదిత ప్రాంతంలో సంప్రదాయిక అటవీ వాసులు ఉన్నారని, వారు తమ జీవనానికి సంప్రదాయికంగా అడవి మీదనే ఆధారపడుతున్నారని చాలా స్పష్టంగా పేర్కొన్నాయి. అక్కడ అటవీ హక్కులున్నాయనీ కాని రాష్ట్ర ప్రభుత్వం అటవీ హక్కులను అమలు చేయడం లేదనీ అవి ఆరోపించాయి. 65 శాతానికి పైగా ధింకియా, గోవిందపూర్ గ్రామస్తులు తమ గ్రామ సభల్లో ఎటువంటి భూ ఆక్రమణకైనా తాము వ్యతిరేకమని ఖచ్చితంగా ఓటు చేయగా, వాస్తవాల్ని కప్పిపుచ్చుతూ అసలు ఆ తీర్మానాలే సరైనవి కావని రాష్ట్ర ప్రభుత్వం పర్యావరణ, అటవీ మంత్రిత్వ శాఖకు ఇచ్చిన నివేదికలో తప్పుడు సమాచారం ఇచ్చింది. మీనా గుప్తా కమిటీ సిఫారసుల మీద ఆధారపడి ఫారెస్టు అడ్వయిజరీ కమిటీ అటవీ అనుమతిని వెనక్కి తీసుకోవాలని సిఫారసు చేసింది. కానీ వీటన్నిటినీ ఉల్లంఘిస్తూ 2011 మే 2న పర్యావరణ, అటవీ శాఖ మంత్రి జైరాం రమేశ్ పర్యావరణ అనుమతిని మంజూరు చేశారు. ఆ వెంటనే ఒడిశా ప్రభుత్వం పోలీసు బలగాలను భూ ఆక్రమణకై మోహరింప చేసింది.

**మాఫియా స్వభావం సంతరించుకున్న మీడియాకు పరాకాష్ట మర్డోక్ పత్రిక 'న్యూస్ ఆఫ్ ది వరల్డ్' అని అంటున్నారు మాడభూషి శ్రీధర్**

# అక్షరాలతో ఘోరాలు - మర్డోక్ నేరాలు

తన మీడియా సామ్రాజ్యాన్ని ఖండాంతరాలకు విస్తరించిన రుపర్ట్ మర్డోక్ నేరాలు అన్నీ ఇన్నీ కాదు. ఇవి కేవలం అనైతిక విధానాలు కాదు. అతని కార్పొరేట్ మీడియా సైబర్ నేరాలతో సహా అనేక రాజ్యాంగ వ్యతిరేక కార్యకలాపాలకు పాల్పడి వ్యక్తుల ప్రైవసీని భంగపరిచి, నేరాల విచారణను కూడ అడ్డుకునే దుర్మార్గానికి పాల్పడ్డట్టు సంఘటనలు రుజువు చేస్తున్నాయి. మొత్తం పాలనా వ్యవస్థను పాప పంకిలంచేసి యంత్రాంగాన్ని కూడా కలవర పెట్టాడు. మానవతా విలువలను మంట గలపడానికి సాంకేతిక పరిజ్ఞానాన్ని వాడుతూ హాకింగ్ నేరం ద్వారా రహస్య సమాచారం సేకరించి దానికి మసాలా రంగరించి సంచలన వార్తగా మలచి అమ్ముకోవడం అనే కొత్త నేర పద్ధతులను పెంచి పోషించిన రుపర్ట్ మర్డోక్ అంతర్జాతీయ పాతకలోకం ముందు అక్షర దోషిగా నిలబడ్డాడు. అంతేకాదు, పోలీసులను, రాజకీయ నాయకులను కూడా భ్రష్టుపట్టించి రాజ్యాంగ పాలనా విధానాలకే ఒక సవాలుగా మారాడు. మర్డోక్ నేరానికి సాటి లేదు. మనకు తెలిసిన నేరాల వేళ్లు అధోజగత్తులో ఉంటే బ్రిటన్ ఫోన్ హాకింగ్ నేరాలు మేధావుల అవినీతికి నిదర్శనం.

మనదేశంలో రాడియా టేపులు కేవలం కార్పొరేట్ రంగానికి రాజకీయ నాయకులకు మధ్య మీడియా ఏ విధంగా అనైతిక వారధిగా పనిచేసిందో చెప్పే ఉదంతం. అందులో దాగిన సంబంధాలు వెల్లడైనపుడు అవినీతి నేతలతో కొందరు సీనియర్ పాత్రికేయులకున్న సంబంధాలు చూసి సభ్యసమాజం విస్తుబోయింది. ఎన్నికలలో పోటీచేసిన ప్రతివారూ గెలుస్తారన్న అబద్ధపు వార్తలు రాసేందుకు పత్రికలు తమను తాము అమ్ముకున్న సంఘటనలు చూసి వాపోయింది. ఆ టేపుల వెల్లడివల్ల, ఆ తరువాత మీడియా పాత్ర వల్ల 2జి స్పెక్ట్రం దారుణాలు బయట పడ్డాయి. నిందితులు బోనెక్కే పరిస్థితి ఏర్పడింది. ప్రణబ్ ముఖర్జీ కార్యాలయంలో బగ్గింగ్ సంఘటన దీని ముందు చాలా చిన్నది. దాంతో మీడియాకు ఇతర వ్యాపార రంగానికి ముడిబడి ఉన్న వ్యవస్థాగతనేరాల తతంగం ఉందని తేల లేదు. మర్డోక్ వ్యవహారం చాలా ముదిరిపోయి పాత్రికేయులను నేరగాళ్లుగా మార్చి సామాన్యులతో మాన్యులతో కూడ చెలగాటమాడిన దారుణాల సమాహారం. పోలీసులకు, రాజకీయ నాయకులకు, జర్నలిస్టులకు, చివరకు నేరగాళ్లకు మీడియా యజమాను లకు అక్రమ సంబంధాలున్నాయని మర్డోక్ మీడియా నేరాలు చెబుతున్నాయి. 168 ఏళ్ల న్యూస్ ఆఫ్ ది వరల్డ్ పత్రికను ఈ నేరమే ఆపేసింది.

అసలు మర్డోక్ పత్రిక ఏం చేసిందో తెలియకపోతే ఆయనగారి పాత్రికేయుల పాతకాలు అర్థం కావు. మిల్లీ డౌలర్ అనే బాలికను 2002లో ఎవరో ఎత్తుకు పోయారు. ఆరు నెలల తరువాత ఆ అమ్మాయి శవం దొరికింది. కాని ఆమెను ఎప్పుడు చంపేసారో చాలా కాలం తెలియరాలేదు. న్యూస్ ఆఫ్ ది వరల్డ్ పాత్రికేయులు కొందరు ప్రయివేటు ఇన్వెస్టిగేటర్ల ద్వారా ఆ అమ్మాయి ఫోన్‌ను హాక్ చేయించి బాక్స్‌లో కొన్ని వాయిస్ మెయిల్‌లను తొలగించారు. ఆమెనే తొలగించి ఉండవచ్చునని ఊహించి ఫోన్ ఉపయోగిస్తున్నారని అర్థం చేసుకున్న

---

పోస్కోని తమ ప్రాంతంలో ప్రవేశించనివ్వకూడదని వేలాది మంది ఎందుకు జీవన్మరణ పోరాటం చేస్తున్నారు. మొత్తంగానే ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా పోరాడుతున్న ప్రజల సంఖ్య రోజు రోజుకు ఇబ్బడి ముబ్బడిగా ఎందుకు పెరుగుతోంది. సింగూరు, నందిగ్రాం, లాల్‌గఢ్, నారయణపట్నా, భట్టాపర్సోల్, జైతాపూర్, కళింగనగర్, సోంపేట, బస్తర్ ఇలా దేశ వ్యాప్తంగా ప్రజలు ఎందుకు తిరగబడుతున్నారు. పాలకులు తెస్తున్న 'అభివృద్ధి'ని ఎందుకు తిరస్కరిస్తున్నారు. మన దేశంలోని ప్రతి రాష్ట్రంలోనూ అనేక గ్రామాల్లో, పట్టణాల్లో విశాల ప్రజానీకం పెద్దఎత్తున కదిలి చేస్తున్న ఆందోళనలు ఎందుకు మళ్లీ మళ్లీ పుట్టుకొస్తున్నాయి? ప్రజల ఆందోళనల ఈ సుదీర్ఘ జాబితా ఏ నిజాల్ని మాట్లాడుతోంది. ప్రజలు ఏం అడుగుతున్నారు? తమకు ఏం కావాలంటున్నారు? ఇవన్నీ మనమంతా ఆలోచించాలి.

పాలక విధానాల వలన జరిగిన, జరుగుతున్న, జరగబోతున్న నష్టం 'భౌతికం'గా ప్రకృతి వనరులు, ఆస్తులు, ప్రాణాలు వంటి వాటిని కోల్పోవడం రూపంలోనే కాదు, మనుషులుగా మనల్ని మనం గుర్తించు కోవడానికి తప్పనిసరి అని మనం అనుకుంటున్న ఆత్మగౌరవం, సార్వభౌమత్వం, స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, తలవంచనితనం వంటి వాటిని కోల్పోవడం రూపంలోనూ ఉంటుంది. జగత్సింగ్‌పూర్ ప్రజలు తమకు [illegible]్సింది నిర్ణయించుకునే హక్కు తమకే ఉండాలని, తమ బతుకును [illegible]దుకోసం, ఎవరికోసం కోల్పోవాలనీ, బానిసల్లాంటి బతుకులు మేం బతకమని ప్రకటిస్తున్నారు. ప్రజల్ని (ఉత్పత్తిలో పాల్గొనే శ్రామికులు), పర్యావరణాన్ని కాపాడు కోవాల్సిన బాధ్యత మన అందరిదీ. మనమంతా పోస్కో వ్యతిరేక పోరాటం చేస్తున్న ప్రజలతో గొంతుకలుపుదాం. వీ

*(రచయిత వీక్షణం సహాయ సంపాదకులు)*

ఆమె బంధువులు, పోలీసులు ఆమె బతికే ఉందని నమ్మారు. ఈ తొలగింపుల వల్ల నేరగాళ్లపై కీలకమైన సాక్ష్యం మాయమై పోయే ప్రమాదం ఏర్పడింది. ఆ అమ్మాయి బతికిలేదని కుటుంబం రోదిస్తూ ఉంటే వారి కుటుంబ సమాచారం రచ్చకెక్కించి ఈ పత్రిక తమాషా చేసింది.

కాని పకడ్బందీ పరిశోధనతో సీరియల్ కిల్లర్ లేవీ బెల్ ఫీల్డ్ నేరాన్ని గత జూన్‌లో రుజువుచేసి యావజ్జీవ శిక్ష పడేట్టు చేసింది బ్రిటిష్ నేరపాలనా వ్యవస్థ. మిల్లీ ఫోన్‌ను ఏవిధంగా హాక్ చేశారో వివరిస్తూ గార్డియన్ పత్రిక జూలై 4న పరిశోధనా వార్తా కథనం రావడంతో, ప్రధాని కెమెరూన్‌తో మర్డోక్ కు సన్నిహిత సంబంధాలు ఉన్నప్పటికీ వెంటనే దర్యాప్తు చేయక తప్పలేదు. ప్రతిపక్ష నాయకుడు ఎడ్ మిలిబాండ్ కూడా వెంట వెంట చర్యలు ప్రారంభించడంతో మర్డోక్ అక్షర సామ్రాజ్యానికి అక్షరాలా బీటలు పడ్డాయి. భారత్‌కు ఇంగ్లాండ్ పాలనా వ్యవస్థకు అదే తేడా. అవినీతి భ్రష్టుపట్టడంలో రెండూ ఒకటే. అయినా, అక్కడ నేరగాళ్లు దొరుకుతున్నారు, జైలు ఊచలు లెక్కిస్తున్నారు. ఆదివారపు సంచలన పత్రిక న్యూస్ ఆఫ్ ది వరల్డ్ బ్రిటన్ రాజకుటుంబం వార్తలు రాయడానికి ప్రత్యేకంగా నియమించిన రాయల్ ఎడిటర్ క్లైవ్ గుడ్మన్ రాణిగారి సహాయకుల ఫోన్లలో జొరబడి చెవులు రిక్కించి ప్రిన్స్ విలియమ్స్ మోకాలి చికిత్స వివరాల వంటి చెత్త అంశాలను గొప్ప వార్తలుగా ప్రచురించాడు. ఆ హాకింగ్ నేరానికి గాను గుడ్మన్‌కు జనవరి 2007లో నాలుగు నెలలు జైలు శిక్ష విధించారు. ఇటువంటి ఘాటైన వార్తలు రాసి సర్క్యులేషన్ 28 లక్షలకు పెంచుకుందా పత్రిక. చాటుగా వాయిస్ మెయిల్ వినడానికి ఈ పత్రిక వారు నాలుగు వేల మందిని టార్గెట్ చేసారని పోలీసులు తెలిపారు. ఈ హాకింగ్ బాధితుల్లో రాజకీయ నాయకులు, వ్యాపార ప్రముఖులు, తారలు, క్రీడాకారులు, నేరాలకు బాధితులు కూడా ఉన్నారు. పత్రికా రంగంలో గట్టిపోటీ వల్లనే ఈ పిచ్చి గందరగోళాలు జరిగాయని మర్డోక్ వివరణ ఇచ్చుకున్నాడు.

న్యూస్ ఆఫ్ ద వరల్డ్ దారుణాలను గార్డియన్ వంటి ఇతర పత్రికలు పరిశోధించి బయటపెట్టాయి. 2010 సెప్టెంబర్లో న్యూయార్క్ టైంస్ పత్రిక కూడా న్యూస్ ఆఫ్ ది వరల్డ్ దుర్మార్గానికి సంబంధించిన అనేక పరిశోధనాత్మక కథనాలు ప్రచురించింది. 2009లో ఈ పత్రికలో పనిచేసే జర్నలిస్టులు మూడువేల మంది ప్రముఖుల వ్యక్తిగత సంభాషణలు విని వార్తలు రాసారని గార్డియన్ పత్రిక వెల్లడించింది. సీనా మిల్లర్ అనే సినీతార తన ఫోన్‌ను ఈ విధంగా హాక్ చేసారని తెలుసుకుని దావా వేసింది. ఆమెకు లక్ష పౌండ్ల పరిహారం చెల్లించవలసి వచ్చింది. ఫుట్‌బాల్ ప్రముఖుడు ఆండీ గ్రే 20 వేల పౌండ్లు సాధించాడు. మాక్స్ క్లిఫర్డ్ అనే మరో ప్రముఖుడు 7 లక్షల పౌండ్లు సంపాదించాడు. ఈ నేరాలు నెత్తురంటని ఘరానా నేరాలే అయినా వారిని పట్టుకునే చట్టాలు కూడా పకడ్బందీగానే అమలవుతున్నాయని, వాటితోపాటు పరిహారాలు వసూలు చేసే సివిల్ కేసులు కూడా జోరుగా వేగంగా జరుగుతున్నాయని భారత్‌లో పాలకులు ప్రజలు అర్థం చేసుకో

ఇప్పుడు అధికారంలో ఉన్న టోరీలు ఫోన్ హాకింగ్ నేరాలను కప్పి పుచ్చే కుట్రలు చేస్తున్నదనే ఆరోపణలు ఎదుర్కొంటున్నది. అసలు హాకింగ్ నేరాల కన్న వాటి తీవ్రత, విస్తారం, మర్డోక్ రాజకీయ పలుకుబడితో దాన్ని దాచడానికి చేస్తున్న ప్రయత్నాలు మరింత అప్రతిష్ఠ తెస్తున్నాయి. బ్రిటన్ సమాచార కమిషనర్ సిబ్బంది జరిపిన దాడులలో 305 మంది జర్నలిస్టులు అక్రమంగా ఇతర పౌరుల వ్యక్తిగత సమాచారం కొన్నట్టు 2006లో గార్డియన్ సమాచార హక్కు కింద అడిగిన వివరాల్లో తేలింది. ఈ జర్నలిస్టుల దగ్గర ఫోన్ల వాయిస్ మెయిల్ పిన్ నెంబర్లు 91 దొరికాయి. జూలై 16, 17 తేదీలలో అనేక పత్రికలలో భారీ ఎత్తున వాణిజ్య ప్రకటనల రూపంలో క్షమాపణలు చెప్పింది. మరొక వైపు యు కె పార్లమెంట్ సెలెక్ట్ కమిటీ న్యూస్ ఆఫ్ ది వరల్డ్ పత్రిక నైతిక పతనాన్ని వేలెత్తి చూపింది. ఈ పత్రికతో పాటు మర్డోక్ గ్రూప్‌కు చెందిన ది సన్, సన్డే టైంస్ పత్రికలు కూడా ఫోన్ హాకింగ్ నేరాలకు పాల్పడ్డాయని, మాజీ ప్రధాని గార్డన్ బ్రౌన్ ఆరోగ్యం, ఆర్థిక, చట్టపరమైన, ఫోన్ రికార్డులను సేకరించి ఆయన జబ్బుల గురించి వార్తలు రాయడానికి కుట్రలు చేశాయని వెల్లడి చేశారు. ఈ అక్షర దారుణాలపైన 2006లో మెట్రోపాలిటన్ పోలీసులు దర్యాప్తు ప్రారంభించినా ఆశ్చర్యకరంగా 2009లో ఆ దర్యాప్తు నిలిపివేయాలని నిర్ణయించింది. పోలీసు విభాగం తరువాత క్షమాపణ చెప్పి 2011 జనవరిలో మళ్లీ దర్యాప్తు ప్రారంభించింది. దర్యాప్తు ఆగిపోవడంలో న్యూస్ ఇంటర్నేషనల్ కంపెనీ ప్రముఖుల పాత్ర ఉందని హోం శాఖ వ్యవహారాలు పరిశీలించే పార్లమెంటరీ కమిటీ ముందు పోలీసులే సాక్ష్యం చెప్పారు. పోలీసులకు కూడా డబ్బు ఇచ్చి తమ సంస్థ సమాచారం కొన్నదని ఎడిటర్ రెబెకా బ్రూక్స్ లంచాల కమిషన్ ముందు నేరాంగీకార ప్రకటన చేసింది.

ఈ కుంభకోణంలో కీలకపాత్ర ఉన్న న్యూస్ ఆఫ్ ది వరల్డ్ ఎగ్జిక్యూటివ్ నీల్ వాలిస్ ను ఆ తరువాత పోలీసు కమిషనర్ సర్ పాల్ స్టిఫెన్సన్ తన సలహాదారుడిగా నియమించుకోవడం పై విమర్శలు రాగా ఆ కమిషనర్ రాజీనామా చేయవలసి వచ్చింది. ఈమెయిల్స్ సాక్ష్యంలో పోలీసులకు ముడుపులు అందాయని తేలింది. ఈ సంగతి బయటపెట్టిన విజిల్ బ్లోయర్ న్యూస్ ఆఫ్ ది వరల్డ్ మాజీ విలేకరి సియన్ హోర్ ఈ జులై నెలలో హత్యకు గురవ్వడంతో ఈ మీడియా ఘోరాల వెనుక మాఫియా సంబంధాలు కూడా ఉన్నట్టు వెల్లడయింది.

తన ఉద్యోగులకు ప్రమేయం ఉన్న ఈ దుర్మార్గంలో రుపర్ట్ మర్డోక్ కు పాత్ర ఉందా లేదా? హౌస్ ఆఫ్ కామన్స్ మీడియా కమిటీ ముందు హాజరై తనకు సంబంధం లేదని వాదించాడు. ఈ ఆరోపణలు రెండు మూడేళ్లుగా చర్చలో ఉన్నాయి. కోర్టు కేసులలో పోరాడి ఓడి, లక్షల పౌండ్లు పరిహారం చెల్లించి, ఓడిపోతామని తెలిసిన కేసుల్లో కోర్టు బయట రాజీకుదుర్చుకుని లక్షల పౌండ్లు సమర్పించి ఏమీ తెలియదంటే కుదురుతుందా? కీలకమైన పదవుల్లో ఉన్న తనవారు జైలు పాలయినా తమ జర్నలిస్టులు ఈ విధంగా కాని పని చేస్తున్నారని తమకు తెలియదంటే నమ్మడం కష్టం. బ్రిటన్ ప్రధాని కామెరూన్ మర్డోక్ కంపెనీల ప్రముఖులతో గత 15 నెలల్లో 26 సార్లు సమావేశమయ్యారని, స్కాట్లాండ్ కమిషనర్ పాల్ స్టిఫెన్సన్ నాలుగేళ్లలో మర్డోక్ ఎడిటర్లు ఎగ్జిక్యూటివ్‌లతో 18 సార్లు సామాజికంగా కలిసారని వెల్లడైనాయి. వీటి ప్రభావం దర్యాప్తు పైన కూడా ఉంటుందని పత్రికలు దుమ్మెత్తి పోస్తున్నాయి. మర్డోక్ తనను వ్యతిరేకించిన ఎంపీల ప్రయివేటు బతుకుల మీద నానా రాతలు రాస్తారేమోననే భయం కూడా వ్యాపించింది. కనీసం ఈ దెబ్బతోనైనా మీడియా మీద కార్పొరేట్ సంస్థల దుర్మార్గపు ఆధిపత్యం కరిగిపోతుందేమో చూడాలి. అధికారపార్టీ టోరీ ఫోన్ హాకింగ్ నేరాల నుంచి మర్డోక్‌ను రక్షిస్తే అంతకన్న పతనం మరొకటి ఉండదు. వీ

*(రచయిత నల్సార్ యూనివర్సిటీలో ప్రొఫెసర్)*

**ఆర్.ఎస్. రావు** *తెలుగు వ్యాసాలన్నీ 2010 అక్టోబర్ లో 'కొత్తచూపు' పేరుతో వీక్షణం ప్రచురణగా వెలువడ్డాయి. కాని 1995లో వెలువడిన 'టువర్డ్స్ అండర్ స్టాండింగ్ సెమి ఫ్యూడల్ సెమి కలోనియల్ సొసైటీ' లోనూ, పత్రికలలోనూ ఇంకా తెలుగులోకి రాని వ్యాసాలున్నాయి. ఆ రచనలను కూడ తెలుగుచేసి పాఠకులకు అందించే ప్రణాళికలో భాగంగా ఈ వ్యాసం. ఇది 1984 మార్చ్ 10-11 లలో వరంగల్ కాకతీయ విశ్వవిద్యాలయంలో జరిగిన ఆంధ్రప్రదేశ్ ఎకనమిక్ అసోసియేషన్ రెండవ వార్షిక సదస్సులో సమర్పించిన పత్రం - సం.*

# వ్యవసాయ సంబంధాల సిద్ధాంతం దిశగా.. - 2

*(గత సంచిక తరువాయి)*

## దేశీయ మార్కెట్ అన్వేషణలో

మదుపు, ప్రత్యేకంగా ఆధునిక వ్యవసాయ పనిముట్లలో మదుపు, పెట్టుబడిదారీ సంబంధాల అభివృద్ధిని సూచించేందుకు తగిన షరతు[9] అనీ, వ్యవసాయ కార్మికులు ఉనికిలో ఉండడం అవసరమైన షరతు అనీ ఒక అభిప్రాయం గత చర్చలో పదేపదే కనబడింది. ఐతే, వ్యవసాయ సంబంధాలను పెట్టుబడిదారీ సంబంధాలుగా సూత్రీకరించడానికి ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం మీద కేంద్రీకరిస్తే కొన్ని ఆసక్తికరమైన పర్యవసానాలుంటాయి. మొట్టమొదటిది, అది వస్తువుల సూచికకు సంబంధాల సూచిక స్థాయినిస్తుంది. అంటే వస్తువుల ఉనికే సంబంధాల ఉనికి అనుకుంటుంది. రెండవది, అది పాత ఉత్పత్తి పద్ధతులమీద కూడ పెట్టుబడి పెరగగల అవకాశాన్ని రద్దు చేస్తుంది. మూడవది, అలా చేయడం ద్వారా ఈ ఆలోచనాధోరణి పెట్టుబడి దానంతటదే ఉత్పాదకమైనదనీ, ఆధునిక పెట్టుబడి మరింత ఉత్పాదకమైనదనీ నమ్ముతుంది. ఈ పర్యవసానాలన్నీ కలిసి ఉమ్మడిగా దేశీయ మార్కెట్ లేదనే సమస్యను కేంద్రస్థానం నుంచి తప్పించేస్తాయి. కాని భారత వ్యవసాయ పరివర్తన ఎదుర్కొంటున్న సమస్య ఈ దేశీయ మార్కెట్ సమస్యే. దీన్ని కాస్త వివరంగా చూద్దాం.

"భారతదేశంలో పెట్టుబడిదారీ వ్యవసాయ అభివృద్ధి ఉత్పత్తి సంబంధాల పరివర్తన, దోపిడీ రూపాల పరివర్తన అనే రెండు పరిణామాలతో కలగలిసి సాగింది. నిజం చెప్పాలంటే ఆ రెండు పరిణామాలుగానే సాగింది. అణగి ఉండే, రుణంవల్ల కట్టుబడి ఉండే, సాంప్రదాయిక బంధనాలతో ఉండే శ్రామికుల స్థానంలో దాదాపుగా నిర్బంధ రహితమైన, సాపేక్షికంగా ఎక్కడికంటే అక్కడికి వెళ్లగలిగిన, చాలవరకు ద్రవ్యరూప వేతనం దొరికే శ్రామికులు వచ్చారు. ఆధునిక, శాస్త్రీయ వ్యవసాయంలో మదుపు విపరీతంగా విస్తరించింది. దానివల్ల కనీసం కొన్ని ప్రాంతాలలోనైనా, కొన్ని పంటలలోనైనా ఉత్పత్తి హెచ్చుగా పెరిగింది" అని ఉత్పత్తి విధానంపై జరిగిన చర్చను క్రోడీకరిస్తూ ఆలిస్ థార్నర్ రాశారు[10].

చర్చాక్రమంలో వెలికివచ్చిన ఈ అభిప్రాయాన్ని ఒక ప్రధాన దృక్పథంగా పరిగణిస్తే, ఈ ప్రకటనలోని రెండు అంశాలను పరిశీలించడం ఉపయోగకరంగా ఉంటుంది. మొదటిది, భారత వ్యవసాయ సంబంధాల స్వభావాన్ని అంచనా కట్టడంలో ఆధునిక, శాస్త్రీయ ఉత్పత్తి సాధనాల వాడకానికి ముఖ్య పాత్ర ఇచ్చే ధోరణి. స్వాతంత్ర్య సమయానికి దేశంలో భూస్వామ్య ఆస్తి సంబంధాలు ఉన్నాయని, ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం వల్ల పెట్టుబడిదారీ సంబంధాలు నెలకొన్నాయని ఎక్కువమంది రచయితలు వాదించారు గనుక వారందరూ పెట్టుబడిదారీ విధానంలో ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం అనివార్యమైన భాగం అనుకుంటున్నారన్నమాట. రెండవది, "కనీసం కొన్ని ప్రాంతాలలోనైనా, కొన్ని పంటలలోనైనా అభివృద్ధి జరిగింద"నే అంశాన్ని నొక్కిచెప్పడం అంతరార్థం ఏమిటనేది. పెట్టుబడిదారీ విధానంలో అభివృద్ధి అనేది అసమాన అభివృద్ధిగా ఉంటుంది గనుక, ఇవాళ సాంకేతిక పరిజ్ఞానంలో వెనుకబడి ఉన్న ప్రాంతాలు కాలక్రమంలో అభివృద్ధి చెందుతాయని, అభివృద్ధి అనేది కేవలం కాలక్రమంలో, బహుశా వనరుల పునఃకేటాయింపుతో మాత్రమే జరుగుతుందని ఆ అంతరార్థం.

ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం మీద శ్రద్ధ వ్యవసాయోత్పత్తిలో పెరుగుదలను సాధించింది గాని ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం కేవలం వ్యవసాయాభివృద్ధికే కాదు, పరిశ్రమకు కూడ కీలకాంశమే. ఈ ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని నొక్కి చెప్పడం ఏ స్థాయికి పెరిగిపోయిందంటే, జెర్సీ ఆవు, శీతలీకరణ కేంద్రం లేకుండా పాల ఉత్పత్తిని ఊహించలేని, రసాయనిక ఎరువులు లేకుండా కోళ్ల పెంపకాన్ని ఊహించలేని, రిగ్ లేకుండా బావిని ఊహించలేని స్థితికి చేరాం. భారత పెట్టుబడిదారీ వర్గానికైతే ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం లేకుండా లాభం ఉంటుందనే ఊహే లేదు. నూతన సాంకేతిక పరిజ్ఞానానికి భారతదేశంలోనైనా, అది పుట్టిన చోట్లనైనా, ఒకే ఉత్పాదకాలతో ఎక్కువ ఉత్పత్తి చేసే శక్తి ఉన్నదనే మాట కాదనకుండానే, పెట్టుబడిదారీ సంచయన క్రమంలో ఆధునిక సాంకేతిక పరిజ్ఞానానికి కీలక పాత్ర ఉన్నదా అని ఆలోచించవలసి ఉంది. పెట్టుబడిదారీ సంచయనానికి ఇతర కారకాలు చాల ఉన్నాయి, బహుశా ఎక్కువ ముఖ్యమైనవి కూడ ఉన్నాయి. మార్క్సిస్టేతర మేధావులు కూడ ఈ విషయం అంగీకరిస్తారు. అలా ఆలోచించినప్పుడు, అటువంటి కారకాలలో ఎక్కువ ఉద్యోగ కల్పన, ఎక్కువ పనిగంటలు, కార్మికుల విద్యాస్థాయి పెరుగుదలతో పాటు ఒక స్థాయి సాంకేతిక పరిజ్ఞాన పునాదిపై మూలధన పెట్టుబడి పెరుగుదల వంటి ఎన్నో కారకాలు ఉంటాయి.

ఉదాహరణకు డెనిసన్ అంచనాల[11] ప్రకారం, అమెరికాలో 1929-57 మధ్య కాలంలో అప్పటి సాంకేతిక పరిజ్ఞాన స్థాయిలోనే వృద్ధికి శ్రామికులు, పెట్టుబడి చేసిన దోహదం 42 శాతం అని తేలింది. మరొక స్థాయిలో సోలో అంచనాల ప్రకారం 1909 నుంచి 1949 మధ్యకాలంలో సాంకేతిక పరిజ్ఞానం పెరుగుదల మొదటి సగంలో ఒక్క శాతం గానూ, రెండో సగంలో రెండు శాతం గానూ మాత్రమే ఉందని తేలింది. సోలో సంచయన క్రమాలను ఒక క్రమబద్ధమైన వరుసలో కూడ పెట్టారు. దాని ప్రకారం సాంకేతిక పరిజ్ఞానంలో మార్పులు సామాజిక ఉత్పత్తి పరిస్థితుల తర్వాతనే ఉన్నాయి. ఈ వరుస అప్పటికి కొనసాగుతున్న సాంకేతిక పరిజ్ఞానంలోపల దానికదిగా వైరుధ్యం తలెత్తేవరకూ యథాతథంగా ఉంది. చారిత్రకంగా చూస్తే, బ్రిటన్ విషయంలో మార్క్స్ చూపినట్టుగా, ఆ వరుసక్రమంలో మొదట సహకారరంగంలో తయారీ ఉంది. అప్పటికి సాంకేతిక పరిజ్ఞానంలో పెద్ద మార్పేమీ ఉండదు. ఆ తర్వాత యంత్రాలు వస్తాయి. ఆ సమయంలోనే సాంకేతిక విధానంలో ప్రధాన విప్లవం కనబడుతుంది. ఈ విప్లవం కూడ శ్రమకూ పెట్టుబడికీ మధ్య తీవ్రమైన వైరుధ్యం ఫలితంగానే జరుగుతుంది.

అంటే, సంచయన క్రమానికి సాంకేతిక పరిజ్ఞానంతో పాటుగా, ఇతర కారకాలు కూడ సమానంగా ముఖ్యమైనవే. సాంకేతిక పరిజ్ఞానంలో మార్పు చాల ఎక్కువగా సంచయన క్రమపు ఫలితమే. అయితే సాంకేతిక పరిజ్ఞానం శ్రమ శక్తి విలువను తగ్గించడం ద్వారా సంచయన క్రమం తీవ్రతరం కావడానికి సహకరిస్తుంది. దీన్ని మరోమాటల్లో చెప్పాలంటే పెట్టుబడిదారీ సంచయనం అనేది సాంకేతిక పరిజ్ఞానంలో మార్పుల నుంచి స్వతంత్రంగానే ఉంటుంది. ఒకవేళ పాత సాంకేతిక పరిజ్ఞానం దాని సామాజిక పరిమితులను చేరినట్టయితే సాంకేతిక పరిజ్ఞానంలో మార్పు సంచయన క్రమానికి సహకరిస్తుంది. కాగా, ఇంతవరకూ ఉత్పత్తి విధానం గురించి నడిచిన చర్చ స్థానిక, దేశీయ సాంకేతిక పరిజ్ఞానం మీద తగిన వెలుగును ప్రసరించనేలేదు. స్థానిక సాంకేతిక పరిజ్ఞానం సామాజిక పరిమితిని దాటిందనీ ఆ తర్వాతనే విదేశీ సాంకేతిక పరిజ్ఞానాన్ని దిగుమతి చేసుకోవలసిన అవసరం వచ్చిందనీ వాదించలేదు. వనరుల అసంపూర్ణ వినియోగం ఏ స్థాయిలో ఉండిందో చూపలేదు. సామ్రాజ్యవాద పాత్ర గురించి మాట్లాడలేదు. సామ్రాజ్యవాద ప్రస్తావనే లేకుండా భారతీయ పెట్టుబడిదారీ విధానం గురించి చర్చించింది.

ఆసక్తికరమైన విషయమేమంటే, భౌతిక వనరుల అసంపూర్ణ వినియోగం గురించి విస్మరించడంతో పాటుగానే, శ్రామికుల నిరుద్యోగ సమస్యకు కూడ ఈ చర్చలో చోటు దొరకనే లేదు. నిరుద్యోగం ఒక విశ్లేషణా సాధనం అవుతుందని గుర్తింపే లేదు. నిరుద్యోగ శ్రామిక శక్తి అదనపు విలువను సృష్టించగల శక్తిగా గుర్తింపు పొందనే లేదు. ఈ గుర్తింపు లేకపోవడం అటు భారత పెట్టుబడిదారులకూ, ఇటు ఈ చర్చలో పాల్గొన్నవారికీ సమాన లక్షణమే. కాని మార్క్సీయ విశ్లేషణలో, విలువను, అదనపు విలువను సృష్టించే ఏకైక వనరు శ్రమ మాత్రమే అనేది మౌలికాంశం.

మిగులు శ్రమ నిరుద్యోగంలో ఉండిపోవడానికి కారణం ఆ శ్రమను ఉపయోగించుకునే సామర్థ్యం పెట్టుబడికి లేకపోవడమేననే వివరణ చాలసార్లు వచ్చింది. నీటిపారుదల సౌకర్యాల లేమి వల్లనే శ్రమ శక్తిని తక్కువ స్థాయిలో వినియోగించడం జరుగుతోందని కూడ అన్నారు. ఈ అభిప్రాయం అసలు నీటి సౌకర్యాల లేమి ఎందుకు ఉన్నదో వివరించదు. అంతేకాదు, నీటిపారుదల సౌకర్యాల కల్పనను బాహ్య శక్తుల ఫలితంగా చూస్తుంది. అది వ్యవస్థలో అంతర్గతంగా జరగవలసిందేనని గుర్తించదు. మరోవైపు నుంచి, అంటే నీటి పారుదల సౌకర్యాలను అంతర్గత కారకంగా చూస్తే, పెట్టుబడి అనేది ఎక్కడినుంచో అందే వస్తువుగా కాక, లోపలనే అభివృద్ధి అయ్యే సంబంధంగా అర్థమవుతుంది. పెట్టుబడిని సంబంధంగా చూడడం అంటే అర్థం గతకాలపు శ్రమకూ, వర్తమాన శ్రమకూ మధ్య సంబంధంగా చూడడమే. వర్తమాన శ్రమ నిరుద్యోగంలో ఉన్నదంటే గతకాలపు శ్రమ తగిన పరిస్థితులను సృష్టించలేదనే అర్థం. "కొత్త శ్రమ ఉత్పత్తికి తగిన పరిస్థితులను కల్పించే సరుకుల నిలువనే పెట్టుబడి అంటాం...ఆ సరుకులు పెట్టుబడి లక్షణాన్ని కలిగిలేకపోతే, అంటే పాత శ్రమ ఉత్పత్తి, శ్రమ పరిస్థితులు కొత్త శ్రమను సంలీనం చేసుకోజాలనట్టయితే, శ్రమకు అవసరమూ సాధనమూ అయిన ఈ సరుకుల నిలువ కొత్త ఉత్పత్తికి భౌతిక పరిస్థితులను కల్పించజాలదు" అని మార్క్స్ అన్నాడు. శ్రామికులను విస్తృత స్థాయిలోఇముడ్చుకోవడం జరగడం లేదంటే శ్రమ నుంచి వెలువడుతున్న మిగులు ఉత్పత్తి, తదనంతర దశలో ఉత్పత్తికి తగిన భౌతిక పరిస్థితిగా మారడం లేదన్న మాట. అంటే అది పెట్టుబడిగా పనిచేయడం లేదన్నమాట.

ఇటువంటి పరిస్థితి, గత కాలపు శ్రమకు చెందిన అదనపు ఉత్పత్తి విస్తృత పునరుత్పత్తికి తగిన పరిస్థితిని కల్పించలేకపోవడం, రెండు రకాల కారణాల వల్ల తలెత్తవచ్చు. ఒకటి, తక్కువ స్థాయి మిగులు నుంచి అనుత్పాదక వినియోగం దాకా ఉండే కారణాలు. రెండు, మిగులు ఉత్పత్తి సరుకుల రూపంలో లభ్యం కాకపోవడం అనే కారణం. ఈ కారణాలన్నీ సమష్టిగానూ విడివిడిగానూ కూడ పెట్టుబడిదారీ విధానపు స్వభావాన్నీ లక్షణాన్నీ ప్రశ్నార్థకం చేస్తాయి. ఈ పెట్టుబడిదారీ విధానంలో ఒకవైపు మిగులును ఉత్పత్తి చేయగల శ్రామికులు నిరుద్యోగులుగా ఉండి, ఉద్యోగం కావాలని కోరుతుండగా, మరోవైపు అది మిగులును ఉత్పత్తి చేయలేని స్థితిలో ఉంటుంది. లేదా, థియోడర్ షుల్జ్ వాదించినట్టుగా ఈ స్థితిలోని సాంకేతిక పరిజ్ఞానం హెచ్చు మిగులును ఉత్పత్తి చేసే సామర్థ్యం లేనిదయి ఉండాలి. కాని ఆ వాదనను అంగీకరిస్తే, మిగులు అనేది కేవలం సాంకేతిక పరిజ్ఞానానికి సంబంధించినదే అని, అంటే పెట్టుబడి ఘనాంగ నిర్మాణానికి సంబంధించినదేనని, అస్థిర పెట్టుబడి (శ్రమశక్తి) కీ, దోపిడీ రేటుకూ సంబంధించినది కాదనీ చెప్పుకోవలసి వస్తుంది. కాని ఈ రెండూ కూడ పెట్టుబడి సంచయనం గురించి మార్క్సిస్టు సిద్ధాంతంలోని మౌలిక అంశాలు. ఇలా ఆలోచిస్తే, వ్యవసాయ సంబంధాలను ఆధునిక యంత్రాల సూచి ఆధారంగా నిర్వచించడం అనేది, మొత్తం ఉత్పాదక సామర్థ్యాన్నే ఆధునిక యంత్రాలకూ ఆధునిక సాంకేతిక పరిజ్ఞానానికి ఇవ్వడంతో సమానమవుతుంది. అంటే ఉత్పాదక కారకంగా పెట్టుబడికి లేని శక్తిని తప్పుడుగా ఆపాదించడమవుతుంది.

నిరుద్యోగ శ్రామిక వనరులు ఉండడమే భారత పెట్టుబడిదారీ

విధానానికి సృజనాత్మకత లేదనడానికి ఒక సూచన. కాగా, ఆ లక్షణమే భారత పెట్టుబడిదారీ విధానం పెరుగుదలకు కూడ సమస్యలు సృష్టిస్తోంది. ఎందుకంటే ఈ నిరుద్యోగం వల్లనే, భారత పెట్టుబడిదారీ విధానం తయారు చేసే సరుకులకు తగిన మార్కెట్ ఏర్పడలేని స్థితి తలెత్తుతుంది. ఇది ఒక తలకిందుల, వక్ర స్థితికి నిదర్శనం. ఒకవంక, డిమాండ్ లేకపోవడం వల్ల వివిధ పరిశ్రమలు తమ పూర్తి సామర్థ్యంతో పనిచేస్తూ ఉండవు. మరొక వంక, అశేష ప్రజానీకం ఉద్యోగం లేకపోవడం వల్ల తగిన పోషకాహారం కూడ లేని స్థితిలో కూడ డిమాండ్ సృష్టించలేని స్థితిలో ఉంటారు.

పెట్టుబడిదారీ విధానానికి పరివర్తనలో ఒక ముఖ్యమైన అంశం ఏమంటే పెట్టుబడి శ్రమశక్తిని భూస్వామ్య బంధనాల నుంచి విముక్తి చేసి వారికి పెట్టుబడిదారీ రూపాలలో పునరుపాధి కల్పించి తద్వారా తన స్థానిక మార్కెట్ ను తానే తయారు చేసుకుంటుంది. మధ్యతరగతి రైతునూ, పేద రైతునూ తమ భూముల నుంచి నిర్వాసితులను చేయడం అనే ప్రక్రియ కేవలం భూమి ధనిక రైతుల దగ్గర పోగుపడడానికి మాత్రమే కాదు, ఉత్పత్తి ప్రక్రియలో ఎక్కువ మంది శ్రామికులను సంలీనం చేసుకోవడానికి దారి తీస్తుంది. ఈ రకమైన పునరుపాధి కల్పనే స్థానిక మార్కెట్ ను రూపొందిస్తుంది. ధనిక రైతులు ఇతోధికంగా తీవ్రంగా శ్రమశక్తిని వాడడం వ్యవసాయోత్పత్తులకు మాత్రమే కాదు, పారిశ్రామికోత్పత్తులకు కూడ డిమాండ్ ను సృష్టిస్తుంది. "వ్యవసాయ జనాభాలోని కొంత భాగాన్ని దోపిడీ చేయడం, వారి భూముల నుంచి వెళ్లగొట్టడం అనే ప్రక్రియకు అర్థం పారిశ్రామిక పెట్టుబడికి అవసరమైన శ్రామికులను, వారి జీవనోపాధి సాధనాలను, వారి శ్రమ సాధనాలను విడుదల చేయడం మాత్రమే కాదు, అది స్థానిక మార్కెట్ ను సృష్టించడం కూడ. నిజం చెప్పాలంటే, ఈ పరిణామం చిన్న రైతులను వేతన కార్మికులుగా, వారి శ్రమ సాధనాలనూ, జీవనోపాధి సాధనాలనూ పెట్టుబడిలోని భౌతిక అంశాలుగా మార్చివేసి, పెట్టుబడికి స్థానిక మార్కెట్ ను తయారు చేస్తుంది" అని మార్క్స్ అన్నాడు. కాని భారత సమాజంలో ఇలా శ్రామికులను నిర్వాసితులను చేయడం, పునస్సమ్మేళనం చేయడం అనే ప్రక్రియ జరిగినట్టు లేదు. నిర్వాసితులను చేసే ప్రక్రియ మార్క్స్ వర్ణించిన ఆదిమ సంచయనంలా ఆదిమ స్వభావాన్ని కలిగి ఉండగా, పునస్సమ్మేళన ప్రక్రియ ఆధునిక సామ్రాజ్యవాద సాంకేతిక పరిజ్ఞానంతో జరుగుతూ, శ్రామికులకు పరిమిత పాత్రను మాత్రమే ఇస్తోంది. ఆ పాత్ర అత్యాధునికమైనదిగా కూడ కనబడవచ్చు. కాని ఈ పరిణామంవల్ల ఒక విచిత్ర స్థితి తలెత్తుతుంది. ఆహార అవసరమూ ఆహార లభ్యతా పక్కపక్కనే కొనసాగుతుంటాయి గాని ఒకదానికి ఒకటి కలవని స్థితి సాగుతుంటుంది.

దేశంలో పేదరిక అంచనాలు చాల ఉన్నాయి. ఇవి పోషకాహార లోపం ఏ స్థాయిలో ఉందో, సమాజం అనుమతించే మానవజాతి జీవశాస్త్రపరంగా పునరుత్పత్తి చెందడం ఏ స్థాయిలో ఉన్నాయో చూపుతున్నాయి. మరొకపక్క, ఆ అంచనాలే భారత పెట్టుబడికి ఎంత డిమాండ్ అవకాశం ఉన్నదో, అది ఎంతగా వ్యర్థమయిపోతున్నదో కూడ మనకు చెపుతున్నాయి. ఒక ఉదాహరణగా 1971-72లో గ్రామీణ ఒరిస్సాలో అట్టడుగున ఉన్న నాలుగు బృందాల వినియోగం గురించి జాతీయ నమూనా సర్వేలో తేలిన విషయాలు చూడవచ్చు. ఈ నాలుగు బృందాలు గ్రామీణ జనాభాలో 45.2 శాతంగా ఉన్నాయి. వారి తలసరి తృణధాన్యాల, ప్రత్యామ్నాయాల వినియోగం నెలకు 10 కిలోలుగా ఉంది. వారి మొత్తం నెలసరి వినియోగ వస్తువుల ఖర్చులో ఇది నాలుగింట మూడు వంతులు ఆక్రమించింది. వారు వినియోగిస్తున్న వస్తు సముదాయంలో ఒక్కొక్కరికి నెలకు 50 మి.లీ. కన్న తక్కువ పాలు, 40 గ్రాముల కన్న తక్కువ కొబ్బరి నూనె, 40 గ్రాముల కన్న తక్కువ వేరుశనగనూనె, 50 గ్రాముల మాంసం, 300 గ్రాముల చేపలు, 50 గ్రాముల చక్కెర, 15 గ్రాముల టీ పొడి, 130 గ్రాముల కిరొసిన్, సగం అగ్గిపెట్టె ఉన్నాయి. ఈ వస్తువుల జాబితా చూస్తే పారిశ్రామిక, వ్యవసాయ ఉత్పత్తులకు ఎంత డిమాండ్ అవకాశం ఉందో, కాని కొనుగోలు శక్తి లేనందువల్ల ఆ డిమాండ్ ఎట్లా వాస్తవరూపం ధరించడం లేదో తెలుస్తుంది. కొనుగోలు శక్తి లేకపోవడానికి కారణం ఆదాయం ఇచ్చే ఉద్యోగ, ఉపాధి అవకాశాలు లేకపోవమే.

మరొకవైపు నుంచి ఎ ఎన్ బోస్ ఒక ఆసక్తికరమైన కసరత్తు చేశారు. "వెయ్యి మంది జనాభా, 360 ఎకరాల నికర సాగుభూమి, 500 పశువులు, 750 ఇతర పశుపక్ష్యాదులు ఉన్న ఒక సగటు పశ్చిమ బెంగాల్ గ్రామంలో" తగిన సాంకేతిక పరిజ్ఞానం, ఉత్పత్తుల మిశ్రమం వాడితే ఆదాయం ఎంతగా పెరిగే అవకాశం ఉందో ఆయన లెక్క వేశారు. ఆయన చెప్పిన సాంకేతిక పరిజ్ఞానంలో ఇతోధికంగా సేంద్రియ ఎరువుల వాడకం, ఉపరితల నీటివాడకం, చేనేత వస్త్రాలు, గ్రామీణ గానుగను వాడి నూనె తీయడం మొదలైనవి ఉన్నాయి. "పంట సాగులో 168 శాతం తీవ్రతతో, రు. 9 లక్షల నికర వ్యవసాయ రాబడిని, రు. 2 లక్షల నికర పారిశ్రామిక రాబడిని సాధించవచ్చు. అంటే మొత్తం గ్రామపు నికర ఆదాయం రు. 11 లక్షలు ఉంటుంది. భౌతిక వస్తు ఉత్పత్తి ప్రాతిపదిక మీద మాత్రమే, గ్రామస్తులందరికీ అవసరమైన కనీస భౌతిక వస్తువులను అందించడం, సాలీనా రు. 1000 తలసరి ఆదాయాన్ని ఇవ్వడం సాధ్యమవుతుంది. ఇప్పుడది రు. 500 కన్న తక్కువగా ఉంది" అని ఆయన తేల్చారు. ఈ అంచనాతో నిర్ధారణ అయ్యేది వనరులు ఎన్ని ఉన్నాయో, దారిద్ర్యం ఎంత ఉందో అని కాదు, ప్రస్తుత సాంకేతిక పరిజ్ఞానం కింద వనరులు, దారిద్ర్యం సమాంతరంగా ఎలా సాగుతున్నాయని మాత్రమే. "అటువంటి గ్రామీణ పారిశ్రామికీకరణ జరగడానికి ముఖ్యమైన మొట్టమొదటి షరతు, మన దేశం మీద మొత్తంగానూ, మన దేశపు పారిశ్రామిక జీవనం మీద ప్రత్యేకంగానూ సాగుతున్న పట్టణ సంపన్న వ్యాపార ముఠాకు ఉన్న నిర్ణయాత్మక ప్రభావాన్ని రద్దు చేయడం" అని బోస్ అన్నారు.

మార్కెట్ అంటూ లేకపోతే సాంకేతిక పరిజ్ఞానం, అది ఆధునికమైనదైనా, కాకపోయినా, పెట్టుబడికి సంబంధించిన పెట్టుబడిదారీ సంచయనానికి ఎందుకూ పనికిరాదు. అలా ఒక స్థానిక, దేశీయ మార్కెట్ ను వాడుకునే వీలు లేనందువల్ల భారత పరిశ్రమ విదేశీ మార్కెట్ల వెతుకులాటలో ఉంది. ఇప్పటిదాకా ఉత్పత్తి విధానం మీద సాగిన చర్చ దురదృష్టవశాత్తూ ఈ మార్కెట్ సమస్యను గమనంలోకి తీసుకోనే లేదు[12]. కాని మార్కెట్ అనేది పెట్టుబడి సంచయనపు లక్ష్యాన్ని సాధించడానికి చాల కీలకమైనది. ఆసక్తికరమైన అంశమేమంటే ఈ అంశాన్ని రాజ్యం బాగా గుర్తించింది. మార్కెట్ ను సృష్టించడానికి తగిన చర్యలెన్నో

తీసుకుంటోంది. పనికి ఆహార పథకం, పాడి పరిశ్రమ, పందుల పెంపకం వగైరా ఆహారం కోసం పని పథకాలు, చివరికి ఉపాధి హామీ పథకాలు తయారు చేసింది.

ఇలా వ్యవసాయ సంబంధాలను నిర్వచించడంలో స్థానిక మార్కెట్ మీద దృష్టి పెట్టకపోవడంతో పాటు, ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం మీద మితిమీరిన దృష్టి వల్ల, వ్యవసాయ ఉత్పత్తి ప్రక్రియలోకి "ఆధునికత" ప్రవేశించని ప్రాంతాలను నిర్వచించడం ఎట్లా అనే సమస్య తలెత్తుతుంది. ఆయా ప్రాంతాలకు పరిమాణం రీత్యాగాని, రాజకీయ ప్రాధాన్యత రీత్యాగాని ఉన్న సాపేక్షిక ప్రాముఖ్యతను విస్మరిస్తూ (ఆ ప్రాంతాలు ముఖ్యమైనవి కానందువల్ల కాదు, అక్కడి గణాంక సమాచారం దొరకనందువల్ల), తార్కిక స్థాయిలో ఏం చేస్తున్నారంటే వ్యవసాయ సంబంధాల నిర్వచనాన్ని పెట్టుబడిదారీ విధానం కింద ఉండే అసమ సంబంధాలు అనే మాటకింద కొట్టేస్తున్నారు. తార్కిక సామంజస్యం కోసమైతే ఈ ప్రాంతాలను పెట్టుబడిదారీ పూర్వ అని నిర్వచించాలి. ఆధునిక పూర్వ, స్వాతంత్ర్య పూర్వ సంబంధాలను అలా నిర్వచించడమే అలవాటు. కాని అధికార మార్పిడి తర్వాత ఆ నిర్వచనాన్ని కొనసాగించడంలో ఏదో ఇబ్బంది ఉన్నట్టుంది.

ఐతే పెట్టుబడిదారీ విధానం కింద అసమ అభివృద్ధి అనేదానికీ, పెట్టుబడిదారీ విధానపు అసమ "అభివృద్ధి" అనేదానికీ మధ్య కూడ తేడా చూడవలసి ఉంది[13]. మొదటి మాటకు అర్థం మొత్తం సమాజం మీద పెట్టుబడిదారీ విధానం చలామణీ అవుతూ, విభిన్న రంగాలు, విభిన్న ప్రాంతాలు విభిన్న వృద్ధి మార్గాలలో సాగుతున్నాయని. ఈ సమస్యను పెట్టుబడిదారీ దేశాలు ఎదుర్కొంటున్నాయి. వేరువేరు ప్రాంతీయ ప్రణాళికా పద్ధతులతో ఆ సమస్యను పరిష్కరించడానికి ప్రయత్నిస్తున్నాయి. కాని పెట్టుబడిదారీ విధానపు అసమ "అభివృద్ధి" విషయానికి వస్తే, కొన్ని ప్రాంతాలేమో అభివృద్ధి సాధించి ఉండడం, మిగిలిన ప్రాంతాలు ఉన్నవి ఉన్నట్టుగా ఉండడం అనేది ఇక్కడ సమస్య. గతంలో రెండు వ్యాసాలలో[14] ఈ సమస్యను చర్చించినప్పుడు నేను చేసిన ఒక పరికల్పన ఏమంటే, ఒక ప్రాంతపు పెట్టుబడిదారీ అభివృద్ధి మూడు విషయాల మీద కీలకంగా ఆధారపడి ఉంటుంది. అవి, ఒకటి, అంతర్జాతీయ పరిశ్రమలకు అవసరమైన ముడి సరుకుల లభ్యత. రెండు, అంతర్జాతీయ పరిశ్రమలకు లభ్యమయ్యే మార్కెట్ విస్తీర్ణం. మూడు, రాజ్యాధికారాన్ని బలోపేతం చేసుకోవలసిన అవసరం. "పెట్టుబడిదారీ అభివృద్ధి"కి అవసరమైన వనరులు ఉన్నప్పటికీ, అవి "అంతర్జాతీయ సంబంధాల ఆధునిక పరిశ్రమకు" అంత ముఖ్యంగాని వనరులైతే, ఆ ప్రాంతాలు పెట్టుబడిదారీ అభివృద్ధికి బయటనే ఉండిపోతాయి. ఇనుప ఖనిజం, బాక్సైట్, మాంగనీస్, బొగ్గు వంటి వనరులు లేకపోతే మొత్తం ఆదివాసి ప్రాంతాలు "పెట్టుబడిదారీ అభివృద్ధి"కి బయటనే ఉండి పోయేవి. విశాఖపట్నం, శ్రీకాకుళం, తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలలోని తూర్పు కనుమల విశాల ప్రాంతం అందువల్లనే పెట్టుబడిదారీ ఉత్పత్తి చట్రానికి బయట ఉండిపోయింది[15]. ఇలా ప్రాంతాలవారీ అభివృద్ధి జరుగుతున్న సందర్భంలో పెట్టుబడి అసమ ప్రవేశం అనే నిర్వచనం బహుశా ఉపయోగపడవచ్చు. ఈ పెట్టుబడికి, దాని సాంకేతిక పరిజ్ఞానానికి బాహ్య స్వభావమే ఉంది గనుక, ఈ ప్రాంతాలలో పెద్ద ఎత్తున పెట్టుబడిదారీ పూర్వ ప్రయోజనాలే ఆధిపత్యంలో ఉన్నాయి గనుక ఈ నిర్వచనం సరిపోవచ్చు.

అందువల్ల, ఉత్పత్తి విధానంపై చర్చలో కొందరు రచయితలు గుర్తించినట్టుగా వ్యవసాయంలో పెట్టుబడిదారీ విధానం పెరుగుతున్నట్టయితే, పెట్టుబడిదారీ సామాజిక సంబంధాలు పెరుగుతూ ఉండవలసింది. పెట్టుబడి సమాజాన్ని పునర్నిర్మిస్తుంది. మానవ వనరులను వాడుకుని విలువలనూ అదనపు విలువలనూ విస్తృత స్థాయిలో ఉత్పత్తి చేసే సాంకేతిక పరిజ్ఞానాలనూ, మార్కెట్లనూ రూపొందించే సామాజిక సంబంధాలను ప్రవేశపెడుతుంది. పెట్టుబడిని విశ్లేషించేటప్పుడు, అదనపు విలువ సృష్టికర్తగా శ్రామికుల ప్రాధాన్యతను విస్మరించడానికి వీలులేదు. పెట్టుబడిదారీ విధానంలోకి ఆలస్యంగా వచ్చిన జపాన్ కూడ తన పెట్టుబడిదారీ విధానాన్ని అభివృద్ధి చేయడంలో ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని అరువు తెచ్చుకుని, ఆ సాంకేతిక పరిజ్ఞానం స్థాయిని తగ్గించి, ఎక్కడ వీలయితే అక్కడ శ్రామికులను ప్రవేశ పెట్టింది. ఈ అంశాన్ని తర్వాతి భాగంలో చర్చిద్దాం. కాని భారత పెట్టుబడిదారీ విధానం ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని మొత్తానికి మొత్తంగా స్వీకరించి, పెట్టుబడిదారీ విధానంలోని శ్రమ, మార్కెట్ అనే అంశాలను దాటవేస్తున్నట్టు కనబడుతున్నది. తత్ఫలితంగా అది జనాభాలో గణనీయమైన భాగాన్ని బయటికి నెట్టివేస్తున్నది. ఆ భాగాన్ని కొన్నిసార్లు "అంచులలో" ఉన్నవారనీ, కొన్నిసార్లు "అసంఘటిత" రంగంలో ఉన్నవారనీ వర్ణిస్తున్నారు. ఇప్పుడిక వారి గురించి చర్చిద్దాం.

## వ్యవసాయ కార్మికుల పరిస్థితి

భారత ఆర్థిక వ్యవస్థ గణాంకాలకు సంబంధించిన ఆసక్తికరమైన అంశాలలో ఒకటేమంటే, వ్యవసాయ కార్మిక జనాభా పరిమాణం గురించి, జీవన పరిస్థితుల గురించి, పని పరిస్థితుల గురించి పోల్చి చూడడానికి అవసరమైన అంకెలు ఎక్కడా దొరకవు. వ్యావసాయికంగా అభివృద్ధి చెందిన పంజాబ్ వంటి రాష్ట్రం గురించి కూడ అక్కడి గ్రామీణ పరివర్తన చలన సూత్రాల గురించి వెలువడిన ఒక సమీక్షాపత్రం ఏమంటుందంటే, "పంజాబ్ రాష్ట్రంలో వ్యవసాయ కార్మిక కుటుంబాల సగటు వార్షికాదాయం గురించి కాలక్రమ గణాంక సమాచారం అందుబాటులో లేదు. వేరువేరు సమయాలలో సాగిన వ్యక్తిగత సర్వేలలో అరకొర సమాచారం మాత్రమే ఉంది.'

'ఐతే, జాతీయ నమూనా సర్వే 1970-71లో గ్రామీణ భారతంలోని బలహీనవర్గాల పై ఒక సమగ్ర సర్వేను నిర్వహించింది. పక్కన పట్టికలో ఆ గణాంకాలను చూడవచ్చు. ఈ పట్టికలో వివిధ రాష్ట్రాలలో శ్రామిక కుటుంబాలలో ఉపాధి అంచనాలు, వలస వెళ్లడం గురించి అభిప్రాయాలు, రుణభారం ఇవ్వడం జరిగింది. ఇక్కడ ఉద్దేశం రాష్ట్రాల మధ్య తేడాలు చూపడం కాదు, కొనసాగుతున్న ఉత్పత్తి విధాన చర్చ నేపథ్యంలో వ్యవసాయ కార్మికుల సమస్యకు ఉన్న స్థూల కోణాలను అధ్యయనం చేయడం.

మన దేశం వంటి దేశంలో నిరుద్యోగం ఉనికికీ, అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలో పారిశ్రామిక రిజర్వ్ సైన్యంగానో, సాపేక్షిక అధిక జనాభాగానో పిలవబడే నిరుద్యోగ సమస్యకూ తేడా చూడాలి. పెట్టుబడిదారీ విధానపు ఆధునిక పరిశ్రమ దశలో మదుపు తేడాల

వల్ల, ఒడిదుడుకుల వల్ల ఏర్పడే వలయాల క్రమం నిరుద్యోగం మీద కూడ వలయాలుగా ప్రభావం చూపుతుంది. ఎక్కువ మదుపు ఉన్న కాలాలు ఎక్కువ ఉద్యోగ కల్పనకూ, సంక్షోభ కాలాలు నిరుద్యోగానికీ దారితీస్తాయి. కాని మన సమాజంలో ఆ వలయాలు ప్రధానంగా వాతావరణం మీద ఆధారపడినవి. ఇది వ్యవసాయ రంగానికి మాత్రమే కాదు, పారిశ్రామిక రంగానికీ వర్తిస్తుంది. మంచి వర్షాకాలం ఉంటే ఎక్కువ ఉద్యోగ కల్పన జరుగుతుంది. వర్షాభావ పరిస్థితులలో నిరుద్యోగం ప్రబలుతుంది. అంటే మన దగ్గర నిరుద్యోగం అనేది పెట్టుబడి సంచయనం లేకపోవడానికి సూచికగా ఉంటుంది గాని సంచయన రేటులో ఒకానొక సమయంలో తలెత్తే తేడాలకు కాదు. ఈ తేడాలకు ప్రభుత్వాల స్పందన వేరువేరు చోట్ల వేరువేరు రకాలుగా ఉండవచ్చు. పెట్టుబడిదారీ దేశాలు నిరుద్యోగ బీమా సౌకర్యాలనూ, నామమాత్రపు వేతనాల కల్పననూ ఎంచుకుంటాయి. కాని మన దేశం వంటి దేశాలలో ప్రభుత్వాలు కరవు, దుర్భిక్ష సమయాలలో సాగు పనులనూ, బండలు కొట్టే పనులనూ కల్పిస్తాయి. ఈ తేడాను గుర్తించినందువల్లనే "వ్యవసాయ అల్పోద్యోగం, వ్యవసాయ కార్మికుల జీవన ప్రమాణాలు అల్పాభివృద్ధికి ముఖ్యమైన వ్యక్తీకరణలు. కనుక అభివృద్ధి పథకాలను అంచనా కట్టేటప్పుడు అవి ఈ పరిణామాల మీద ఎటువంటి ప్రభావాన్ని చూపుతున్నాయనే ప్రాతిపదిక మీదనే అంతిమంగా నిర్ధారించవలసి ఉంటుంది" అని గాడ్గిల్ అన్నారు.

వ్యవసాయ శ్రామికులకు సంపూర్ణ ఉద్యోగావకాశాలు లేకపోవడమనే వాస్తవం ఎంతగా గుర్తింపుకు వచ్చిందంటే అది సర్వవిదితం. అయితే థియొడర్ షుల్ ట్జ్ వంటి నోబెల్ బహుమతి గ్రహీతలకు మాత్రం అది కనబడదనుకోండి. అక్కడక్కడా ఉన్న అటువంటి ఉద్దేశపూర్వక గుడ్డితనాన్ని, నిరుద్యోగానికి సంబంధించిన నిర్వచన సమస్యలను పక్కనపెట్టి, సూటిగా చెప్పగలిగినదేమంటే, భారత గ్రామీణ ప్రాంతాలలో నిరుద్యోగం కొనసాగుతూనే ఉన్నది. బహుశా ఇలా మిగులు శ్రామికులు ఉన్నారనే గుర్తింపు వల్లనే మొదటి పంచవర్ష ప్రణాళికా కాలం నాటినుంచీ కూడ "సామాజిక అభివృద్ధి" కార్యక్రమాలు తయారవుతున్నాయి. ప్రభుత్వ సంస్థలనుంచి 86.71 లక్షల డాలర్ల నిధులతో, భారత ప్రభుత్వం నుంచి రు. 343.8 కోట్ల నిధులతో తయారయిన రహదారుల నిర్మాణం, తాగునీటి సౌకర్యాల కల్పన, పాఠశాల భవనాల నిర్మాణం, చిన్నతరహా సాగు నీటి సౌకర్యాల కల్పన, 'గ్రామీణ పరిశ్రమలు' వంటి ఈ సామాజిక అభివృద్ధి కార్యక్రమాలలో ప్రజలు తమ శ్రమ ద్వారా భాగస్వాములు కావాలని నిర్దేశించారు. ఈ పథకాలు విజయం సాధించి ఉంటే పెట్టుబడి సులభంగా ప్రయాణించడానికి వీలయ్యేది. కాని అలా జరగలేదు. ఏడవ మదింపు నివేదికలో చెప్పినట్టుగా "ఈ ప్రయత్నాలను అసమగ్రంగా సమన్వయించడం జరిగిందనీ, ఇవి స్వభావంలో ప్రభుత్వ పథకాలుగానే తప్ప ప్రజా పథకాలుగా మారలేదనీ, ఇవి ఆశల వల్ల కొనసాగాయి గాని విజయాల వల్ల కొనసాగలేదనీ అనిపిస్తుంది". ఈ పథకాలు మిగులు శ్రమను సంలీనం చేసుకోలేకపోవడం సహజమైన అంశమే. ఎందుకంటే, ఈ మిగులు శ్రమ అనేది శ్రామికుల దగ్గరనుంచి ఉచితంగా సంపాదించగల మిగులు కాదు. ఇది వ్యవస్థకు మిగులు. తగిన వేతనం చెల్లించకుండా వ్యవస్థ ఈ మిగులును వాడుకోజాలదు.

"వ్యవసాయ శ్రామిక జనాభా సాపేక్షిక అధిక జనాభాకు కనబడని రూపం. పరిశ్రమ గనుక అర్ధనైపుణ్య, అనైపుణ్య వృత్తులలో ఈ జనాభాకు తగిన అవకాశం కల్పించకపోతే అది పారిశ్రామిక రిజర్వ్ సైన్యంలో భాగంగానే ఉంటుంది.... అందువల్ల, వ్యావసాయిక జనాభాలో కొంత భాగం ఎల్లప్పుడూ పట్టణ, పారిశ్రామిక కార్మికవర్గంగా మారిపోవడానికి సిద్ధంగా ఉంటుంది. అటువంటి పరివర్తనకు తగిన పరిస్థితులు ఎప్పుడు వస్తాయా అని చూస్తూ ఉంటుంది. ఈ సాపేక్షిక మిగులు జనాభా వనరు ఎప్పుడూ ఊటలూరుతూనే ఉంటుంది. కాని ఇలా పట్టణం వైపు నిరంతర ప్రవాహం అంటే గ్రామసీమలలో మిగులు జనాభా కనబడకుండా ఉన్నదనే అర్థం. ఈ మిగులు ఎంత ఎక్కువగా ఉన్నదో పూర్తిగా తెలియాలంటే అది ప్రవహించే మార్గాలు అసాధారణమైన పరిమాణంలో తెరుచుకుని ఉండాలి" అన్నాడు మార్క్స్.

(మిగతా వచ్చే సంచికలో)

**పాదసూచికలు :**

*9. తగిన షరతు (సఫిషియెంట్ కండిషన్), అవసరమైన షరతు (నెసెసరీ కండిషన్) - ఈ మాటలు తర్క శాస్త్ర పరిభాషకు సంబంధించినవి. ఒక పరిణామం జరగడానికి తగిన పరిస్థితి 'తగిన షరతు' సూచిస్తుంది. ఏ పరిస్థితి లేకపోతే ఆ పరిణామం జరగదో ఆ పరిస్థితిని 'అవసరమైన షరతు' సూచిస్తుంది.*

*10. ఆలిస్ థార్నర్ - సెమి ఫ్యూడలిజం ఆర్ కాపిటలిజం? ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ, సం. 17, సం. 51, పే. 2063*

*11. వీటిని థియొడర్ షుల్ట్జ్ తన 'ట్రాన్స్‌ఫార్మేషన్ ఆఫ్ ట్రెడిషనల్ అగ్రికల్చర్' లో ఉటంకించారు.*

*12. మార్కెట్ సమస్యను గుర్తించిన రచయితలు కూడ దాన్ని విభిన్న రంగాల మధ్య అంతర్ ప్రవాహానికి సంబంధించిన సమస్యగానో, వ్యవసాయ రంగ వ్యాపారీకరణ సమస్యగానో చూశారు. ఉదాహరణకు, గెయిల్ ఆమ్ వెడ్ట్ వ్యాపారీకరణ గురించి ఇంద్రదీప్ సిన్హా చేసిన అధ్యయాన్ని ఉటంకించారు. వ్యాపారీకరణ పెరుగుతున్న మాట నిజమే. విభిన్న రంగాల మధ్య అంతర్ ప్రవాహం పెరుగుతున్న మాట నిజమే. కాని భారత గ్రామీణ దృశ్యంలో ఆసక్తికరమైన అంశమేమంటే, ద్రవ్యేతర లావాదేవీలు కూడా పెరుగుతూనే ఉన్నాయి. గ్రేస్ మజుందార్, డి.ఎన్. చతుర్వేది వేసిన అంచనాల ప్రకారం, 1966-73 మధ్యకాలంలో భారత ఆర్థిక వ్యవస్థలో ద్రవ్యరూప లావాదేవీలు 177 శాతం పెరగగా, ద్రవ్యేతర లావాదేవీలు, మార్కెట్‌లోకి ప్రవేశించిన లావాదేవీలు 100 శాతం పెరిగాయి. అంటే భారత ఆర్థిక వ్యవస్థలో సరుకుల ఆర్థిక వ్యవస్థ ఏ స్థాయిలో పెరుగుతున్నదో, ఆ స్థాయిలో కాకపోయినా, సహజ ఆర్థిక వ్యవస్థ భాగం కూడా పెరుగుతూనే ఉన్నదన్నమాట.*

*13. పెట్టుబడిదారీ విధాన అసమాభివృద్ధికీ, పెట్టుబడి అసమ ప్రవేశానికీ మధ్య తేడాను సంజయ బారు 'డెవలప్‌మెంట్ ఆఫ్ కాపిటలిజం ఇన్ అగ్రికల్చర్ అండ్ గ్రోత్ ఆఫ్ మాన్యుఫాక్చరింగ్: సమ్ ఇష్యూస్ విత్ రెఫరెన్స్ టు ఆంధ్రప్రదేశ్' అనే పత్రంలో చర్చించారు. 'టువార్డ్స్ ఎ కరెక్ట్ అండర్‌స్టాండింగ్ ఆఫ్ లెనిన్స్ థియరీ ఆఫ్ ఇంపీరియలిజం' అనే వ్యాసంలో ఎ.కె. బాగ్చి కూడ అభివృద్ధి చెందిన దేశాలలో అసమ అభివృద్ధికీ, భారతదేశంలో అసమ అభివృద్ధికీ గుణాత్మకమైన తేడా ఉందన్నారు.*

*14. జి.బి.నాథ్‌తో కలిసి 1981లో రాసిన 'ఎ నోట్ ఆన్ మెటీరియలిస్ట్ ఇంటర్ ప్రిటేషన్ ఆఫ్ హిస్టరీ ఆఫ్ సుందర్‌గఢ్ డిస్ట్రిక్ట్' (అముద్రితం) వ్యాసం, 1982లో సొంతంగా రాసిన 'ఏ మిస్సెలేనియస్ నోట్ ఆన్ ట్రాన్సిషన్ ఇన్ ట్రైబల్ సిస్టమ్స్' అనే వ్యాసం (టువార్డ్స్ అండర స్టాండింగ్ సెమీ ఫ్యూడల్ సెమీ కలోనియల్ సొసైటీలో ప్రచురితం).*

*15. 1984లో రాసిన ఈ పత్రంలో ఆర్.ఎస్. రావు ఇలా రాశారు గాని, ఆతర్వాత ఈ ప్రాంతంలో కూడా బాక్సైట్ నిక్షేపాలు ఉన్నాయని బయటపడింది.* వీ

అమెరికా తన ఆధిపత్యం కోసం చేసిన విధానాల ఫలితంగానే నేడు పతన దిశగా ప్రయాణిస్తోందని, సెప్టెంబర్ 11, 2001 ఘటనకు పదేళ్ల సందర్భంగా నేటి అమెరికా పరిస్థితిని వివరిస్తున్నారు **పి. ప్రసాద్**

# పతనానికే అమెరికా యుద్ధం

వర్తమాన ప్రపంచ పొలిటికల్ క్యాలెండర్‌లో 2001 సెప్టెంబర్ 9కి చాలా ప్రాధాన్యత ఉంది. దీనిని సంక్షిప్తంగా 9/11గా పిలుస్తున్నారు. ప్రపంచ ప్రజలందరూ ఎరిగిన జనవరి 1, ఫిబ్రవరి 8, మేడే, డిసెంబర్ 25 వంటి సుప్రసిద్ధ దినాల పక్కన క్యాలెండర్‌లో 9/11 చేరింది. ముఖ్యంగా ఆ తేదీ వస్తున్నదంటే అమెరికా సామ్రాజ్యవాదులకి భయం ఆవరిస్తుంది. అలాంటి '9/11' పరిణామానికి నేడు పదేండ్ల పుట్టినరోజు జరగబోతున్నది. వర్తమాన ప్రపంచ రాజకీయ చరిత్రను ఓ మలుపు తిప్పిన ఆ సంఘటన ఫలితాలనూ, పర్యవసానాలనూ అవలోకించాల్సిన సందర్భం ఇది.

యూరప్‌లో తలెత్తిన పునర్వికాసోద్యమం (రినైజాన్స్) ఆధునిక ప్రపంచ చరిత్రారంభానికి కారణమైతే, అమెరికా ఖండాన్ని ఆవిష్కరించడం దాని పురోగమనానికి ఓ మైలురాయిగా నిలిచింది. మూలవాసులైన లక్షలాది మంది రెడ్ ఇండియన్ అస్థిపంజరాల పునాదుల మీద, కోట్లాది ఆఫ్రికన్ బానిసల రక్త మాంసాల ఇటుకలతో యూరప్ వలసవాదులు పేర్చి నిర్మించిందే వర్తమాన అమెరికా మహా సామ్రాజ్యం. అలాంటి అమెరికా సామ్రాజ్యవాద చరిత్రలో మహా విషాద దినంగా 9/11 నిలుస్తుంది.

1776లో స్వాతంత్ర్యం పొందడంతో అమెరికా తన మొదటి దశను దాటి రెండవ దశలోకి కాలుపెట్టింది. 1820వ దశకంలో లాటిన్ అమెరికాలో బొలీవర్ విప్లవం విజయవంతమైంది. ఆ తర్వాత మన్రో సిద్ధాంతం ద్వారా యూరప్‌తో లాటిన్ అమెరికాకి గల వలసవాద సంబంధాన్ని అమెరికా తెంచివేసింది. ఫలితంగా నాటి నుంచి అది అమెరికాకి పెరటి దొడ్డిగా మారింది. దీంతో అమెరికా చరిత్ర మూడవ దశలోకి ప్రవేశించింది. 1898 నాటి అమెరికా – స్పానిష్ యుద్ధంలో అమెరికా గెలిచింది. ఫలితంగా అమెరికా రాజకీయ వాణిజ్య ప్రాబల్యాలు మొదటిసారి అట్లాంటిక్ పరిధులను దాటాయి. దీంతో ఆధునిక అమెరికా చరిత్ర నాల్గవ దశలో ప్రవేశించింది. మొదటి ప్రపంచ యుద్ధంలో అమెరికా ప్రత్యక్షంగా పాల్గొనలేదు. యుద్ధ నష్టాలకు గురికాలేదు. కానీ యుద్ధానంతరం జరిగిన వర్సైయిల్స్ సంధి ద్వారా అతిగా లాభపడింది. నాటి అగ్రరాజ్యాలైన బ్రిటన్, ఫ్రాన్స్‌ల రాజకీయ మనుగడకి ఆర్థిక ఊతకర్రగా మారింది. వెనక సీటులో కూర్చొని డ్రైవింగ్ చేయించే స్థితికి చేరింది. దీంతో అది ఐదవ దశలో అడుగుపెట్టింది. రెండవ ప్రపంచ యుద్ధంలో చివరి దశలో అది పాల్గొన్నది. అణ్వాయుధ ప్రయోగంతో పాత అగ్రరాజ్యాల స్థానాన్ని ఆక్రమించింది. దీంతో అది ఆరవ దశలో ప్రవేశించింది. సోవియట్ యూనియన్ పతనాంతరం సమ ఉజ్జీ వంటి పోటీ అగ్రరాజ్యంలేని ప్రపంచాధిపత్య స్థితిని పొందింది. దీంతో అది ఏడవ దశలో అడుగుపెట్టింది. ఆ తర్వాత 9/11తో అది మరోకొత్త దశలోకి కాలు పెట్టింది.

పైన పేర్కొన్నట్లు అమెరికా చరిత్ర వివిధ దశల గుండా పురోగమించింది. దాని చారిత్రక పురోగమన పథంలో జూలై 4 (స్వాతంత్ర్య దినోత్సవం) మొదటి పురోగమన మూల మలుపుగా చెప్పాలి. ఆ తర్వాతి ఒక్కొక్క దశను దాటించిన మూలమలుపులన్నీ దాన్ని సామ్రాజ్య పురోగమన పథంలో ముందుకు నడిపించినవే. కానీ ఆఖరి మలుపు వెనక్కి నడిపించేది. అవే 9/11 పరిణామం! ఇంకా చెప్పాలంటే అమెరికా పౌర సమాజానికి జూలై 4 (స్వాతంత్ర్య దినం) పర్వ దినమైతే, సెప్టెంబర్ 11 (9/11) విషాద దినంగా ప్రసిద్ధికెక్కింది. 5 ఆగస్ట్ 2011న తాజాగా స్టాండర్డ్ అండ్ పూర్స్ అను క్రెడిట్ రేటింగ్ కంపెనీ అమెరికాను ఆర్థికంగా డౌన్ గ్రేడ్ చేసిన విషయం తెలిసిందే. నిజానికి పదేండ్ల ముందే అమెరికా పొలిటికల్ డౌన్ గ్రేడింగ్ 9/11తోనే ప్రారంభమైనది.

అమెరికా గడ్డమీద అమెరికా సామ్రాజ్యపు ఆర్థిక, రాజకీయ, సైనిక కేంద్రాల మీద 9/11 రోజున దాడికి దిగడం అమెరికన్లకి మింగుడు పడని సమస్యే. ప్రపంచంలో ఎక్కడికైనా వెళ్లి యుద్ధం చేయగల సామర్థ్యం తమ దేశానికి ఉందని అమెరికన్లు నమ్ముతారు. ఆ విధంగా అమెరికన్లు తమను తాము స్వాతిశయంతో చెప్పుకుంటారు. హిరోషిమా, నాగసాకీల మారణహోమం తర్వాత ఈ భావన బాగా బలపడింది. అలాంటి అహం ఆరోజు (9/11) దెబ్బతిన్నది. తమకి వియత్నాం కొరియాలలోనే కాకుండా, స్వంత గడ్డ మీద కూడా భద్రత లేదన్నదీ హెచ్చరికను '9/11' సంఘటన మొదటిసారి చేసింది. వియత్నాంలో వియత్నామీయులకీ, కొరియాలో కొరియన్లకీ అభద్రతను సృష్టించిన చరిత్ర అమెరికాకి ఉంది. కానీ అమెరికాలో అమెరికన్లకి కూడా భద్రత లేదని అమెరికా చరిత్రలో మొట్టమొదట నిరూపించిందే 9/11 సంఘటన.

జంట శిఖరాలపై దాడి వల్ల జరిగిన ఆర్థిక నష్టం అమెరికా ఆర్థిక వ్యవస్థతో పోల్చితే వెంట్రుకతో సమానమే. అదే విధంగా ఆనాటి దాడిలో మరణించిన మూడు వేల మంది పౌరుల (అందులో విదేశీయులు కూడా గణనీయ సంఖ్యలో ఉన్నారు) ప్రాణ నష్టం కూడా అమెరికాకి పెద్దగా బాధ కలిగించేది కాదు. ఒక్క వియత్నాం యుద్ధంలోనే అమెరికా 58 వేల మంది సైనికులను పోగొట్టుకున్నది. అమెరికా సామ్రాజ్యవాదం దృష్టిలో వంద మంది అమెరికన్ పౌరుల కంటే ఒక అమెరికన్ సైనికుడికే ఎక్కువ ప్రాధాన్యత ఉంటుంది. తనకి అంతటి విలువైన పదుల వేల సైనికులను సైతం తన సామ్రాజ్య విస్తరణ కోసం బలి పెట్టడానికి

అమెరికా ప్రభుత్వం వెనకాడలేదు. అలాంటి అమెరికా ప్రభుత్వం దృష్టిలో జంట శిఖరాల దాడిలో సంభవించిన పౌర మరణాలు లెక్కలోనివి కాదు. అయితే అమెరికా రాజకీయ ఆధిపత్యాన్ని '9/11' సవాలు చేసింది. అమెరికాలో కూడా అమెరికన్లకి భద్రత లేదని అది చాటింది. అన్నిటి కంటే, సామ్రాజ్యవాద అహం గాయం పడింది. ఆర్థిక లాభనష్టాలను బిలియన్ లేదా ట్రిలియన్ డాలర్లతో లెక్కించవచ్చు కానీ, గాయపడ్డ ఆధిపత్య అహాన్ని కొలవడానికి కొలమానాలు లేవు. అందుకే ఆ రోజు 9/11 ద్వారా అమెరికా విలువకట్టలేనంత నష్టపోయింది.

'9/11' ద్వారా చరిత్ర చేసిన ఓ హెచ్చరికను రాజకీయ గుణపాఠంగా తీసుకోవడానికి అమెరికా నిరాకరించింది. అది తన సామ్రాజ్యవాద దాహాన్ని తీర్చుకోవడానికి కలిసొచ్చిన వరంగా భావించింది. అది ప్రతికారంతో పడగ విప్పి బుసలు కొట్టింది. క్రూరత్వంతో కోరలు చాచింది. యుద్ధోన్మాదంతో నెలరోజులు తిరక్క ముందే ఆఫ్ఘనిస్తాన్ పైన దురాక్రమణకి దిగింది. ఒంటెలు, గొర్రెలు కాచుకుంటూ జీవించే ఆదిమ సంస్కృతి గల ఓ నిరుపేద దేశం మీద ఆధునిక సైనిక బలగాలతో విరుచుక పడింది. దానికి 'ఉగ్రవాదంపై నిరంతర యుద్ధం' అని పేరు పెట్టింది. ఒక దశలో ఇక 'నాగరికతల మధ్య యుద్ధం' అని కూడా నోరు జారింది.

'ఉగ్ర'వాద, 'తీవ్ర'వాద, 'నియంతృత్వ', 'అనాగరిక', 'ఆటవిక' శక్తుల ప్రమాదం నుంచి ప్రపంచ ప్రజలనూ, ప్రజాస్వామ్యాన్నీ, నాగరికతనూ రక్షించే వకాల్తా దారునిగా తనకి తానే కితాబునిచ్చుకున్నది. తన పక్షాన లేని దేశాలన్నీ ఉగ్రవాదుల పక్షాన ఉన్నట్లేనని తీర్పు ఇచ్చింది. అది అంతటితో ఆగలేదు. అణ్వస్త్రాలున్నాయన్న కుంటి సాకులతో మరో ఏడాదిన్నర తర్వాత ఇరాక్‌ను కూడా దురాక్రమించింది. కానీ ఈ రెండు దేశాల దురాక్రమణల ద్వారా గత పదేండ్ల కాలంలో, అమెరికా సాధించిందేమిటి? 2008లో ఒక సంక్షోభాన్ని, 2011లో మరో సంక్షోభాన్ని అమెరికా అనుభవిస్తున్నది.

రెండు (జంట) వాణిజ్య శిఖరాల (న్యూయార్క్) మీద ఇస్లాం తీవ్రవాదుల దాడికి ప్రతీకారంగా అమెరికా రెండు దేశాలను దురాక్రమించింది. కానీ అవి రెండూ ఆర్థిక సంక్షోభాలను అమెరికాకే కానుకలుగా అందించాయి. 2008 నాటి గృహ నిర్మాణ సంక్షోభానికి (సబ్ - ప్రైమ్ క్రైసిస్) యుద్ధ వ్యయ భారమే ప్రధాన కారణమని నోబెల్ బహుమతి గ్రహీత జోసెఫ్ స్టిగ్లిట్జ్ ఆధారాలతో ఆనాడే నిరూపించాడు. కేవలం 60 బిలియన్ డాలర్లు వ్యయంతో ఇరాక్ దురాక్రమణ పూర్తి అవుతుందన్న అమెరికా కాంగ్రెస్ తొలి అంచనాలు తలకిందులయ్యాయి. సద్దాం ప్రభుత్వాన్ని గద్దె దించి, ఆ తర్వాత కేవలం ఆరు నెలల్లో స్థానిక తొత్తు ప్రభుత్వాన్ని సుస్థిర పరచవచ్చునుకున్నది. ఆ వెంటనే తమ సేనలను వెనక్కి తేవచ్చునన్న తొలి అంచనాలు తారుమారయ్యాయి. 2008 నాటికే ఇరాక్ యుద్ధ వ్యయం మూడు ట్రిలియన్ డాలర్ల (మూడు వేల బిలియన్ల డాలర్లు) కి చేరిందని జోసెఫ్ స్టిగ్లిట్జ్ లెక్కలు కట్టి రుజువు చేశాడు. తమ దేశంలో ఇళ్ల రుణాలు తీసుకున్న లక్షలాది మంది మధ్య తరగతి, ఉద్యోగ వర్గాలు వాటిని ఎగవేసినందునే ఆనాటి సంక్షోభం తలెత్తిందని ఆనాటి బుష్ ప్రభుత్వం వాదించింది. నిజానికి అది వాస్తవ విరుద్ధమైనది. అవి మొత్తం కలిపి కూడా ఒక ట్రిలియన్ డాలర్లు ఉండవు. అందులో కూడా పాక్షికంగా మాత్రమే చెల్లింపుల స్తంభన జరిగింది. వాటిని బూచిగా చిత్రించింది. దాని చాటున తన మూడు ట్రిలియన్ డాలర్ల యుద్ధ వ్యయ నేరాన్ని అమెరికా ప్రభుత్వం కప్పి పెట్టుకున్నది. ఇంకా చెప్పాలంటే, ప్రపంచంమీద పడి దోచుకుంటున్న తన బందిపోటు నేరాన్ని మెరుగుపరచేందుకు, తన స్వంత పౌరులను 'ఇళ్ల రుణాల ఎగవేతదార్లు'గా ప్రపంచంలో అప్రతిష్ట పాలు చేయజూసింది. ఈ విధంగా జంట శిఖరాలపై దాడికి ప్రతీకారంగా తాను ప్రకటించిన నిరంతర యుద్ధం వల్ల 2008లోనే ఒక ఆర్థిక సంక్షోభంలో అమెరికా చిక్కుకున్నది.

తాజాగా అమెరికా మరో ఆర్థిక సంక్షోభాన్ని ఎదుర్కొంటున్నది. ఈసారి దీన్ని 'రుణ పరిపతి పరిమితి' సంక్షోభంగా పిలుస్తున్నది. మూడేండ్ల క్రితం అమెరికన్ బ్యాంకులకి అమెరికన్ పౌరులు (గృహ నిర్మాణ లబ్దిదార్లు) రుణ చెల్లింపులు చేయనందున సంక్షోభం తటస్థించిందని అమెరికన్ ప్రభుత్వం బుకాయించింది. ఈసారి విదేశీ, స్వదేశీ అప్పులు నిర్ణీత పరిమితిని మించిపోయినందున అమెరికా ప్రభుత్వం చిక్కుల్లో చిక్కుకుంటున్న సంక్షోభంగా బట్టబయలైంది.

తన స్వంత ప్రజల నుంచి స్వంత బ్యాంకులకి స్వంత దేశంలో, చెల్లించాల్సిన ఒక ట్రిలియన్ కంటె తక్కువ డాలర్ల రుణాల టర్నోవరు స్తంభించింది. అంత మాత్రానికే ఆనాటి సంక్షోభానికి ఓ కుంటి సాకును బుష్ ప్రభుత్వం చెప్పగలిగింది. తద్భిన్నంగా ఈనాడు చైనా, జపాన్ వంటి విదేశాలకి అమెరికన్ ప్రభుత్వం ట్రజరీ బాండ్ల రూపంలో భారీ రుణాలు చెల్లించాల్సి ఉంది. రుణ చెల్లింపుల స్తంభన వల్ల నేటి సంక్షోభం నగ్నంగా బహిర్గతమైనది. ఆనాడు తన యుద్ధవ్యయ నేరాన్ని కప్పి పెట్టుకునేందుకు తన స్వంత పౌరులను ఎగవేతదార్లుగా బలిపశువులుగా చేసింది. కానీ ఇప్పుడు తానే పెద్ద ఎగవేతదారుగా మారనున్న పరిస్థితిని చెప్పకనే అది బయటపెట్టుకుంటున్నది.

ఇప్పుడున్న 14.3 ట్రిలియన్ డాలర్ల (14,300 బిలియన్ డాలర్లు) రుణానికి తోడుగా దశవారీగా మరో 2.4 ట్రిలియన్ (2400 బిలియన్లు) డాలర్లు కొత్త రుణాలకి అనుమతిస్తూ 2 ఆగస్ట్ 2011న అమెరికా కాంగ్రెస్ తీర్మానించింది. అయితే అదే దశల వారీగా తన బడ్జెట్ లోటును 2.1 ట్రిలియన్ (2100 బిలియన్లు) డాలర్ల మేరకి విధిగా తగ్గించుకోవాల్సి ఉంది. లోటు తగ్గింపు నిర్ణయం అమలు జరక్కపోతే, కొత్త రుణాలు పొందే నిర్ణయం కూడా అమలు జరగదు. ఈ 2100 బిలియన్ డాలర్ల లోటు తగ్గింపుకై 12 మంది సభ్యులతో అమెరికన్ పార్లమెంటరీ కమిటీ నియమించబడింది. అది ఏయే సంక్షేమ చర్యలకి, సబ్సిడీలకి కోతలు పెడుతుందో ఇంకా తెలియదు. ఏయే వర్గాల ప్రజలను అశాంతికీ, అస్థిరతకూ గురిచేస్తుందో తెలియదు. ఇప్పటికే తొమ్మిదిన్నర శాతం చేరిన నిరుద్యోగ సమస్య ఇంకా ఎలాంటి తీవ్ర రూపం తీసుకుంటుందో తెలియదు. ఓ వైపు రుణ పరపతిని పెంచుకోవాలంటే మరోవైపు విధిగా కోతలకీ, కుదింపులకీ, కత్తిరింపులకీ, రద్దులకీ దిగాల్సిందే. అలాంటి రుణగ్రస్త దేశంగా మారిన అమెరికా దురవస్థను తేలిగ్గానే అర్థం చేసుకోవచ్చును. ఈ తీవ్రతకు ప్రధాన కారణం తాను మోస్తున్న విశృంఖల యుద్ధ వ్యయ భారమే.

ప్రచ్ఛన్న యుద్ధకాలంలో అమెరికాకి ఇలాంటి రుణభారం లేదు. మొదటి గల్ఫ్ యుద్ధం, యుగోస్లావియాపై నాటో దాడుల నుంచి [illegible]కా సైనిక వ్యయం అసాధారణంగా పెరుగుతూ వచ్చింది. జంట [illegible]ఖరాలపై దాడి జరిగే నాటికి కూడా రుణభారం ఐదు ట్రిలియన్ డాలర్లు దాటలేదు. ఆనాటి అమెరికా రుణభారం జిడిపిలో అది సగం మేరకు ఉంది. ఇరాక్‌ను దురాక్రమించే నాటికి (2003) దాని రుణభారం 6.4 ట్రిలియన్ (6400 బిలియన్) డాలర్లకి పెరిగింది. అది ఆనాటి అమెరికా జి.డి.పి.లో సుమారు 60 శాతం ఉంది. సోకాల్డ్ సబ్ ప్రైమ్

ప్రజల ఇష్టాయిష్టాలతో సంబంధం లేకుండా ప్రపంచీకరణ ముంచుకొచ్చిందనీ, దానిని ఎదుర్కోవడానికి ప్రజలంతా సంఘటిత ఉద్యమాలు చేపట్టాలనీ అంటున్నారు **వి. హనుమంతరావు**

# ప్రజా ఉద్యమాల ప్రపంచీకరణ జరగాలి

ప్రపంచంలో ఛప్పన్నారు దేశాలున్నాయి. వాటి ఆర్థిక జీవనం, సమాజాలు, సంస్కృతి వేర్వేరుగా ఉన్నాయి. వాటన్నిటినీ ఏకీకృతం చేసి, సమన్వయపరిచి ఒకే గొడుగు కిందకు తీసుకొని రావడమే ప్రపంచీకరణ. వ్యాపారం, తదితర పరిణామాల ద్వారా ఈ దేశాలన్నీ పరస్పరాధారితమవుతున్నాయని అంతర్జాతీయ ద్రవ్య నిధి (ఐ.ఎం.ఎఫ్.) అభిప్రాయం. మానవ సమాజమే పెను మార్పులకు లోనయిందని కొంతమంది ఆర్థికశాస్త్రవేత్తల అభిప్రాయం. ప్రపంచీకరణే ప్రపంచ సమస్యలకు పరిష్కారమని వారి భావన. కాని అనుభవంలో మనం గమనించినదేమంటే ఆచరణలో చాలా కొద్దిమంది మాత్రమే లాభపడు తుండగా, పేద ప్రజలకు ఆశనిపాతంగా తయారైంది. ఉదాహరణకు మన దేశాన్ని తీసుకుంటే పేదరికపు రేఖ కింద ఉన్న జనాభా 26 శాతం నుంచి 40 శాతానికి పెరిగింది. ఈ పరిణామం, ఈ అసమాన పంపిణీ అనేక ఆందోళనలకు దారితీసింది. న్యాయంగా పంపిణీ జరగాలని వారు కోరుతున్నారు. కాని ప్రపంచీకరణ అసమానతలను మరింతగా పెంచింది. టొరంటో విశ్వవిద్యాలయానికి చెందిన ఆర్థిక శాస్త్రవేత్త కాలిన్ మోడెశ్స చెప్పిన దాని ప్రకారం సామ్రాజ్యవాదం నూతన అవతారమే ప్రపంచీకరణ. ఇది ప్రపంచాన్నే కబళిస్తోంది. 'ఇది రాజకీయంగా లోబరచుకోవడం కాదు. సైనిక పశుబలంతో పెట్టుబడి దారీ విధానాన్ని ప్రపంచ దేశాలపై రుద్దడమే' అని ఆయన అన్నాడు.

రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత, ప్రపంచ వ్యాప్తంగా స్వతంత్ర

సంక్షోభం నాటికి (2008) రుణభారం పది ట్రిలియన్ (1000 బిలియన్లు) డాలర్లకి పెరిగింది. అది ఆనాటి జి.డి.పి.లో 70 శాతం దాటింది. కానీ ఈ రోజు అమెరికా రుణభారం 14.3 ట్రిలియన్ (14300 బిలియన్లు) డాలర్లకి (ఆగస్ట్ 2కి ముందు సుమా!) పెరిగిపోయింది. అది దాని జి.డి.పి.లో దాదాపు సమాన స్థాయికి (98 శాతం) పెరిగింది. ఇప్పుడు అమెరికన్ కాంగ్రెస్ ఆమోదించిన అదనపు రుణం (2.4 ట్రిలియన్స్) తో కలిపి 16.7 ట్రిలియన్ (16700 బిలియన్లు) డాలర్లకి పెరగనున్నది. జంట శిఖరాలపై దాడికి ప్రతీకార యుద్ధం తలపెట్టిన తదనంతరమే అమెరికా రుణభారం ఇబ్బడి ముబ్బడిగా పెరగడం గమనార్హం.

ప్రపంచ సహజ సంపదల లూటీ కోసం యుద్ధ ట్యాంకులతో దండయాత్రలు చేయడంలో అమెరికా ముందు పీఠిన ఉంది. అలాంటి అమెరికాయే నేడు చిప్ప పట్టుకొని దేశ దేశాల దగ్గర అప్పులు అడుక్కుంటున్నది. అప్పుల్లో కూడా ప్రపంచంలో అమెరికాదే ప్రథమ స్థానంగా ఉండడం గమనార్హం. చైనాకి 2100 బిలియన్ డాలర్లతో పాటు విదేశాలకే ఐదు ట్రిలియన్ (5000 బిలియన్లు) డాలర్లకి పైగా అప్పులు చెల్లించాల్సి ఉంది. మొన్న ఆగస్ట్ 2న రుణ పరపతిని పెంచకపోతే ఆగస్ట్ నెలకి సైనికుల జీతాలు, కొన్ని అత్యవసర చెల్లింపులే సమస్యగా మారి ఉండేవి. ఆగస్ట్ 2న కుదిరిన కాంగ్రెస్ అగ్రిమెంట్ ప్రకారం తక్షణం అనుమతి లభించిన 400 బిలియన్ డాలర్ల రుణాన్ని తక్షణం ముంచుకొచ్చిన బకాయిల చెల్లింపుకే కేటాయించిందంటే, పరిస్థితిని అర్థం చేసుకోవచ్చు. పి.వి. నర్సింహారావు గద్దె ఎక్కిన కాలం (1991)లో భారత దేశం ఎదుర్కొన్న ఆర్థిక చెల్లింపుల దుస్థితిని నేడు అమెరికా ఎదుర్కొంటున్నది. ఒక ఇథియోపియా, ఒక సోమాలియా, ఒక రువాండా, ఒక బురుండిల సంక్షోభ స్థితుల గురించి సహజంగా చర్చించుకుంటున్నాం. కానీ లోన లొటారం - పైన పటారం వంటి అమెరికా గురించి కూడా చర్చించక తప్పదు.

డౌ జోన్స్, నాస్‌డాక్ స్టాక్ సూచికల పతనాలు ముందస్తు సంకేతాలు మాత్రమే. ట్రిబుల్ ఎ. గ్రేడ్ తగ్గడం కూడా ఒక సంకేతమే. కానీ అంతకంటే ప్రమాదకరమైన మహా మాంద్యంలో అమెరికా చిక్కుకో బోతున్నది. అది తనతో పాటు యూరప్‌నూ, మూడో ప్రపంచాన్నీ తరతమ స్థాయిలలో ముంచబోతున్నది. జంట శిఖరాలపై దాడికి ప్రతీకారంగా అది తలపెట్టిన నిరంతర యుద్ధం అందించిన బహుమానమిది.

అందుకే 1776 జూలై 4న పొందిన స్వాతంత్ర్యంతో అమెరికా అంచెలంచెలుగా ఎదిగితే, 2001 సెప్టెంబర్ 11 తర్వాత అది మెట్టు మెట్టుగా దిగజారసాగింది. 1776 నుంచి 2001 వరకూ అమెరికా రాజకీయ గమనం అప్‌గ్రేడింగ్ దిశలో సాగితే, ఆ తర్వాత డౌన్ గ్రేడింగ్ దిశలో సాగుతున్నది. దాని ఆర్థిక గమనమే రాజకీయ గమనాన్ని నిర్దేశిస్తున్నది. అంతర్గతంగా క్రమేణా ఇంత వరకూ కొనసాగుతున్న అమెరికా ఆర్థిక సంక్షోభ వ్యవస్థ ఒక గుణాత్మక మలుపును ఏ రోజైనా తీసుకోవచ్చు. సోషల్ సామ్రాజ్యవాద దేశంగా పేరొందిన అగ్రరాజ్యమైన సోవియట్ యూనియన్ కుప్పకూలుతుందని ముందుగా ఎవరు ఊహించారు? రేపటి అమెరికా భవిష్యత్తు గురించి ఏం చెప్పగలం?

*(రచయిత ఇండియన్ ఫెడరేషన్ ఆఫ్ ట్రేడ్ యూనియన్స్ రాష్ట్ర ప్రధాన కార్యదర్శి)* వీ

గాలులు వీచడం ప్రారంభమైంది. పాత పద్ధతుల్లో తమ సామ్రాజ్యాలను పాలించలేమని గ్రహించాయి. కొత్త ఉడుపులు ధరించాయి. ప్రజాస్వామ్యం, మానవ హక్కుల గురించి, స్వతంత్ర, గౌరవప్రద జీవితం, ఇంక్లూజివ్‌నెస్ లాంటి వాగాడంబరానికి శ్రీకారం చుట్టాయి. ఆ ముసుగులో తమ సామ్రాజ్యవాద కాంక్ష బతికించుకోవడానికి, కొనసాగించుకోవడానికి, ప్రయత్నాలు ప్రారంభించాయి. కొత్తగా స్వాతంత్ర్యం సంపాదించుకొన్న దేశాలు ఆర్థికంగా క్లిష్ట పరిస్థితుల నెదుర్కొంటున్న పరిణామాన్ని గమనించి మేము రుణ సహాయం చేస్తాం. గ్రాంటులిస్తాం. పారిశ్రామికీకరణకు తోడ్పడతాం అంటూ సన్నాయి నొక్కులు ప్రారంభించాయి. కాని ఈ విల్లాయి పదాల వెనుక ఉన్న అసలు విషయం బానిస సామ్రాజ్యవాదం స్థానే ఆర్థిక సామ్రాజ్యవాదం చోటు చేసుకుంటోందని, ఆ ఊబిలో దిగబడిపోయామని, ఈ పరిణామాన్ని ఆయా దేశాల్లోని స్థానిక పాలకులు వంత పాడుతున్నారని అనుభవం తెలియజేస్తోంది.

ఆ దేశాల్లో రాజకీయ పోకడలను, రాజకీయ పార్టీల స్పందనను గమనించిన నయా సామ్రాజ్యవాదులు తమ పంథాను మార్చుకొన్నారు. ఐ.ఎం.ఎఫ్., ప్రపంచ బ్యాంక్, వరల్డ్ ట్రేడ్ ఆర్గనైజేషన్ (డబ్ల్యూ.ఎటి.ఒ.) సంస్థలను ఆక్టివైజ్ చేసి రంగంలోకి దించారు. కొత్తగా స్వాతంత్ర్యం సంపాదించుకొన్న దేశాల ప్రధాన సమస్య నిధుల కొరత. ప్రజల ఆకాంక్షకు ప్రభుత్వ ఆర్థిక శక్తికి మధ్యనున్న, పెరుగుతున్న అంతరం. అన్ని దేశాలు ఇదే సమస్యను ఎదుర్కొంటున్నాయి. అదే సమయంలో ఆర్థిక సామ్రాజ్యవాద దేశాల వద్ద టన్నుల కొద్దీ నిధులున్నాయి. ఈ నిధులు ఎక్కడ పెట్టుబడి పెట్టాలి, ఎక్కడ ఎక్కువ వడ్డీ సంపాదించ వచ్చునని వెతుకుతుండగా వారి కాలికి ఇండియా తగిలింది. సహజ వనరులు కోకొల్లలు, నూరు కోట్ల ప్రజల మార్కెట్, శక్తికి మించి అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టి నిధుల కొరతనెదుర్కొంటోంది.

ఇది కేవలం భారతదేశంలోనే కాదు, కొత్తగా స్వాతంత్ర్యం పొందిన దేశాలన్నిటిలోనూ ఇదే సమస్య. అభివృద్ధి కార్యక్రమాల పేరుతో పాలకులు, సీనియర్ అధికారులు తమ జేబులు నింపుకోవడాన్ని గమనించారు. ఈ అవినీతి కారణంగా అభివృద్ధి కార్యక్రమాలకు ఖర్చు చేస్తున్న కాసిన్ని నిధుల ఫలితాలు అందాల్సిన వారికి అందడం లేదు. ఆ కారణంగా ఆకలి, పేదరికం పెరుగుతున్నాయి. ఇది గమనించిన సామ్రాజ్యవాదులు ప్రపంచ బ్యాంక్ ద్వారా షరతులతో కూడిన రుణ సహాయం అందజేసి, దేశాలను రుణగ్రస్తులను చేశారు ఈ బలహీనతల నవకాశంగా చేసుకొని ప్రపంచీకరణే పరిష్కారం అనే ఆలోచన పాలకుల తలకాయల్లోకి ఎక్కించారు.

పైనే చెప్పినట్లు, అభివృద్ధి చెందిన దేశాలకు ఇదో పెట్టనివరం. ప్రపంచం అంతా ఒక పెద్ద మార్కెట్. ఏ దేశమైనా ఏ ఇతర దేశానికైనా, ఏ ఉత్పత్తినైనా హద్దూ, అదుపూ లేకుండా ఎగుమతి చేయవచ్చు. ఈ ఆలోచనే ప్రపంచ వ్యాపార సంస్థ ఆవిర్భావానికి నాంది పలికింది. అయితే ఇది వన్ వే ట్రాఫిక్ మాత్రమే. అభివృద్ధి చెందిన దేశాలు నిరాఘాటంగా తమ ఉత్పత్తులను ఈ దేశాలకు ఎగుమతి చేయవచ్చు. కాని వర్ధమాన దేశాలు ఎగుమతులు చేయబోతే అన్నీ ఆటంకాలే.

ఈ విధానంగా అమలుకు మొదటి మెట్టే 1991లో దేశంలో ప్రవేశపెట్టిన సరళీకృత ఆర్థిక విధానం. ఈ విధానం మన దేశంలో ఎలా అమలవుతుందో మనందరికీ ఆచరణలో అనుభవం. అభివృద్ధి చెందిన దేశాలు, ముఖ్యంగా అమెరికా మన దేశ ఆర్థిక జీవితంలోకే కాక, పరిపాలనా వ్యవస్థలో, ఆఖరుకు మన గ్రామాల్లో చొరబడడానికి కూడా అంతులేని అవకాశాలను కల్పించింది. గ్రామాల్లో రోడ్లు, మంచినీరు, ఆరోగ్యం, విద్య అన్నింటిలో వేలు పెట్టింది. షరతులు షరామామూలే. మెల్లగా భారతదేశాన్ని ప్రపంచీకరణ రైలెక్కించింది. ఉదాహరణకు, ఈ చొరబాటు మన వ్యవసాయరంగానికి ఏ గతి పట్టించిందో చూడవచ్చు.

మన వ్యవసాయరంగాన్ని బలహీనం చేసి, సాధించుకొన్న ఆహార స్వయం పోషకత్వాన్ని విచ్ఛిన్నం చేయడం, 120 కోట్ల భారత ప్రజానీకాన్ని ఆహార ధాన్యాల దిగుమతుల మీద ఆధారపడాల్సిన దుస్థితి కల్పించడం, ఆ దిగుమతుల కోసం అమెరికా మీద ఆధారపడే పరిస్థితికి నెట్టడం, తన తిండి గింజల ఉత్పత్తికి మార్కెట్ సంపాదించుకోవడం – ఇవీ అమెరికా వక్ర బుద్ధి ఆలోచనలు. ఈ దురాలోచనను ఎండగట్టింది వామపక్షాలు మాత్రమే కాదు. ఈ కుట్రను నేరుగా కేంద్ర ఆర్థిక వ్యవసాయ శాఖ మంత్రి శరద్‌పవార్ తీవ్రంగా విమర్శించారు. 2005లోనే హైదరాబాద్‌లో ఒక సమావేశంలో ఆయన ప్రసంగిస్తూ –

'కొన్ని విదేశీ శక్తులు కొన్ని దేశాలను, ఆ దేశాల ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా, ప్రపంచీకరణ వైపు బలవంతంగా నెట్టుతున్నాయి. అలా నెట్టబడిన దేశాలకు ఎటువంటి ప్రయోజనాలను సమతూకంగా కలిగిస్తున్నాయో అనే ప్రశ్న అనుభవం తెలియజేస్తున్నదేమంటే, ప్రపంచీకరణ అసమానతలను పెంచింది. సంపన్న దేశాలకు లాభాలను తెచ్చి పెట్టింది. పేదలకు అందుతాయన్న ఫలాలు వారికి అందలేదు.'

అమెరికా తన దేశంలో రైతులకు పీకల దాకా సబ్సిడీలిచ్చి వారు పండించిన ఆహార ధాన్యాలను వర్ధమాన దేశాలకు అమ్ముతున్నది. అమెరికా లక్ష్యం ఏమంటే మన రైతాంగాన్ని మన ఆహార పంటలను దెబ్బతీయడమే. ఈ కుళ్లు రాజకీయాన్ని తీవ్రంగా విమర్శిస్తూ పవార్ ఏమన్నారంటే – 'ప్రపంచ వ్యాపార సంస్థ (డబ్ల్యు.టి.ఒ.) ఆవిర్భావంతో ఈ దుష్ట కార్యక్రమానికి తెరపడుతుందని, అన్ని దేశాలకు సమాన అవకాశాలు లభిస్తాయని ఆశించాం. కాని మన ఆశలు నిరాశలయ్యాయి. మన వ్యవసాయం దెబ్బతింది. సామాన్య రైతాంగాన్నే కాక ఆహార ధాన్యాలను ఎగుమతి చేసే వ్యాపారస్తులను నష్టాలకు గురిచేసింది. ఏదో ఒక ప్రతిబంధకాన్ని సృష్టించి వారి పొట్ట కొట్టింది. వర్ధమాన దేశాల్లో ఆహార ధాన్యాల ఉత్పత్తి 24 శాతం నుంచి 22 శాతానికి తగ్గింది. ప్రపంచ వ్యాపారం పెరిగింది. కాని అందులో ఆహార ధాన్యాల వ్యాపారం శాతం 3.4 నుండి 2.2 కు తగ్గింది. దీనికి కారణంగా ఆ దేశాలు తమ తమ ప్రజలకు మరింత ఆహారం పండించి అంద జేయాలనే ప్రయత్నాలు ఫలించలేదు.'

ఈ విధంగా ప్రపంచీకరణ, ప్రపంచ బ్యాంక్, ఐ.ఎం.ఎఫ్. నియో – లిబరలిజం, సంస్కరణలు, సరళీకరణ – ఏ పేరుతోనైనా కావచ్చు, కాని లక్ష్యం ఒక్కటే. వర్ధమాన దేశాలు అభివృద్ధి చెందరాదు, స్వయం పోషకత్వం సాధించకూడదు. అలా చేస్తే సహాయం పేరుతో, తమ ఆర్థిక సామ్రాజ్యవాదాన్ని కొనసాగించుకోవచ్చు.

ఇదంతా చదివిన తర్వాత నాకేదో ప్రపంచీకరణ వ్యతిరేక గాలి సోకిందేమోనని అనిపిస్తుందా? ఎందుచేతనంటే నాతో పాటు ఆర్థికశాస్త్ర పండితులనేక మంది నాతో గొంతు కలిపారు. నాకన్నా ముందే తమ గళం విప్పారు. ఉదాహరణకు, మాజీ ప్రణాళికా సంఘం సభ్యులు డా. సి.ఎచ్. హనుమంతరావు మాట్లాడుతూ, దక్షిణాసియా దేశాలన్నింటిలో, సంస్కరణలు ప్రవేశపెట్టిన అనంతరం వ్యవసాయం నేల చూపుచూస్తోందన్నారు. హైదరాబాద్‌లోని సెస్ సంస్థ మాజీ సంచాలకులు ప్రొ. ఎస్. మహదేవ్ ప్రపంచీకరణ ఆర్థిక, జీవనం మీద ప్రతికూల ప్రభావం చూపిందని, నిరుద్యోగం, పేదరికం పెరుగుతోందని అన్నారు. ప్రపంచ ప్రఖ్యాత వ్యవసాయ శాస్త్రవేత్త డా. ఎం.ఎస్. స్వామినాథన్ అన్ని సార్క్ దేశాల్లో ఆయా దేశాల స్థూల జాతీయా దాయాల్లో వ్యవసాయ రంగం వాటా దిగజారిపోతోందని, పేదరిక రేఖ కిందనున్న జనాభా సంఖ్య తగ్గడం లేదని అన్నారు. హమ్మయ్య, నేను బతికిపోయాను.

ఏమైనా ప్రపంచీకరణను ప్రపంచ దేశాల మీద రుద్దడంలో నేరస్తులు అమెరికా పాలకులు కాదు. ఎందుచేతనంటే అది సామ్రాజ్యవాదులకు సహజం. ఈ జబ్బు వాళ్ల రక్తంలోనే ఉంది. అసలు సిసలు నేరస్తులు అమెరికా ఒత్తిడికి తలవంచిన మన దేశ పాలకులకే అంటాను. ఎలాగంటారా? ఇది చదవండి. 2005లోనే హైదరాబాద్ నగరంలో జరిగిన ఒక సమావేశంలో జరిగిన విశేషాలు వినండి.

ప్రపంచీకరణ విధానాన్ని భారత దేశ ప్రభుత్వం మీద రుద్దడానికి కాన్ఫరెన్స్ అనే పేరు ముసుగులో ప్రపంచ బ్యాంకు ఓ క్లాస్ తీసుకొంది. ఆ సమావేశానికి కేంద్ర ప్రభుత్వం ఉన్నతాధికారులు హాజరయ్యారు. ప్రపంచ బ్యాంకు ఈ క్లాసు తీసుకోలేదనే అభిప్రాయం కలుగజేయడానికి ఈ సమావేశాన్ని నగరంలోని అడ్మినిస్ట్రేటివ్ కాలేజ్ ఆఫ్ ఇండియాతో జాయింట్‌గా నిర్వహించింది. బ్యాంక్ అధిపతి కార్టర్ (ఢిల్లీలో) క్లాసు తీసుకున్నాడు. మామూలుగా ఇలాంటి సమావేశాలు ఢిల్లీలోనే జరుగుతూంటాయి. కాని హైదరాబాద్ నగరాన్ని వేదికగా ఎన్నుకోవడంలో ఒక మతలబు ఉంది. అప్పుడే ప్రపంచ బ్యాంకుకు ఆంధ్రప్రదేశ్‌ను టోకుగా అమ్మేసిన చంద్రబాబును రాష్ట్ర ప్రజలు శంకరగిరి మాన్యాలు పట్టించి రాజశేఖరరెడ్డిని అధికారంలో కూర్చోబెట్టారు.

వై.ఎస్. రుణం కోసం ఎవరిస్తారా అని అటూ ఇటూ చూస్తూ ప్రారంభోపన్యాసంలో ప్రపంచబ్యాంక్ విధానాలను అనుసరించడానికి వ్యతిరేకిని కాననే విధంగా పరోక్షంగా సూచించాడు. బ్యాంకుకు ఇలా పరోక్ష సూచనలు, ఊగిస లాటలకు తలొగ్గాల్సిన పని లేదు. అదే సమయంలో కార్టర్ ఈ అవకాశాన్ని జారవిడుచుకోదలచుకోలేదు. కాగా, లాంఛనంగా రాష్ట్ర ప్రభుత్వాన్ని ప్రశంసిస్తూ బ్యాంకు విధానాన్ని తెలియపరిచే 'అన్ లాకింగ్ ఆంధ్రప్రదేశ్ పొటెన్షియల్' అనే పత్రాన్ని విడుదల చేస్తూ 'సంస్కరణలను అమలు పరచడంలో రాష్ట్రం ముందంజేసింది. కాని ఆర్థికాభివృద్ధిలో కాదు' అని అన్నాడు. అలా అనడంలో నువ్వు ప్రపంచ బ్యాంకు నుంచి విడివడిలేవు అని అర్థం వచ్చేటట్టు, అదే సమయంలో నీవు బ్యాంకు విధానాలను అమలు పరచడంలో విఫలమయ్యావని చంద్రబాబుకు చురక అంటించాడు.

కేంద్ర ఆర్థికశాఖ నుంచి వచ్చిన సీనియర్ అధికారి అశోక్ లాహిరీ కూడా కార్టర్ ధోరణిలోనే ప్రసంగించాడు. 'సంస్కరణల చరిత్రంతా వైఫల్యాల చరిత్రే' అని అన్నారు. ఈ సమావేశం ఆఖరుగా చేసిన పని ఏమంటే, ద్రవ్య బాధ్యత చట్టం (ఫిస్కల్ రెస్పాన్సిబిలిటీ ఆక్ట్) ను పార్లమెంట్‌లో ప్రవేశపెట్టే విధంగా కేంద్రంపై ఒత్తిడి తీసుకుని రావడమే దీని ఉద్దేశం. ద్రవ్య లోటును తగ్గించడానికి తారీఖులు ఖరారు చేయడమే. అది కూడా కేంద్రంలో మాత్రమే కాదు, రాష్ట్రాల్లో కూడా. హద్దుల్లేకుండా విదేశీ సంస్థాగత పెట్టుబడులను, విదేశీ పెట్టుబడులను అనుమతించాలని, ప్రభుత్వరంగ సంస్థల్లో ప్రభుత్వ ఈక్విటీ పెట్టుబడులను తగ్గించుకోవాలని, సబ్సిడీలను తెగ్గొయ్యడం లేదా రద్దు చేయాలని కేంద్రం మెడలు వంచి ఒప్పించింది. బ్యాంకు ఈ విషయంలో మాత్రం కాంగ్రెస్, బిజెపి ప్రభుత్వాలు దొందు దొందే.

వ్యాపారానికి ఉన్న షరతులను, పరిమితులను ప్రభుత్వం ఎత్తివేసింది. అయితే అభివృద్ధి చెందిన దేశాలు పరోక్షంగా అనేక అడ్డంకులు కల్పిస్తూన్నాయి. దీంతో విదేశీ వస్తువులు దేశీయ మార్కెట్‌లోకి కుప్పలు తెప్పలుగా వచ్చి పడుతున్నాయి. ఉన్నత వర్గాల్లో విదేశీ వస్తువులంటే మోజు కట్టలు తెంచుకుంది. అయితే ఇందువల్ల జరిగిన ఒక మేలేమంటే అదే వస్తువులను తయారు చేసే జాతీయ పరిశ్రమలు తమ ఉత్పత్తుల నాణ్యత, మన్నికలను పెంచడం జరిగింది. ఈ విదేశీ, స్వదేశీ వస్తువులను కొనుక్కోవడానికి భారీగా బ్యాంకులు రుణాలివ్వడాన్ని ప్రభుత్వం బలపరిచింది. ఒక్క దెబ్బకు రెండు పిట్టలు రాలాయన్నట్లు, ఒకవైపు పారిశ్రామికవేత్తలు తయారు చేసే వస్తువులకు డిమాండు పెరిగి లాభాలు పోగేసుకున్నాయి. అందులో ఓ వాటా పాలక పార్టీలకు ముడుపుల రూపంలో చెల్లించడం షరా మామూలే. బహుళజాతి సంస్థల ఉత్పత్తులకూ మార్కెట్ పెరిగింది. అయితే మధ్యతరగతి గృహస్తులకు ఈ విధానం వేడి తర్వాత తెలిసింది. తమ జీతాల్లో బ్యాంకులు వడ్డీతో సహా ప్రతి నెల వసూళ్లు ప్రారంభించేసరికి కళ్లలో నీళ్లు తిరిగాయి.

ప్రపంచ వ్యాప్తంగా రవాణా సౌకర్యాలు ఇబ్బడి ముబ్బడిగా పెరగడంతో వ్యక్తుల రాకపోకలతో, డ్రగ్ మాఫియా సరుకు రవాణా వేగవంతమైంది. విదేశాల్లో రోగాలు (ఎయిడ్స్) మన దేశంలోకి దిగుమతి అయ్యాయి. ఎయిడ్స్ వ్యాధి అలా దిగుమతి అయిన రోగమే. విదేశీ వ్యాపారుల రాకపోకలు, వారి వ్యాపారాలు పెరిగాయి. లాభాల పేరుతో దేశం నుండి డాలర్ల రూపంలో నిధులు విదేశాలకు తరలిపోతున్నాయి. అలా దిగుమతి అయిన వాటిలో విదేశీ సంస్కృతి ఒకటి. డబ్ల్యు.టి.ఒ. పేరుతో దిగుమతులు పెరిగి ఎగుమతులు తగ్గడంతో వ్యాపార లావాదేవీల్లో లోటు ఏర్పడింది. ప్రైవేటీకరణలో ప్రభుత్వ పాత్ర తగ్గింది. ఈ వ్యాపార లావాదేవీలు పెరగడంతో, ప్రపంచ వ్యాపితంగా వ్యాపారం పెరిగింది కాని దానిలో దేశం వంతు అత్యల్పం. ఐటి వ్యాపారం శరవేగంగా పెరిగింది కానీ, ఆ క్రమంలో దేశంలో కంప్యూటర్ కూలీల సంఖ్య పెరిగింది. పైనే చెప్పినట్లు ప్రపంచీకరణ ఫలితం సమాజంలో ఉన్నత వర్గాలకే పరిమితమైంది. పేదరికం మరింత పెరిగింది. అసమానతలు విజృంభించాయి. దీనికి అడ్డుకట్ట వెయ్యాలంటే ఒక్కటే మార్గం. ప్రజా ఉద్యమాల ప్రపంచీకరణ జరగాలి. ఆర్థిక సామ్రాజ్య వాదాన్ని తిప్పికొట్టగల శక్తిని ప్రజా ఉద్యమాలు సంతరించుకోవాలి.

*(రచయిత వీక్షణం గౌరవ సంపాదకులు)* వీ

**ఈ దేశంలో భూస్వామ్యానికీ, పీడిత ప్రజలకూ మధ్య ఉన్న ప్రధాన వైరుధ్యం నేడు సామ్రాజ్యవాద భూస్వామ్యంగా పరిణమించి పెట్టుబడి ప్రయోజనాలనూ పరిరక్షిస్తోందని అంటున్నారు వరవరరావు**

# సామ్రాజ్యవాద ప్రపంచీకరణ - కొన్ని వ్యక్తీకరణలు

ఇరవై ఏళ్ల సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ఇండియా నడిగడ్డ మీదికి యుద్ధాన్ని తెచ్చింది. హరిత విప్లవం వాగ్దానాలతో హరిత వేట ఆచరణలోకి దిగింది. అత్యంత ఆధునిక సాంకేతిక విజ్ఞానంతో, అణు విద్యుత్కేంద్రాలతో, ఉక్కు కర్మాగారాలతో అత్యంత ప్రాచీనమైన మూలజాతికి ఈ నేలలో ఉన్న మూల్గులను పీల్చివేస్తున్నది. ఈ దేశంలో ప్రజలు భూమి, భూమి మీద అధికారం ద్వారా స్వేచ్ఛ పొందాలని ప్రయత్నం చేసినప్పుడల్లా ప్రజలమీద సైనిక దాడితో దురాక్రమణ చేయడం ఇక్కడి పాలకవర్గాలకు కొత్తకాదు. గానీ అది నగ్నంగా సామ్రాజ్యవాద ప్రయోజనాల కోసం చేయడం 1991 నుంచి మామూలు కంటికి కూడా కనిపిస్తున్నది. తెలంగాణలో ప్రజలు దున్నే వారికి భూమి నినాదంతో లక్షలాది ఎకరాలు స్వాధీనం చేసుకొని, ఎర్ర రాజ్యాన్ని బీజ ప్రాయంగా చవిచూస్తున్న కాలంలో 1948లో సైనిక దాడి జరిపి దురాక్రమణ చేసారు. ఇపుడది విముక్తి దినంగా (సెప్టెంబర్ 17) జరపాలంటున్నారు సంఘపరివార్. కాశ్మీర్‌లో షేక్ అబ్దుల్లా నాయకత్వం లో విప్లవాత్మక భూసంస్కరణలు జరిపినప్పుడు అదే 1948లో అక్కడ సైనిక దాడి జరిపి కాశ్మీర్‌ను ఆక్రమించుకున్నారు.

భూమి, వనర్లు, ఆజాదీ పారస్పర్యంలో ప్రజలకు చెందడం పెట్టుబడి సహించదు. అరవయేళ్ల చరిత్రంతా ఇందుకు దాఖలాయే. ఇప్పుడు దండకారణ్యంలో, ముఖ్యంగా దక్షిణ బస్తర్‌లో భూమిలేని ఆదివాసీ కుటుంబం లేదు. అది ప్రభుత్వం పంచింది కాదు. ప్రజలే ఏర్పాటు చేసుకున్న జనతన సర్కార్ పంచింది. ఆ భూమిని, భూమి మీది, లోని వనర్లను బహుళజాతి కంపెనీల కోసం, బడా కంపెనీల కోసం కొల్లగొట్టి ఇవ్వడానికి దండకారణ్యంపై కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు యుద్ధం ప్రకటించాయి. 2011 జనవరిలో దండకారణ్యంలో పెద్ద ఎత్తున భూమి చదును చేసే కార్యక్రమాన్ని తీసుకొని జూన్‌లో తొలకరి వానల కోసం ప్రజలు నిరీక్షిస్తున్న సమయంలో అక్కడ సైన్యం దిగింది.

భూమిని, వనర్లను ప్రపంచ మార్కెటుకు తరలించే కుట్రయే భారత పాలకవర్గాల చరిత్ర. ఈస్టిండియా కంపెనీకి సహకరించిన కాలం నుంచి ఇవ్వాళ కంపెనీల పార్టీగా మారిన కాలం వరకు ఇది ఒక సుదీర్ఘ పాలకవర్గాల దాస్య చరిత్ర. 1857 ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం నుంచి ఇవ్వాళ తూర్పు, మధ్య భారతాల్లో జరుగుతున్న ప్రజా యుద్ధం వరకు ఇది పీడిత పోరాట ప్రజల కొనసాగుతున్న స్వాతంత్రేచ్ఛ చరిత్ర. ప్రజాస్వామిక పోరాట చరిత్ర కూడ.

సంస్కరణ ద్వారా భూమిని, వనర్లను ఫ్యూడల్, పెట్టుబడిదారీ, దళారీ వర్గం చేతుల్లో ఉంచాలన్న పాలకవర్గాల ప్రయత్నాలు, పథకాలు, సంక్షేమ రాజ్య వాగ్దానాలు 1967 నాటికి తేలిపోయినవి. నక్సల్బరీ వసంత మేఘ గర్జన 'ఉత్తర జూసి ఎత్తర గంప' అన్నట్లు ప్రజల్ని తమ పాదాల కింద నేలమీద హక్కుల్ని ప్రకటించడానికి పురి కొల్పింది. పెద్ద ఎత్తున అంతర్జాతీయ ద్రవ్య నిధి జోక్యం అప్పుడే ప్రారంభమైంది.

భూమిని ఆస్తిగా, మార్కెట్‌గా చూసే శక్తులకు భూమిని శ్రమగా, స్వేచ్ఛగా చూసే శక్తులకు ఎల్లప్పుడూ ఒక నిరంతర ఘర్షణ ఉంటుంది. భూమిని ప్రైవేట్ ఆస్తిగా చూసే శక్తులకు, భూమిని సమష్టి ఆదరువుగా చూసే శక్తులకు నిరంతర ఘర్షణ ఉంటుంది. ప్రైవేట్ ఆస్తి, మార్కెట్ భావన లేని ఆదివాసులు, రాజ్యం, కేంద్రం పాలన అనుభవం లేని ఆదివాసులు బ్రిటిష్ ఇండియా కాలం నుంచి కూడా ఈ జోక్యానికి వ్యతిరేకంగా ప్రతిఘటిస్తున్నారు. కానూ, సిద్ధూ, బిర్సా ముండా, వీర్‌నారాయణ్ సింగ్, గూండాదర్ (భూంకాల్ తిరుగుబాటు), సీతారామ రాజు, కొమురం భీం మొదలు ఇవ్వాల్టి వరకు ఆదివాసుల పోరాట చరిత్రంతా ఈ మార్కెట్ దాడిని ఎదుర్కొనే ప్రతిఘటనా చరిత్రే.

తెలంగాణ వంటి మైదాన ప్రాంతాల్లో కూడా 1948 తర్వాత మళ్లా 1978లో ఈ ప్రయోగం మొదలై క్రమంగా ఇవ్వాళ దేశవ్యాప్త మయ్యే నాటికి ఈ ప్రత్యామ్నాయ ప్రయోగాన్ని అణచి వేయడానికి పెట్టుబడి తన రహస్య ఎజెండాను బయటికి తీయడం ప్రారంభించింది. అది పంజాబ్‌లో మిలిటెంట్ పోరాటాలని అణచివేసే రూపంలో కావచ్చు. తెలంగాణలో విప్లవ శక్తులను అణచివేసే రూపంలో కావచ్చు.

ఇందిరాగాంధీ స్వర్ణమందిరంపై సైనిక దాడి చేసిన నాటికి దేశంలో అటు ఎంసిసిఐ నాయకత్వంలో బీహార్, బెంగాల్ సరిహద్దుల్లో, ఇప్పటి జార్ఖండ్‌లో ఇటు మహారాష్ట్రలోని గడ్చిరోలీ నుంచి బస్తర్‌ల మీదుగా ఆంధ్ర, తమిళనాడు, కర్ణాటకలో పీపుల్స్ వార్ నాయకత్వంలో విప్లవ పోరాటాలు ఉన్నాయి. అంటే విప్లవ శక్తుల సంఘటన కింద సమీకరణలు బలపడుతున్నాయి. 1984-85లను 1991 నూతన ఆర్థిక విధానానికి ఒక కర్టెన్ రైజర్‌గా భావించవచ్చు. అది స్వర్ణ మందిరం మీద సైనిక దాడి, వందల సంఖ్యలో సిక్కులను చంపడంతో ప్రారంభమైంది. సామ్రాజ్యవాదం ఏకకాలంలో పార్లమెంటరీ ప్రజాస్వామ్యం ముసుగును తొలగించి సైనిక దాడులకు పూనుకుంటుంది. మత ఆలంబనతో ఉపరితలంలో ఉన్మాదాన్ని రెచ్చగొడుతుంది. మార్కెట్

ప్రవేశానికి పెట్టుబడి పూర్వ రూపాలైన ఫ్యూడల్ భావాజాల ప్రచారాలను ఉధృతం చేస్తుంది. ఇది రెండవ ప్రపంచ యుద్ధానికి ముందు జర్మనీలో స్పష్టంగా చూశాం.

1984 నవంబర్‌లో అధికారానికి వచ్చిన రాజీవ్‌గాంధీ ఈ ఫాసిస్టు ప్రయోగాలకు తెరలేపాడు. ఏకకాలంలో సిక్కుల ఊచకోత, భోపాల్ గ్యాస్ దుర్ఘటన, బొంబాయిలో కాంగ్రెస్ శతవార్షికోత్సవంలో 21వ శతాబ్దంలోకి దేశాన్ని తీసుకపోతానని చేసిన ప్రకటన, అయోధ్యలో రామ్‌లల్లా పూజల కోసం ద్వారాలు తెరవడం - ఇవేవీ విడివిడి అంశాలు కావు. ఇదే కాలంలో ఏకత్మతా యజ్ఞం పేరుతో ఎల్.కె. అద్వానీ గుజరాత్‌లోకి ద్వారక నుంచి ప్రారంభించి దేశమంతా చేసిన రథయాత్ర - దేశమంతా ఒక రెగ్యులేటెడ్ (మొనాపలీ) మార్కెట్ కొరకు చేసిన సర్వే. అశ్వమేధ యాగం కన్న ముందర దేశంలోకి రాముని అధికారాన్ని ప్రకటించే అశ్వాలను వదలడమే.

ఈ కాలానికీ ప్రపంచమంతటా రాజకీయ జీవితం, ఉద్యమ జీవితం లేని బ్యూరాక్రాట్లు, సినిమా నటులు, టెక్నోక్రాట్లు అధికారానికి వచ్చారు. రష్యాలో పెరిస్ట్రోయికాలు, గ్లాస్‌నాస్తులు ప్రారంభమయ్యాయి.

రాజ్యం మిశ్రమ ఆర్థిక విధానం, సోషలిస్టు తరహా పాలన, పబ్లిక్ సెక్టర్, సంక్షేమం అనే మాటలు కూడ మరచిపోయి - చరిత్రాంతానికి ప్రయాణం మొదలుపెట్టింది.

1991 నూతన ఆర్థిక విధానం పేరుతో వచ్చిన సామ్రాజ్యవాద ప్రపంచీకరణ మనకు నేరుగా అమెరికా నుంచి దిగుమతి అయింది. రష్యా, తూర్పు యూరప్ దేశాల పతనం ఒకవైపు, అప్పటిదాకా సిఐఎ అధినేతగా ఉన్న జార్జ్ బుష్ (జార్జ్ వాకర్ బుష్ తండ్రి) అమెరికా అధ్యక్షుడై ఏకధృవ ప్రపంచ ఆదర్శాన్ని ప్రకటించడం మరొకవైపు జరిగాయి.

వేయిపడగలు అనువాదం చేసి, రాష్ట్ర విద్యామంత్రిగా 1972లో జార్జ్ రెడ్డి హంతకులకు ఆశ్రయమిచ్చి (ముఖ్యమంత్రిగా శ్రీకాకుళ ఉద్యమ ప్రభావంతో 1973లో భూ సంస్కరణలు తేక తప్పనిది కూడా ఈయనే) కరీంనగర్, వరంగల్ జిల్లాల్లో విప్లవ భావజాలానికి 'ప్రత్యర్థి' ప్రతినిధిగా ఎదిగివచ్చి ('భూములు వదులుకోకపోతే ప్రాణాలే వదులు కోవాల్సి వస్తుందని' తన వర్గం వారిని సముదాయించి) ప్రధాని కాగలగిన పి.వి. నరసింహారావు (ఆయనకు సుదీర్ఘమైన రాజకీయ జీవితం ఉన్నది. కాని ఆయనే రాసుకున్నట్లు నెహ్రూ వలెనే ఆయనది కూడ ఒక ద్వంద్వ వ్యక్తిత్వం. స్వామి రామానందతీర్థ శిష్యుడుగానూ, బూర్గుల రామకృష్ణా రావు దగ్గర న్యాయవాదిగానూ, మంత్రివర్గంలోనూ పని చేసాడు. ఇందిరా, రాజీవ్‌లకు తీర్మానాలు రాసిపెట్టే గుమస్తాగా వ్యవహరించాడు. ఆయన అధికారాన్ని చవిచూసింది ప్రధాని అయ్యాకనే. అయితే ఇండియాలో బూర్జువాజీ నామమాత్రమైన స్వాతంత్ర్యం ఏదయినా ఉందనుకున్నా అది భూమండలీకరణ, మండలీకరణ, కమండలీకరణ లతో పూర్తిగా పోయి వాళ్లు హిందుత్వ స్వభావం గల దళారులుగా మిగిలిపోయారు) ప్రపంచీకరణ, సరళీకరణ, ప్రైవేటీకరణ నూతన ఆర్థిక విధానాన్ని ప్రకటించాడు. ఆ ఆర్థిక విధాన రచనకు ప్రపంచ బ్యాంక్ గవర్నర్‌గా పని చేసిన సామ్రాజ్యవాద దళారీ ఆర్థికవేత్త మన్మోహన్ సింగ్‌ను ఆర్థిక మంత్రిగా తెచ్చాడు.

నెహ్రూ కాలంలో టి.టి. కృష్ణమాచారి మొదలు ఇవ్వాల్టి వరకూ కొద్ది మినహాయింపులతో మన ఆర్థిక మంత్రులు ఎవ్వరూ రాజకీయ జీవితం నుంచి వచ్చినవాళ్లు కాదు. ఇందిరాగాంధీ కాలం నుంచి ప్రధానులు కూడా ఎవ్వరూ ఉద్యమ జీవితం నుంచి వచ్చిన వాళ్లు కాదు. బిజెపికైతే 1947 కన్నా పూర్వం రాజకీయ జీవితమూ లేదు, ఉద్యమ జీవితమూ లేదు.

రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత అమెరికా ఒక జియోనిస్టు ఇజ్రాయిల్‌ను సృష్టించి చమురు మీద ఆధిపత్యం కోసం అరబ్ దేశాల మీద ప్రచ్ఛన్న యుద్ధం ప్రకటించి నయా వలస విధానాన్ని అమలు చేసినట్లుగా 1991 తర్వాత మన దేశంలో ప్రపంచీకరణ అమలుకు హిందూత్వ అజెండా మీదికి వచ్చింది. అమెరికాకు శత్రువు బయట పాలస్తీనాలో ఉంటే - పాదం మోపడానికినేలలేని ప్రవాసం నుంచి పాలస్తీనియన్లు దెబ్బై ఏళ్లుగా పోరాడుతుంటే ఇక్కడ పాదాల కింద నేలను స్వాధీనం చేసుకోవడానికి, స్వాధీనం చేసుకున్న భూముల్ని దుక్కి దున్ని పంట ఇల్లు చేరేదాకా కాపాడుకోవడానికి, మరీ ముఖ్యంగా 1991 నుంచి భూమి పొరల కింద వనర్లను కాపాడుకోవడానికి ప్రత్యామ్నాయ ప్రజాశక్తులు పోరాడుతున్నాయి.

1991లో నూతన ఆర్థిక విధానం ప్రకటించడానికి ఒక ఏడాది ముందే 90 మేలో వరంగల్‌లో జరిగిన చరిత్రాత్మక రైతు కూలీ సంఘం సభ భూసంస్కరణల్లో మూడవ దశను ప్రకటించింది. తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటం - జమీందారీ జాగిర్దారీ రద్దుకు, రక్షిత కౌల్దారీ చట్టానికి దారితీస్తే శ్రీకాకుళ రైతాంగ పోరాటం 1/70 చట్టానికి, భూ గరిష్ట పరిమితికి దారితీసింది. జగిత్యాల జైత్రయాత్ర, పీపుల్స్ వార్ ఆవిర్భావం తర్వాత పదేళ్లకు సాధించిన విజయాలను స్థిరీకరించుకునే క్రమంలో ఈ సభ పూర్తిగా ఆబ్సెంటీ ల్యాండ్ లార్డిజాన్ని రద్దుచేసి, ఒక కుటుంబానికి ఒకే ఉపాధి అనే కార్యక్రమాన్ని ఆచరణలోకి తెచ్చింది. 1978లో గ్రామాలకు తరలండి అని రాడికల్స్ ఇచ్చిన పిలుపు 1991 నాటికి రైతుకూలీ సంఘం ప్రతి గ్రామంలో ఏర్పడి భూములు స్వాధీనం చేసుకోవడమే కాదు, ఆ భూముల్లో ఎర్రజెండాలు పాతి రాజకీయాధికార చైతన్యాన్ని ప్రకటించడం కూడ జరిగింది. ఆ సభల నేపథ్యంలో ఒకవైపు ఢిల్లీలో వి.పి.సింగ్ ప్రధానిగా దున్నేవారికి భూమి ప్రాతిపదికగా భూసంస్కరణలు అమలు చేయాల్సిన తరుణం వచ్చిందని ప్రకటించాడు మండల్ కమిషన్ సిఫారసులను అమలు చేయడానికి ప్రయత్నించాడు. కమండలీకరణను వ్యతిరేకించాడు. ఫలితంగా పదవినే కోల్పోయాడు. మరోవైపు మార్కెట్ శక్తులు, హిందుత్వ శక్తులు విజృంభించి బాబ్రీ మసీదు విధ్వంసానికి పూనుకున్నాయి. ఇక్కడ ఆంధ్రప్రదేశ్‌లో హైదరాబాద్‌లో వందలాది మంది ముస్లింలను హత్య చేసి నేదురుమల్లి జనార్ధన రెడ్డి అధికారంలోకి వచ్చి, పీపుల్స్‌వార్‌ను నిషేధించి, ఇంజనీరింగ్ కాలేజీలను ప్రైవేటైజ్ చేశాడు. సామ్రాజ్యవాద ప్రపంచీకరణ స్వభావానికి - మార్కెట్ విస్తరణ కోసం ఉత్పత్తి శక్తుల విధ్వంసం ఒక అనివార్య అవసరం. భూమిని నమ్ముకునే పేద రైతులు, శ్రమను నమ్ముకున్న శ్రామికులు, చేతి పనులను నమ్ముకున్న వివిధ వృత్తుల వాళ్లు తమ తమ ఉత్పత్తి సాధనాల నుంచి పరాయీకరించ బడకుండా మార్కెట్ ప్రవేశించజాలదు. ఆంధ్రప్రదేశ్ మొత్తంగా ఆదివాసులు, భూమి లేని పేదలు, వ్యవసాయ కూలీలు అయిన దళితులు

నమ్ముకున్న విప్లవోద్యమాన్ని, సహస్ర వృత్తుల్లో పని చేస్తున్న ముస్లింలను నిరాశ్రయులను చేస్తూ ఇక్కడ 1991లో ప్రపంచీకరణ విధానం అమలులోకి వచ్చింది. నిర్బంధంలో అమలు చేయడానికి అందుకోసం ఇక్కడికి సరిహద్దు భద్రతా దళాలు వచ్చాయి. వరంగల్, హైదరాబాదుల్లో కవాతు చేశాయి. నేదురుమల్లి జనార్దనరెడ్డి నిషేధించిన సంస్థల్లో కేవలం పీపుల్స్‌వార్ పార్టీ మాత్రమే కాదు రైతు కూలీ సంఘం, సింగరేణి కార్మిక సమాఖ్య, రాడికల్ యువజన సంఘం, రాడికల్ విద్యార్థి సంఘం కూడా ఉండడాన్ని బట్టి గ్రామాలకు తరలండి క్యాంపేయిన్ తీసుకున్న విద్యార్థి యువజనులను, భూములు స్వాధీనం చేసుకున్న రైతు కూలీలను, కార్మికుల ఉపాధి సంక్షేమానికి పోరాడుతున్న కార్మికసంఘాన్ని రాజ్యహింసకు గురిచేసి ప్రైవేటీకరణ విధానం చేపట్టే కుట్ర ఉన్నది. ఈ కుట్రకు ఎంత ముందు చూపు ఉన్నదంటే తన రాష్ట్ర ప్రభుత్వ పరిధిలో లేని దండకారణ్య ఆదివాసీ క్రాంతికారీ మహిళా సంఘటన్‌ను, అఖిల భారత విప్లవ విద్యార్థి సంఘాన్ని కూడా నేదురుమల్లి జనార్దనరెడ్డి నిషేధించాడు. ఇవ్వాళ ఈ డి.ఎ.కె.ఎం.ఎస్. నాయకత్వంలో నలభై శాతం ఆదివాసీ మహిళలు దండకారణ్యంలో భూంకాల్ విముక్తి పోరాటంలో పాల్గొంటున్నారు.

(అఖిల భారత స్థాయిలో రాజీవ్‌గాంధీ పాలనలో సామ్రాజ్యవాద ప్రపంచీకరణకు తెరఎత్తినట్లు గానే ఆంధ్రప్రదేశ్‌లో 1985 నుంచి ఎన్‌టిఆర్ పాలనలో తెర ఎత్తిన వైనాన్ని ఇదే పత్రికలో గతంలో వివరంగానే చర్చించాం.) 1992లో నేదురుమల్లి జనార్దనరెడ్డి పాలనలో ప్రారంభమైన ప్రైవేటీకరణ అప్రతిహతంగా ఇవ్వాటికీ కొనసాగుతున్నది. (ఎన్‌టిఆర్ మలి పాలనలో కొన్ని నెలలు మినహాయించి) చంద్రబాబు స్వయంగా తాను ప్రపంచ బ్యాంక్ సిఇఒ నని ప్రకటించుకున్నాడు. ఆయన 'ప్రపంచ బ్యాంక్' పాలేరు అని పిలిచిన వైఎస్ఆర్ కంపెనీలకు చేసిన సేవ బండారమంతా ఇపుడు మేడిపండు విచ్చుకున్నట్లుగా బయట పడుతున్నది. ఈ భూ పందేరం కోసం ఆయన జలయజ్ఞం పేరుతో విప్లవకారుల, ప్రజల రక్త యజ్ఞమే చేసాడు.

దేశవ్యాప్తంగా చూసినపుడు ముఖ్యంగా గమనించవలసిన విషయం సామ్రాజ్యవాద ప్రపంచీకరణ హిందుత్వ శక్తులకిస్తున్న కండబలం. సామ్రాజ్యవాద భూస్వామ్యం అనే మాట ఇపుడు ప్రబలంగా వాడుకలోకి వచ్చింది. ఇవ్వాల్టికీ ఫ్యూడలిజానికి అశేష ప్రజానీకానికీ ఉన్న ఘర్షణయే ప్రధాన వైరుధ్యమైనప్పటికీ భూస్వామ్యం ఇవ్వాళ సామ్రాజ్యవాద భూస్వామ్యం యొక్క కొత్త రూపాన్ని ఎత్తింది. వ్యవసాయం కోసం, వృత్తుల కోసం భూమిని స్వాధీనం చేసుకునే పోరాటం, వనర్లను కాపాడుకోవడం కోసం అడవిని, భూముల్ని కాపాడుకునే పోరాటంగా మారింది. ఉద్యోగుల, ఉపాధి, జీవన వికాసం కోసం పరిశ్రమల కోసం చేసే పోరాటం, నిరుద్యోగాన్ని ప్రోత్సహించి, లక్షలాది మందిని నిరాశ్రయుల్ని చేస్తున్న గనుల తవ్వకాలు, ఓపెన్ కాస్ట్, ఉక్కు కర్మాగారాల నిర్మాణం, విద్యుత్ కేంద్రాలు, థర్మల్ విద్యుత్ కేంద్రాలు, అణు విద్యుత్ కేంద్రాలు, ప్రత్యేక ఆర్థిక మండలాలు, వినోద పరిశ్రమ, పర్యాటక పరిశ్రమ వంటి వాటికి వ్యతిరేకంగా చేసే పోరాటాలుగా మారినవి. ఒకవైపు కంపెనీల భూ కేంద్రీకరణతో ఫ్యూడల్ విలువలు ఫాసిస్టు స్వభావాన్ని సంతరించుకుంటున్నాయి. ఈ కేంద్రీకరణకు ఒక క్రియాశీల ఏజెంటుగా పనిచేస్తున్న పార్లమెంట్, అసెంబ్లీలు ప్రజాప్రాతినిధ్య స్వభావాన్ని కోల్పోయి రాజకీయార్థిక దృష్టితో చూసినపుడు రియల్ ఎస్టేట్ వ్యాపారులు గాను, దళారీలు గాను మారిపోయారు. ప్రజాస్వామ్య పాలక దృష్టితో చూసినపుడు నగ్నంగా ఫాసిస్టులుగా బయటపడుతున్నారు. మార్కెట్‌కు హిందుత్వకు ఉన్న స్వభావ సారూప్యం వల్ల కాంగ్రెస్, బిజెపి వంటి లేబుళ్ల అవసరం లేకుండా హిందుత్వ భావజాలం దీనికి తాత్విక సమర్థన నిస్తున్నది. గుజరాత్ మారణకాండ తర్వాత నరేంద్రమోడీ సామ్రాజ్యవాద ప్రపంచీకరణ అభివృద్ధి నమూనాకు ఆదర్శప్రాయంగా భావించబడడం, రేపటి దేశ ప్రధానిగా పాలకవర్గాల భరోసాను నిలబెట్టడం - అద్వానీ ప్రారంభించిన మోనాపలీ మార్కెట్‌కు ఏకత్మతా యజ్ఞం రథయాత్ర నుంచి జరిగిన పరిణామం గానే చూడాలి.

రామజన్మ భూమి, రాముడొక్కడే దేవుడు, అఖండ భారత్ - ఇవన్నీ ఒకే మార్కెట్ భావజాలానికి మత వర్గతత్వ పై పూతలు. మతం లేని ఆదివాసులు, దళితులు, అణగారిన వర్గాలు, స్త్రీలు ఇవ్వాళ ఈ భావజాలాన్ని ప్రతిఘటిస్తున్నారు. దేశంలో బాబ్రీ మసీదు విధ్వంసం నుంచి గుజరాత్ మారణకాండ వరకు, ఆంధ్రప్రదేశ్‌లో కారంచేడు నుంచి వేంపెంట వరకు ఈ నేపథ్యం నుంచి విశ్లేషించవలసి ఉన్నది.

ముఖ్యంగా కులం, మతం లేని కేవలం తెగలే అయిన ఆదివాసులు జంగల్ మహల్ మొదలు శ్రీకాకుళం వరకు, జార్ఖండ్ మొదలు, దండకారణ్యం వరకు ఈ విధ్వంసకరమైన అభివృద్ధి నమూనాను అందుకే తమదైన స్వపరిపాలనలో సాయుధంగా ప్రతిఘటిస్తున్నారు. అందుకే ప్రజలపై ఇవ్వాళ ప్రభుత్వాలు యుద్ధం ప్రకటించాయి.

దేశానికి అంతర్గత భద్రతకు ప్రమాదంగా ఉన్న మావోయిస్టు ప్రయోగంతో సంభాషణ జరపాలన్నది ఆజాద్ ఎన్‌కౌంటర్ దాకా మధ్యతరగతి అజెండాగా ఉండింది. అంటే రెండు అభివృద్ధి నమూనాల మధ్య సంఘర్షణను సంభాషణగా మార్చగలమా? రెండు భిన్నమైన రాజకీయ నిర్మాణాలు - పార్లమెంటరీ ప్రజాస్వామ్యం - నూతన ప్రజాస్వామ్యం బీజరూపమైన జనతన సర్కార్‌ల మధ్యన సంభాషణ సాధ్యమా? భ్రష్టమైన, స్వార్థపరమైన, అవినీతిమయమైన, అధికార లాలసతో కూడిన ఎన్నికల విధానానికి, కష్టమైన, త్యాగపూరితమైన, ప్రజా సేవకు అంకితమైన, తమ ఊరు, పేరు, ఆస్తి, త్యజించి చేపట్టిన సాయుధ పోరాట పంథాకు మధ్య సంభాషణ సాధ్యమా అని దేశమంతా బుద్ధిజీవులు, ప్రజాస్వామ్యవాదులు ఆలోచిస్తున్న, ప్రయత్నిస్తున్న తరుణంలో కంపెనీలు, మీడియా, ఎన్జీవోలు తెరమీదికి అవినీతి వ్యతిరేక పోరాటం పేరుతో కొన్ని కొయ్య బొమ్మలను ప్రవేశపెట్టాయి. అవన్నీ అన్నా హజారే, బాబారామ్‌దేవ్, శ్రీశ్రీశ్రీ రవిశంకర్ మొదలు అగ్నివేశ్ దాకా అన్నీ కాషాయ బొమ్మలే. అన్నీ కేజ్రివాల్, కిరణ్‌బేడీ వంటి ఎన్.జి.ఒ.లే. సామ్రాజ్యవాద భూస్వామ్యం అంటే కాషాయ కంపెనీలు. ఈ స్వాముల ముందు మోకరిల్లక తప్పని స్కాములలో పాలకవర్గాలు ఇరుక్కున్నాయి. 2జి స్కాముల విచారణ - రాజాలు, కనిమొళిల వంటి రాజకీయ నాయకుల పరిధిని దాటి టాటా, అంబానీల వరకు విస్తరించకుండా ఉండడానికి ఒక భద్రతా వాల్వును వ్యవస్థ వెతుక్కున్నది.

1991లో మండల్ వ్యతిరేక, కమండల్ ఉద్యమంతో ప్రారంభమైన ఈ ప్రయోగం ఇవ్వాళ రామ్‌లీలా మైదానం కేంద్రంగా

ఇరవై ఏళ్లుగా సాగుతున్న ప్రపంచీకరణ ఫలితంగా సామాన్యులకు విద్య, వైద్యం, ఉపాధి, బతుకుతెరువు వంటి కనీస మౌలిక అవసరాలు కూడా భారం అయిపోయాయని అంటున్నారు **ప్రొ. కె.ఆర్.చౌదరి**

# ప్రపంచీకరణ అనుభవాలు - ప్రజల పాలిట శాపాలు

గత ఇరవైళ్ల ప్రపంచీకరణలో దేశ పాలకులు చెప్పినట్లు, కొంతమంది ప్రజలు ఆశించినట్లు ప్రపంచీకరణతో దేశ ప్రజలు ప్రయోజనాలు పొందలేదనీ, పైగా దోపిడీకి గురి అయ్యారనీ స్పష్టమౌతోంది. ప్రపంచీకరణ క్రమంలో ధనిక దేశాల నుండి పేద దేశాలకు పెట్టుబడుల ప్రవాహం ఉంటుందని చెప్పారు. సాంకేతిక అభివృద్ధి పెట్టుబడులను పేద దేశాల్లోకి వేగవంతంగా మళ్లించడానికి తోడ్పడింది. అంతర్జాతీయ సంస్థలైన అంతర్జాతీయ ద్రవ్య నిధి, ప్రపంచ బ్యాంక్, ప్రపంచ వాణిజ్య సంస్థ పెట్టుబడుల కదలికలను సుగమం చేస్తున్నాయి. దేశంలోకి పెట్టుబడులైతే వచ్చాయి. కానీ, అభివృద్ధికి ఉద్దేశించిన పెట్టుబడులు కావు. ఉత్పత్తి పెంచడానికీ, పరిశ్రమలు స్థాపించడానికీ, ఉపాధి సౌకర్యాలు కల్పించడానికీ ఉపయోగపడలేదు. విదేశీ పెట్టుబడిదారులు స్థాపించిన పరిశ్రమలు పర్యావరణాన్ని కలుషితం చేసేవే. ఆయా దేశాల్లో నిషేధింపబడ్డవే. పెట్టుబడిదారులకు విశేషంగా లాభాలు చేకూర్చేవే. కానీ, ఉపాధి సౌకర్యాలు మాత్రం అరకొరగా కల్పించేవి. ఆధునిక సాంకేతిక పరిజ్ఞానంతో, ఆధునిక భారీ యంత్రాలతో పనిచేసే పరిశ్రమల్లో మానవ శ్రమ అవసరం అల్పంగా ఉంటుంది. అందువల్ల, దేశ ప్రజలకు ఈ పరిశ్రమలవల్ల ఉపాధి సౌకర్యం కలగక పోగా, విదేశీ పెట్టుబడిదారుల లాభాల రూపంలో ప్రజలను దోపిడీ చేస్తున్నారు. విదేశీ పెట్టుబడులు, పైగా, ద్రవ్యపెట్టుబడులు. ఇవి స్టాక్ మార్కెట్‌లో లేదా సట్టా వ్యాపారం చేయడానికి ఉపయోగపడుతున్నాయి. తమకు లాభాలు వస్తుంటే, తమకు వ్యాపారం అనుకూలంగా ఉంటే, స్టాక్ మార్కెట్లలో పెట్టుబడులుంటాయి. వారు తలచుకున్నప్పుడు పెట్టుబడులు ఉపసంహరించుకుంటారు. అందువల్ల స్టాక్ మార్కెట్లో విపరీతంగా నష్టపోవడం జరుగుతోంది. దీన్నుంచి సామాన్య ప్రజలకు నేరుగా సంబంధం లేకపోయినా, దేశీయ కంపెనీలు, చిన్నస్థాయిలో షేర్లు కొన్న మధ్యతరగతి ప్రజలు నష్టపోతున్నారు. అయితే, మన మార్కెట్లపై పూర్తి నియంత్రణ, గుత్తాధిపత్యం సాధించడానికి విదేశీ కంపెనీలకు ద్రవ్య పెట్టుబడులు ఉపయోగపడతున్నాయి. ద్రవ్య పెట్టుబడులతో వాణిజ్య విస్తరణ ప్రపంచీకరణతో పెనవేసుకొని పోతున్నాయి.

స్వేచ్ఛాయుత ఆర్థిక వ్యవస్థలో వనరుల కదలిక స్వేచ్ఛగా ఉంటుందనీ, పోటీ ఉంటుందనీ, కాబట్టి ఆర్థిక వ్యవస్థ సమర్థవంతంగా ఉంటుందనీ చెబుతున్నారు. కానీ, వాస్తవంలో విదేశీ బహుళజాతి కంపెనీలు, దేశీయ బడా కంపెనీలు బలంగా ముందుకు వచ్చి, దేశంలోని చిన్న చిన్న కంపెనీలను తీవ్రంగా దెబ్బతీసి, మూతపడేట్లు చేశాయి. తమ కంపెనీల ద్వారా ఉత్పత్తి వస్తువులను భారీ స్థాయిలో సరఫరా చేస్తున్నందువల్ల దేశంలో దాదాపు అరవై లక్షల చిన్న చిన్న పరిశ్రమలు, ముఖ్యంగా కుటీర పరిశ్రమలు మూతపడి, వాటిపై ఆధారపడి జీవించే వారు జీవనోపాధి కోల్పోయారని నివేదికలు తెలుపుతున్నాయి.

గతంలో విదేశీ బహుళజాతి కంపెనీలు సాంప్రదాయకంగా వస్తువుల ఉత్పత్తికి, మార్కెటింగ్‌కు ప్రాధాన్యమిచ్చేవి. ప్రపంచీకరణ క్రమంలో ఈ కంపెనీలు చాలావరకు వ్యవసాయం, గనుల తవ్వకానికి ప్రాధాన్యతను మార్చాయి.

వ్యవసాయరంగంలో ఉత్పాదకాల్లో అత్యంత ముఖ్యమైనది విత్తనం. బహుళజాతి కంపెనీలు విత్తన రంగంలోకి భారీగా చొచ్చుకొని వచ్చాయి. ఉమ్మడి వనరు అయిన విత్తనాన్ని ఒక సరుకుగా మార్చి, విస్తారంగా వ్యాపారం చేస్తున్నారు. విదేశీ కంపెనీల గుత్తాధిపత్యం

---

దేశమంతా మీడియా దృశ్య, శ్రవణభాషలో వెల్లువెత్తుతున్నది. అయితే ఇది 'అన్నలు' భూమి, వనర్లు, జనతన సర్కారు, ప్రజలకు రాజకీయాధికారం కేంద్రంగా కింది నుంచి తెస్తున్న విప్లవం వలె, అవినీతి వ్యతిరేక కేంద్రంగా పై నుంచి తెస్తున్న విప్లవం అవుతుందా? వ్యవస్థను, రాజ్యాన్ని ప్రశ్నించి సమూలంగా మార్చే విప్లవం అవుతుందా? పై నుంచి అది సాధ్యమేనా – అనేది ఒక ప్రశ్న. వాస్తవమేనా అనేది మరో ప్రశ్న. అది అవినీతి విషవృక్ష మూలమైన కంపెనీ పాలనను ప్రశ్నించకుండా విషఫలాలను పంచుతున్న పాలకులనే ప్రశ్నించడంలోని రహస్యమేమిటి? పార్లమెంట్ ప్రజాస్వామ్యంలో ఓంబుడ్స్‌మాన్ కూడా పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని భద్రంగా కాపాడడానికే ఉంటాడు – తక్కువ అంగాలతో పాటు. జయప్రకాశ్ నారాయణ్‌ను లోక్‌నాయక్ అన్నారు. జనలోక్ నాయక్ అనలేదు. అందువల్ల లోక్‌పాల్ బిల్లు కాస్త జనలోక్‌పాల్ అయినంత మాత్రాన మిన్ను విరిగి మీదపడి మీది నుంచి విప్లవం రాదు. కింది నుంచి విప్లవం రాకుండా దృష్టి మళ్లించడానికి ఇవ్వాళ వ్యవస్థ ఒక నిరసన (డిసెంట్)ను ఉత్పత్తి చేస్తున్నది. ఒబామా రూపంలో అమెరికా సృష్టించిన భ్రమ బుడగ వలె పేలిపోవడం చూస్తున్నాం. ఇంటా బయటా ఇదే ప్రపంచీకరణ భ్రమావరణం.

*(రచయిత విప్లవ రచయితల సంఘం సభ్యులు)* వీ

పెరిగిపోయింది. ముఖ్యమైన పైర్ల విత్తనాల సరఫరాలలో విదేశీ కంపెనీల వాటా 30 నుంచి 80 శాతం వరకు ఉంది. ఒట్టి పత్తి విత్తనాల్లో మాన్‌శాంటో విదేశీ కంపెనీ వాటా 95 శాతం. ఈ కంపెనీ రైతాంగాన్ని నిలువునా దోపిడీ చేస్తోంది. గతంలో ఒక ఎకరానికి కావాల్సిన సూటి రకాలయిన పత్తి విత్తనం ఖర్చు పది రూపాయలు. హైబ్రిడ్ విత్తనాలపై ఒక ఎకరానికి 250 నుండి 300 రూపాయల వరకు ఖర్చు అయ్యేది. బిటి పత్తి విత్తనాల ఖర్చు ఒక ఎకరానికి 1700 – 1800 రూపాయలు. అనేక ఇతర పైర్ల వితనాల వ్యాపారంలో విదేశీ కంపెనీలు రైతాంగాన్ని భారీగా దోచుకుంటున్నాయి. రసాయనిక ఎరువుల వినియోగం భారీగా పెరిగింది. దిగుమతులు పెరిగాయి. ఎరువుల ధరలకు రెక్కలొచ్చాయి. రైతులు ఎరువుల్ని కొనలేకపోతున్నారు. రసాయనిక ఎరువులు వేయక పోతే, పంటలు పండే పరిస్థితి లేదు. అలాగే పురుగు మందుల ఉత్పత్తి, వ్యాపారంలో దాదాపు 90 శాతం విదేశీ కంపెనీల అధీనంలో జరుగుతున్నాయి. ఉత్పాదకాల సరఫరాలో ఏ స్వదేశీ కంపెనీ, విదేశీ కంపెనీలతో పోటీపడే స్థితిలో లేదు. ఒనోగిల్, మోన్‌శాంటో, డుపాంట్, సింజెంటా, అవంటీస్, బి.ఎ.ఎస్.ఎఫ్., బేయర్ మొదలైనవి ముఖ్యమైన విదేశీ కంపెనీలు.

ప్రపంచీకరణ బహుళజాతి కంపెనీలకు, దేశీయ బడా కంపెనీలకు అనుకూలంగా వ్యవసాయ రంగాన్ని మార్చివేసింది. వ్యవసాయం నష్టాలతో కూడుకున్నది, రైతులకు చేతినిండా పని ఇవ్వజాలదు. కొత్త సాంకేతిక పద్ధతులను చిన్న రైతులు అవలంబించ లేరు. చిన్న రైతుల ఆదాయాలు అత్యల్పంగా ఉంటాయి. వారు దుర్భర జీవితం గడుపుతున్నారు, వారిని రక్షించాలంటే కంపెనీ సేద్యమే శరణ్యం' అని బహుళజాతి కంపెనీలు, దేశీయ కంపెనీలు ప్రచారం చేస్తున్నాయి. ప్రభుత్వం కూడా వీటికి అన్ని విధాలా సహకరిస్తోంది. కంపెనీ సేద్యం ఫలితంగా రైతులు ఉపాధి కోల్పోతారు. భూములు కోల్పోతారు. వాణిజ్య పంటలకు ప్రాధాన్యత ఇవ్వడం ద్వారా ఆహార అభద్రత తీవ్రమవుతోంది. కంపెనీ సేద్యంతో పాటు కాంట్రాక్ట్ సేద్యాన్ని కూడా కంపెనీలు భారీ ఎత్తున ప్రవేశపెట్టడానికి ప్రయత్నిస్తున్నాయి. కాంట్రాక్ట్ సేద్యం వల్ల రైతులు భారీగా నష్టపోయారనే నివేదికలు తెలుపుతున్నాయి. ప్రభుత్వం నాబార్డు ద్వారా ఉత్పత్తిదారుల కంపెనీలను ఏర్పాటు చేసే కార్యక్రమాన్ని ప్రారంభించింది. ఈ రెండు రకాల సేద్య వ్యవస్థలు కంపెనీలకు లాభాలు, రైతులకు నష్టాలు కలిగించేవే.

ప్రపంచీకరణలో వ్యవసాయ ఎగుమతులకు ప్రోత్సాహమివ్వడం జరిగింది. ధనిక దేశాల ప్రజలకు అవసరమైన వ్యవసాయ ఉత్పత్తులను పండించడాన్ని ప్రోత్సహిస్తున్నారు. ఆహార ధాన్యాల స్థానే ఎగుమతుల కొరకు ఉద్దేశించబడ్డ పంటలను, వాణిజ్య పంటలను సాగు చేయడానికి రైతులను పురికొల్పుతున్నారు. దీని ఫలితంగా ఆహార సమస్య తలెత్తుతోంది. ముఖ్యంగా ప్రజలకు పౌష్టిక ఆహారం దొరకడం లేదు. పేద ప్రజలకు ప్రోటీన్లు పప్పు ధాన్యాల ద్వారానే లభిస్తాయి. అయితే, పప్పు ధాన్యాల ఉత్పత్తిలో పెరుగుదల లేదు. తలసరి వినియోగం కూడా తగ్గిపోయింది. పోషకాహారం దొరకనందు వల్ల పేద ప్రజలు రోగ గ్రస్తులవుతున్నారు. 70 శాతం మంది పిల్లలు, 55 శాతం మహిళలు రక్తహీనతతో బాధపడుతున్నారు. ప్రతి వెయ్యి మంది పిల్లల్లో 53 మంది పిల్లలు పుట్టిన వెంటనే చనిపోతున్నారు.

ప్రపంచీకరణ విధానంలో ముఖ్యమైనది ప్రైవేటీకరణ. విద్యా, వైద్య రంగాల్లో గత ఇరవై ఏళ్లలో ప్రైవేటీకరణ విజృంభించింది. వైద్య రంగంపైన ప్రభుత్వం ఖర్చు భారీగా పడిపోయింది. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు, ప్రభుత్వ ఆస్పత్రులు ప్రభుత్వ నిరాదారణకు గురి అయ్యాయి. ప్రజలకు ప్రైవేట్ ఆస్పత్రులకు పోక తప్పడం లేదు. వైద్యం పైన అత్యధికంగా ఖర్చు పెట్టాల్సి వస్తోంది. పేద ప్రజలు అప్పుల పాలవుతున్నారు. వైద్యం చేయించుకోలేక అనేకమంది మరణాల పాలవుతున్నారు. కార్పొరేట్ ఆస్పత్రులు జనాన్ని దోపిడీ చేస్తున్నాయి.

ఇదే విధానం విద్యారంగంలోనూ కొనసాగుతోంది. కొనగలగిన వారికే విద్య దక్కుతోంది. విదేశీ విద్యాలయాలు దేశంలోకి వచ్చాయి. భారీగా ఫీజులు వసూలు చేసి, వారికి అనుకూలమైన విద్యా విధానాన్ని ప్రవేశపెడుతున్నాయి. పాఠ్యాంశాల్ని పూర్తిగా మార్చివేస్తున్నాయి. మన సాహితీ సంస్కృతులకు తిలోదకాలిస్తున్నాయి. విదేశీ విష సంస్కృతి ప్రభావంలో ప్రజలు, ముఖ్యంగా యువత కొట్టుకుపోతున్నారు.

ప్రపంచీకరణ ప్రజల్ని దారుణంగా దెబ్బతీసింది. గతంలో ఆర్థికాభివృద్ధి రేటు 4 శాతం ఉంటే, ఉపాధి పెరుగుదల రేటు 2 శాతం ఉండేది. ప్రస్తుతం ప్రపంచీకరణ జరిగిన ఇరవై ఏళ్లలో ఆర్థికాభివృద్ధి దాదాపు 8 శాతం ఉంటే, ఉపాధి పెరుగుదల రేటు 1 శాతం కంటె తక్కువగా ఉంది. అంటే మన అభివృద్ధి ఉపాధి రహిత అభివృద్ధిగా పరిగణించాలి. అంతేకాదు, ఈ అభివృద్ధి నమూనా మహా క్రూరమైనది. పరిశ్రమలు, ప్రత్యేక ఆర్థిక మండలాలు, వాణిజ్య సముదాయాలు, గనుల తవ్వకం పేరిట లక్షలాది మంది ప్రజల్ని తమ గ్రామాల నుండి, నివాసాల నుండి, భూముల నుండి వెళ్లగొడుతున్నారు. ప్రజలు జీవనోపాధి కోల్పోయి, నిర్వాసితులు, అనాథలవుతున్నారు. ఖనిజాల కోసం ఆదివాసు లను అడవుల నుండి తరిమివేయడానికి పాలకులు కుట్ర చేస్తున్నారు. పోలీసు, మిలిటరీ బగలాలను ఉపయోగిస్తున్నారు. ప్రజలు ముఖ్యంగా ఆదివాసులు మధ్య భారత ప్రాంతాల్లో తీవ్రంగా ప్రతిఘటిస్తున్నారు.

ప్రపంచీకరణ విధానాల ఫలితంగా వివిధ రంగాల మధ్య, వర్గాల మధ్య అసమానతలు తీవ్రంగా పెరిగాయి. పెట్టుబడులు కొన్ని రంగాల్లో ముఖ్యంగా సమాచార, సాంకేతిక లాంటి సేవా రంగాల్లో పెరిగాయి. వ్యవసాయ రంగంలో తగ్గాయి. అందువల్ల వ్యవసాయం, వ్యవసాయేతర, ముఖ్యంగా సేవారంగాల మధ్య ప్రజల ఆదాయాల్లో అసమానతలు పెరిగాయి. పరిశ్రమల యజమానులు, కార్మికుల మధ్య అసమానతలు పెరిగాయి. గ్రామీణ, పట్టణ ప్రాంతాల ప్రజల ఆదాయాల్లో భారీగా, అసమానతలున్నాయి. ఇతర సామాన్య ప్రజలతో పోలిస్తే, ఉద్యోగస్తుల, ముఖ్యంగా, ఉన్నత ఉద్యోగులు, సమాచార సాంకేతిక రంగంలోనూ, ద్రవ్య లేదా ఆర్థిక సంస్థల్లోనూ పనిచేస్తున్న వారి జీత భత్యాలు అత్యధికంగా ఉంటూ, ఆదాయాల్లో అసమానతలు భారీగా ఉన్నాయి. కొంతమంది కార్పొరేట్‌ల యజమానులు కోట్ల రూపాయలను జీతభత్యాలుగా తీసుకుంటుంటే, దాదాపు 77 శాతం మంది అసంఘటిత కార్మికులు, అంటే దాదాపు 50 – 60 కోట్ల మంది రోజుకు ఇరవై రూపాయల కంటే తక్కువ ఆదాయంతో జీవిస్తున్నారు. (అర్జున్ సేన్ గుప్తా కమిటీ రిపోర్ట్ ప్రకారం.) పేద ప్రజల సంఖ్య, పేదరికం స్థాయి గత కొద్ది సంవత్సరాలుగా పెరుగుతూనే ఉంది.

*ఇరవై ఏళ్లుగా సాగుతున్న ప్రపంచీకరణ పట్ల విభిన్న స్పందనలను ఇవాళ్టి స్థితిని వివరిస్తున్నారు*

**ఎన్. వేణుగోపాల్**

# ప్రపంచీకరణ - ఇవాళ్టి స్థితి

దేశంలో నూతన ఆర్థిక విధానాల పేరుతో సామ్రాజ్యవాద ప్రపంచీకరణ విధానాలు మొదలై ఇరవై సంవత్సరాలు గడిచాయి. ఈ ఇరవై సంవత్సరాలలో తెలుగులోనూ, ఇతర భారతీయ భాషలలోనూ, ఇంగ్లిషులోనూ ప్రపంచీకరణ గురించి కుప్పలుతెప్పలుగా వ్యాఖ్యానాలు, వివరణలు, విమర్శలు, సమర్థనలు, విశ్లేషణలు వచ్చాయి. బహుశా భారతీయ భాషలన్నిటిలోనూ తెలుగులోనే అతి ఎక్కువ సాహిత్యం వచ్చి ఉంటుంది. ఈ సందర్భంగా ఇప్పటివరకూ ప్రపంచీకరణ మీద వెలువడిన ప్రతిస్పందనలను, వాటి వెనుక ఉన్న దృక్పథాలను పరిశీలించడం ఆసక్తికరంగా ఉంటుంది. అలాగే రెండు దశాబ్దాల ప్రపంచీకరణ విధానాలు దేశంలోని వివిధ వర్గాల మీద ఎటువంటి ప్రభావాన్ని వేశాయో, ఏ ఫలితాలకు చేరాయో, ఇవాళ్టి స్థితి ఏమిటో, ఈ పరిస్థితి ఎటువైపు దారితీయగలదో అంచనా కట్టడం కూడ ఉపయోగకరంగా ఉంటుంది.

ప్రపంచీకరణ గురించి ఇప్పటికి వెలువడిన ప్రతిస్పందనలు స్థూలంగా ఐదు రకాలుగా ఉన్నాయి. అవి

1. ప్రపంచీకరణ దేశ ఆర్థిక వ్యవస్థకు అవసరం, అది ఈ దేశాన్ని ప్రపంచ ఆర్థిక వ్యవస్థతో సమ్మిళితం చేసి, దేశానికి అవసరమైన ఆర్థిక, పారిశ్రామిక, సాంకేతిక వనరులను సమకూర్చి, దేశాన్ని ప్రగతిపథంలో నడిపించి, ప్రజలకు సౌభాగ్యాన్ని ఇస్తుంది. దేశం ఈ ప్రపంచీకరణ పథంలో ఇంకా ముందుకు సాగాలి.

2. ప్రపంచీకరణ విధానాలను ఎవరు తెచ్చినా, ఎందుకు తెచ్చినా దాని వల్ల కొత్త సరుకులు, కొత్త అంతర్జాతీయ సంబంధాలు, కొత్త అవకాశాలు వచ్చాయి గనుక వాటిలోని అనుకూలాంశాలను ప్రజా సంక్షేమం కొరకు ఉపయోగించుకోవాలి. అందువల్ల ప్రపంచీకరణ గురించి చర్చ అనవసరం. ఆమోదించి ఆహ్వానించడం అనివార్యం.

3. ప్రపంచీకరణ స్థూలంగా ప్రతికూలమైనదే, దేశ వ్యతిరేకమైనదే గాని అది అనివార్యమైనది, దాన్ని ఎదిరించలేం గనుక దాన్ని ఉపయోగించుకోవడానికి ప్రయత్నించాలి. అంటే ప్రపంచీకరణ ఆమోదించక తప్పని ప్రమాదం. ఆ ప్రమాదం గురించి చర్చ చేసినా, దాన్ని ఆపడానికి చేయగలిగిందేమీ లేదు.

4. ప్రపంచీకరణ స్థానికంగా అవసరమై రాలేదు, దేశంలో అమలవుతున్న నెహ్రూ పంథా సోషలిజాన్ని ధ్వంసం చేయదలచిన విదేశీ శక్తులు ఈ విధానాలను మనమీద రుద్దాయి. ఆ మేరకు అవి దేశ సార్వభౌమత్వాన్ని రద్దు చేశాయి. సార్వభౌమత్వాన్ని కాపాడుకుంటూ ప్రపంచీకరణలోని అనుకూలాంశాలను స్వీకరిస్తూ, ప్రతికూలాంశాలను వ్యతిరేకించాలి.

5. ప్రపంచీకరణ సామ్రాజ్యవాద దోపిడీ పీడనలలో అంతర్భాగం, దానికి స్థానిక పాలక వర్గాల వత్తాసు కూడ ఉంది. అది పిడికెడు మంది దోపిడీ పాలకవర్గాలకూ, వారి వెనుక ఉన్న సామ్రాజ్యవాద బహుళజాతి సంస్థలకూ మాత్రమే మేలు చేస్తుంది. అది ప్రస్తుత దోపిడీ పీడనల వ్యవస్థ మనుగడకు అవసరమైనది, అంటే ప్రజలకు వ్యతిరేకమైనది. ప్రాణాలు ఒడ్డి అయినా ప్రతిఘటించవలసినది. స్థానిక పాలకవర్గాలనూ, సామ్రాజ్యవాద శక్తులనూ ఓడించగల విశాల ప్రజారాశుల ఐక్య పోరాటమే ప్రపంచీకరణను రద్దు చేయగలుగుతుంది.

ఈ ప్రతిస్పందనలను మరో మాటల్లో చెప్పాలంటే: 1. ప్రపంచీకరణ ప్రజానుకూలమైనది 2. ప్రపంచీకరణతో హెచ్చు

---

ప్రపంచీకరణ విధానాల అమలు ఫలితంగా బహుళజాతి కంపెనీలు తమ వాణిజ్య వ్యాపారాల ద్వారా దేశ ప్రజలను దోచుకున్నాయి. ద్రవ్య పెట్టుబడుల ద్వారా మన వ్యాపారాన్ని శాసిస్తున్నాయి. వ్యవసాయోత్పత్తుల దిగుమతులు మన వ్యవసాయ రంగాన్ని దెబ్బతీసాయి. మన సహజ వనరులైన భూమి, నీరు, అడవులు, గనులపైన పెత్తనం సంపాదించుకుని, వీటిని కొల్లగొట్టుతున్నాయి. తమ ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉపయోగించుకుని లాభాలు గడిస్తున్నాయి. బహుళజాతి కంపెనీలు తమ ప్రభుత్వాల ద్వారా మన దేశంలో చట్టాల్ని కూడా మార్పించి వేశాయి. పేటెంట్ హక్కుల సవరణ చట్టం, రైతుల, ప్లాంట్ బ్రీడర్స్ హక్కుల పరిరక్షణ చట్టం, జీవశాస్త్ర సాంకేతిక నియంత్రణ చట్టం, విత్తన చట్టం, మార్కెట్ చట్టానికి సవరణలు – ఇవన్నీ కూడా రైతుల హక్కుల పరిరక్షణ కంటే, బహుళజాతి కంపెనీల దోపిడీకి చట్టబద్ధత కల్పించేవే. ప్రపంచీకరణ వల్ల ప్రజలకి వచ్చిన లాభాలు గోరంత అయితే నష్టాలు కొండంత. మిలాఖత్‌దారులు, ధనిక రైతులు, ఉన్నతోద్యోగులు, సమాచార సాంకేతిక రంగంలోనివారు, అవినీతిపరులైన రాజకీయ వాదులు కొంతవరకు లాభంపొంది ఉండవచ్చును. కానీ జనాభాలోని అన్ని వర్గాల ప్రజలు నష్టపోయారు. భారీగా దోపిడీకి గురి అయ్యారు. అందువల్ల, ప్రపంచీకరణకు వ్యతిరేకంగా పోరాడాల్సిన కర్తవ్యం ప్రజల ముందు ఉంది.

*(రచయిత వ్యవసాయ శాస్త్రవేత్త)* వీ

అవకాశాలు వచ్చాయి. 3. ప్రపంచీకరణను ఆమోదించడం తప్ప గత్యంతరం లేదు. 4. ప్రపంచీకరణతో సోషలిజం, సార్వభౌమాధికారం ధ్వంసమయ్యాయి, అలా జరగనంతవరకు ప్రపంచీకరణను ఆమోదించ వచ్చు, 5. ప్రపంచీకరణ ప్రజావ్యతిరేకమైనది, ఓడించవలసినది.

మొదటి మూడు వైఖరులూ ప్రత్యక్షంగా గాని, పరోక్షంగా గాని ప్రపంచీకరణను ఆమోదించే వైఖరులే కాగా, నాలుగో వైఖరి ప్రపంచీకరణను మాటల్లో వ్యతిరేకిస్తూ చేతల్లో ఆమోదించే అవకాశవాద వైఖరి, చివరి వైఖరి మాత్రమే దాన్ని ప్రతిఘటించాలనీ, ఓడించాలనీ వాదించే వైఖరి.

ప్రపంచీకరణ ప్రజానుకూలమైనదనే వైఖరి ప్రధానంగా పాలక వర్గాలది. గత ఇరవై సంవత్సరాలలో సాగిన ప్రపంచీకరణ విధానాలు అడుగడుగునా ఈ దేశ వనరులను సామ్రాజ్యవాద బహుళజాతి సంస్థలకు ఎలా దోచిపెట్టాయో, ఈ దేశ ప్రజాజీవనాన్ని ఎంత ధ్వంసం చేశాయో ఏ ఒక్క రంగంలో ఏ ఒక్క ఉదాహరణ చూసినా పాలకవర్గాల వాదన పచ్చి అబద్ధమని తేటతెల్లమవుతుంది. ప్రపంచీకరణ విధానాలు వ్యవసాయ రంగాన్ని దెబ్బతీశాయి, వ్యవసాయ రంగంలో మౌలిక సౌకర్యాల కల్పన జరగకుండా చేశాయి. లక్షల ఎకరాల భూమిని బహుళ జాతి సంస్థలకు పందారం చేశాయి. ఆహారపంటలను దెబ్బతీసి, అంతర్జాతీయ మార్కెట్‌కు అవసరమైన పంటలకు పెద్దపీట వేశాయి. మధ్యతరగతి, పేద రైతుల ఆత్మహత్యలకు కారణమయ్యాయి. కోట్లాది మంది రైతులను, నిరుపేద వ్యవసాయ కూలీలను నిరాశ్రితులుగా పట్టణాలకు పంపించాయి. ప్రభుత్వ రంగ కార్మికులను వీధులపాలు చేశాయి. ప్రైవేటురంగంలోని మధ్యతరహా, చిన్న పరిశ్రమలను ధ్వంసం చేసి కోట్లాది కార్మిక కుటుంబాలను అన్నార్తులను చేశాయి. విద్యా, వైద్య, సాంఘిక సంక్షేమ రంగాల కేటాయింపుల కోత విధించి అసంఖ్యాక పేద ప్రజానీకానికి కనీస ఉపశమనం లేకుండా చేశాయి. ఇలా జాబితా రాస్తూపోతే ఈ ఇరవై సంవత్సరాల ప్రభుత్వ విధానాలన్నీ ప్రజా వ్యతిరేకమైనవని స్పష్టమవుతుంది. ప్రపంచీకరణ కార్యక్రమంలోని ఏ ఒక్క చిన్న అంశం కూడ ప్రజా జీవనానికి మేలు చేయలేదు. మేలుగా బయటికి కనబడినవి కూడ నూటికి తొంబై తొమ్మిది పాళ్లు పాలకులకూ సంపన్నులకూ మేలు చేసి, మిగిలిన ఒక్క శాతం కొసరుగా ఉన్నత మధ్యతరగతికో, దిగువ మధ్యతరగతికో ఎంగిలి మెతుకులుగా విదిల్చినవి. అంటే సారాంశంలో ప్రజాజీవనానికి అతి భయంకరమైన కీడు చేసినవే.

ఇక ప్రపంచీకరణ వల్ల దేశంలోకి కొత్త సరుకులు, కొత్త అంతర్జాతీయ వ్యాపార సంబంధాలు, కొత్త అవకాశాలు వచ్చాయని, వాటితో ప్రజాజీవితం మెరుగుపడిందని దాదాపు ప్రచార సాధనాలు, ప్రపంచీకరణ సమర్థక శక్తులు పెద్ద ఎత్తున ప్రచారం చేస్తున్నాయి. నోరున్న, వినిపించే అవకాశం ఉన్న మధ్యతరగతి కూడ ఈ ప్రయోజనాలను ఎంతో కొంత అనుభవించింది గనుక ఈ ప్రచారం మరింతగా ముందుకు సాగుతోంది. సెల్ ఫోన్లు, ఆధునిక రవాణా సౌకర్యాలు, సమాజంలో డబ్బు ప్రవాహం, నిర్మాణ రంగం పెరుగుదల, టెలివిజన్ వంటి ప్రసారసాధనాల పెరుగుదల, అత్యాధునిక జీవన శైలులు, ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ, బయోటెక్నాలజీ తదితర సేవా రంగాలలో ఇతోధిక ఉద్యోగకల్పన వంటి 'ఆధారాలను' చూపి, ఈ మార్పులన్నిటినీ ప్రపంచీకరణ విధానాల ఖాతాలో వేసి, అందువల్ల ప్రపంచీకరణను సమర్థించే వాదనలు వినిపిస్తున్నాయి.

పైకి చూడడానికి, ముఖ్యంగా నగరజీవనంలో, వాస్తవాలుగా కనిపించే ఈ వాదనలను లోతుగా చూడవలసి ఉంది. 'రూపమే సారం కాదు' అనే తాత్విక భావనను దృష్టిలో పెట్టుకుంటే, రూపంలో కనబడుతున్న ఈ మార్పులన్నిటి సారం ఏమిటని ఆలోచించవలసి ఉంది. ఈ కొత్త సరుకులు, కొత్త అంతర్జాతీయ వ్యాపార సంబంధాలు, కొత్త అవకాశాలు ఎవరికోసం వచ్చాయి, ఎవరికి మేలు చేస్తున్నాయి, ఇవి ప్రజా అవసరాలను తీర్చడానికి వచ్చాయా, అమ్మకందార్లకు మార్కెట్లను, లాభాలను ఇవ్వడానికి వచ్చాయా, ప్రపంచీకరణ విధానాలను అమలు చేయకపోతే ఇవి వచ్చేవి కావా వంటి అనేక ప్రశ్నలకు జవాబులు అన్వేషించినప్పుడే ఈ వాదనలోని లోటుపాట్లు తెలుస్తాయి.

మన మార్కెట్లలోకి కొత్త సరుకుల ప్రవేశం మన అవసరాలను తీర్చడానికే అనే ఒక అబద్ధాన్ని, భ్రమను సామ్రాజ్యవాద ప్రచారసాధనాలు మన మధ్యతరగతిలో బలంగా ప్రవేశపెట్టగలిగాయి. కాని మన దేశం నుంచీ, ఇతర లాటిన్ అమెరికా, ఆఫ్రికా, ఆసియా దేశాలనుంచీ సహజ వనరులనూ, ప్రజల నెత్తుటినీ చెమటనూ డాలర్లుగా దోచుకుపోయే మహా వ్యూహం పేరే ప్రపంచీకరణ. ఇందులో దోపిడీ ఏముందనీ, వాళ్లు సరుకులు ఇస్తే మనం డాలర్లు ఇస్తున్నామనీ, వాళ్లు మన అవసరాలు తీరుస్తున్నారనీ, అందువల్ల వాళ్లకు మనం కృతజ్ఞులమై ఉండాలనీ వాదించేవారు కూడ ఉన్నారు. పెట్టుబడిదారీ సరుకు తన మార్కెట్ ను తానే సృష్టించుకుంటుందన్నట్టుగా, సామ్రాజ్యవాద పరిశ్రమలు తయారుచేసిన చాల సరుకులు మార్కెట్లను వెతుక్కుంటూ వచ్చాయి. ప్రచారంతో, అబద్ధాలతో ఆకర్షించి, కొనుగోలుశక్తి లేకపోతే వాయిదాల పద్ధతి మీదనో, అత్యధిక రాయితీలతోనో అంటగట్టి మార్కెట్లను సృష్టించుకున్నాయి. నిజంగా మనకు ఆ సరుకులు వాడవలసిన అవసరం లేకపోయినా కల్పించాయి. ఆ అవసరం అతి తక్కువగా ఉంటే వందలరెట్లు పెంచి చూపించాయి. అలా కొత్తసరుకుల అలవాట్లను మనకు మప్పి, ఆ సరుకు వాడకపోతే మనం సగటు మనుషులమే కామని మనచేత నమ్మించాయి. ఇరవై సంవత్సరాల తర్వాత ఒక్కసారి ఆగి మనం వాడుతున్న కొత్త సరుకులు మనకు ఎంత అవసరమో, అవి మన అవసరాలను ఎంతగా తీరుస్తున్నాయో సమీక్షించు కుంటే ఎవరికి వారికే ప్రపంచీకరణ ఏం చేసిందో అర్థమవుతుంది. సామ్రాజ్యవాద బహుళ జాతి సంస్థల లాభాలలోని ప్రతి డాలర్ మీదా మనం వాడే సరుకుల ద్వారా ప్రవహిస్తున్న మన నెత్తురూ చెమటా అంటి ఉందని అర్థమవుతుంది.

ఆ సరుకులు నిజంగా మనకు అవసరమైనా అవి మనదేశంలోనే తయారు చేయలేమా అని కూడ ఆలోచించాలి. మన దగ్గర దొరికే ఖనిజాలతో, మన శ్రామిక వనరులతో, చాలవరకు మనకు తెలిసిన సాంకేతిక పరిజ్ఞానంతోనే తయారయిన సరుకులు కేవలం బహుళ జాతి సంస్థల బ్రాండ్ల వల్ల, ఈ దేశ పాలక విధానాలు ఆ బహుళ జాతి సంస్థలకు ఊడిగం చేస్తున్నందువల్ల లాభాలు దండుకుంటున్నాయి. అవి మనమే తయారుచేస్తే మన దగ్గర పరిశ్రమలు పెరుగుతాయి, మన ఉద్యోగ కల్పన పెరుగుతుంది, అంతర్జాతీయ బ్రాండింగ్, ప్రచార వ్యయం తగ్గితే ఆ మేరకు ఆ సరుకుల ధరలూ తగ్గుతాయి. భారతదేశం వంటి విశాల, సంపన్న వనరులు ఉన్న దేశం ఇతర దేశాలకు, ఆ సరుకులు తయారు చేసుకునే అవకాశం లేని దేశాలకు ఆ సరుకులు ఎగుమతి చేసి విదేశీ మారకద్రవ్యం కూడ సంపాదించవచ్చు.

అంటే వ్యక్తిగత స్థాయిలో ఆ సరుకులు మనకు అవసరమా లేదా అని చూసినా, దేశ ఆర్థిక వ్యవస్థ స్థాయిలో ఆ సరుకులు అవసర మైనా మనమే ఉత్పత్తి చేయలేమా అని చూసినా, కొత్త సరుకుల కోసమే ప్రపంచీకరణ అనే వాదన దివాళాకోరు వాదన అని తేలిపోతుంది.

ఇక ఒక దేశానికి అంతర్జాతీయ సంబంధాలు ఎప్పుడైనా అవసరమే. కాని అవి అసమానత పునాదిగా ఉండగూడదు. ప్రపంచీకరణ విధానాలు మనదేశానికి ఇతర దేశాలతో కొత్త అంతర్జాతీయ సంబంధాలనేమీ కల్పించలేదు. పాత అంతర్జాతీయ సంబంధాలలో కొత్త అసమానతలను ప్రవేశ పెట్టాయి, పాత అసమానత లను ఇనుమడింపజేశాయి. కనుక ప్రపంచీకరణ వల్ల వచ్చిన ఒక మేలుగా కొత్త అంతర్జాతీయ సంబంధాలను చూపడం కూడ దాన్ని సమర్థించడానికి ఉపయోగపడే వాదన కాదు.

ప్రపంచీకరణ సమర్థకుల వాదనలలో ప్రధానమైనది, సమాజం లోకి ఈ ఇరవై సంవత్సరాలలో వచ్చిన కొత్త ఉపాధికల్పనా రంగాలు, ఉద్యోగాలు. ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ, బయో టెక్నాలజీ, ఫైనాన్స్, ఇన్సూరెన్స్, లాజిస్టిక్స్, రియల్ ఎస్టేట్, నిర్మాణం వంటి కొత్తా పాతా రంగాలలో ఉద్యోగకల్పన పెరిగిందనీ, ఈ రంగాలలో విదేశీ సంస్థల శాఖలు, అనుబంధ సంస్థలు రావడం వల్ల జీతభత్యాలు పెరిగాయనీ, విదేశీ ఉద్యోగావకాశాలు పెరిగాయనీ ప్రపంచీకరణ సమర్థకులు వాదిస్తున్నారు. నగరాలలోనూ, మధ్యతరగతిలో ఒక భాగంలోనూ ఈ పరిణామాలు జరిగినట్టే కనబడుతున్నాయి. కాని ఈ రూపానికి కూడ చూడవలసిన ఇతర కోణాలూ ఉన్నాయి, భిన్నమైన సారమూ ఉంది. దేశవ్యాప్తంగా సంఘటిత రంగ ఉద్యోగాల గురించి రిజర్వ్ బ్యాంక్ నివేదిక ప్రకారమే, 1991-92లో ప్రభుత్వ రంగంలో 1.93 కోట్ల ఉద్యోగాలు, ప్రైవేట్ రంగంలో 78 లక్షల ఉద్యోగాలు ఉండేవి. తాజా గణాంకాల ప్రకారం 2006-07 నాటికి ప్రభుత్వరంగంలో ఉద్యోగాలు 1.80 కోట్లకు పడిపోగా, ప్రైవేట్ రంగంలో 92 లక్షలకు పెరిగాయి. అంటే ప్రభుత్వ రంగ6లో 13 లక్షల ఉద్యోగాలు తగ్గిపోగా, ప్రైవేట్ రంగంలో 14 లక్షల ఉద్యోగాలు చేరాయన్నమాట. హళ్లికి హళ్లి సున్నకు సున్న. ఇది ఇలా ఉండగా ప్రపంచీకరణ మొదలయినప్పుడు 3.67 కోట్లుగా ఉన్న నమోదయిన నిరుద్యోగుల సంఖ్య 2006-07 నాటికి 3.99 కోట్లకు చేరింది. ఈ రిజర్వ్ బ్యాంక్ గణాంకాల ప్రకారమే కొత్త ఉద్యోగ కల్పన ఎంత బూటకమో అర్థమవుతుంది. అయితే అసంఘటిత రంగంలో, గృహ రంగంలో, ఉద్యోగ భద్రత, సంక్షేమం లేని రంగాలలో కొంత ఉద్యోగ కల్పన పెరిగింది. కాని అవి సుస్థిరమైన ఉద్యోగాలు కాదు గనుక వాటిని ఉద్యోగాలుగా లెక్కించడానికే వీలులేదు.

ఈ ఉద్యోగాలు కేవలం కొన్ని రంగాలలోనే రావడం వల్ల దేశంలోని నిరుద్యోగ మహా సముద్రంలో అక్కడక్కడ ద్వీపాలు ఏర్పడ్డాయి. ఉన్నత విద్యావంతులకో, బహుళజాతి సంస్థలకు అవసరమైన నైపుణ్యాలు ఉన్నవారికో మాత్రమే ఈ ఉద్యోగాలు వచ్చాయి. అందులోనూ ఎక్కడ ఉద్యోగులను పెట్టుకుంటే తమ లాభాలరేటు పెరుగుతుందో చూసి అక్కడికి తరలివెళ్లే బహుళజాతి సంస్థల వల్ల ఈ ఉద్యోగ కల్పన కాలునిలవని పెట్టుబడి పెరుగుదలలో భాగంగానే జరిగింది.

మరొక ప్రపంచీకరణ అనుకూల వాదన, పైకి చూడడానికి ప్రపంచీకరణ ప్రమాదాన్ని గుర్తించినట్టే ఉంటుంది గాని, ప్రపంచీకరణను ఆమోదించక తప్పదనే నిరాశావాదాన్ని ప్రచారం చేసి ప్రపంచీకరణను సమర్థించే ఫలితానికే దారితీస్తుంది. ప్రపంచీకరణను ఎదిరించలేం గనుక దాన్ని ఉపయోగించుకోవడానికి ప్రయత్నించాలనీ, దాన్ని ఆపడానికి చేయగలిగిందేమీ లేదనీ సాగే ఈ వాదన కొందరు మేధావులనుంచి వచ్చినా, సాధారణ ప్రపంచీకరణ వ్యతిరేకులలో కూడ ఆమోదం పొందుతోంది. నిజానికి ప్రపంచీకరణను ఆపలేమనీ, అది అనివార్యమనీ చేసే వాదనకు అర్థం లేదు. ప్రపంచీకరణ అనివార్యం అయినదెవరికి అనే ప్రశ్న వేసుకుని నిజాయితీగా జవాబు చెప్పుకుంటే ఈ వాదనలోని డొల్లతనం బయటపడుతుంది. దానివల్ల లాభపడేవారికి అది అనివార్యం కావచ్చు గాని, నష్టపోయేవారు మాత్రం దాన్ని అనివార్యం అనుకోలేరు. వారు దాన్ని ఆపే ప్రత్యామ్నాయాలను వెతకవలసిందే. పాలకవర్గాలు, ప్రభుత్వాలు, వ్యవస్థా నిర్వాహకులు ప్రత్యామ్నాయాలు లేవన్నంతమాత్రాన ప్రత్యామ్నాయాలు లేకుండా పోవు. ప్రపంచీకరణ విధానాలను రుద్దడానికి బహుళ జాతి సంస్థలు, అంతర్జాతీయ ద్రవ్య సంస్థలు, సామ్రాజ్యవాద ప్రభుత్వాలు ప్రయత్నిస్తున్నప్పుడు దేశీయ పాలకవర్గాలు కూడ వాటిని శిరసావహిస్తున్నప్పుడు ప్రజలు, ప్రజలు మాత్రమే, దీర్ఘకాలికంగా గాని, తక్షణమే గాని ఆ విధానాలలో కొన్నిటిని అడ్డుకోవడం సాధ్యమవుతుంది, వాయిదా వేయించడం సాధ్యమవుతుంది. ప్రభుత్వాలు వాటిని అంగీకరించకుండా ప్రతిఘటించడం సాధ్యమవుతుంది. క్రమక్రమంగా ప్రజాశక్తి బలపడితే అసలు మొత్తంగానే ప్రపంచీకరణ విధానాలను ఓడించడం సాధ్యమవుతుంది.

ఇదంతా కేవలం ఊహ కాదు, ఇతర దేశాల ఉదాహరణలు కూడ చూడనక్కరలేదు. మన దేశంలోనే, ఇటీవలి చరిత్రనే చూస్తే, మధ్యభారతంలోని ఖనిజ నిలువలను బహుళ జాతి సంస్థలకు అప్పగించడానికి ప్రభుత్వాలు ఒప్పందాలు కూడ చేసుకున్నప్పుడు, ఆ ఒప్పందాలు అమలులోకి రాకుండా ప్రజలు అడ్డుకోగలిగారు. ఈ పని సాయుధ రాజకీయాలతో జరిగిందనీ, అది అన్నిచోట్లా సాధ్యం కాదేమోననీ అనుకుంటే, ఇతర ఉదాహరణలు ఉన్నాయి. పార్లమెంటరీ రాజకీయ పక్షాలను లొంగదీసి గోవాలో ప్రత్యేక ఆర్థిక మండలాలను రద్దు చేయించిన గోవా ప్రజల ఉదాహరణ, ఒక ప్రత్యేక ఆర్థిక మండలాన్నీ, ఒక బడా పెట్టుబడిదారీ ప్రయత్నాన్నీ రద్దు చేయించిన సింగూరు, నందిగ్రాం ప్రజల ఉదాహరణలు ఉన్నాయి.

కనుక ప్రత్యర్థి మహా బలసంపన్నుడని, పోరాడే బదులు లొంగిపోవడం మేలని పిరికి మందు నూరిపోయడం తగదు. పులిలా కనబడుతున్న ప్రత్యర్థి నిజానికి కాగితపు పులి అని గుర్తించి, గుర్తింపజేసి పోరాటానికి ప్రజలను సమాయత్తం చేయడం ద్వారా విజయం సాధించే అవకాశం ఉంటుంది. నిజానికి భారత ప్రజలకు ప్రపంచీకరణ అవసరం కన్న ఎక్కువగా ప్రపంచీకరణ శక్తులకు భారత దేశ అవసరం ఉంది. వారికి ఇక్కడ ఉన్న అపారమైన వనరులు కావాలి, వారికి ఇక్కడి విశాల మార్కెట్ కావాలి. కనుక భారత ప్రజలే బేరసారాలాడగల పై స్థితిలో ఉన్నారు. ప్రపంచీకరణ ద్వారా నిజంగా మనకు ఏవైనా ప్రయోజనాలు ఒనగూరుతాయనుకున్నా, మనమే మన వనరుల వల్ల, మార్కెట్ వల్ల పై స్థాయిలో ఉన్నాం గనుక, వారికే మన అవసరం ఉంది గనుక బేరసారాలతో మనమే షరతులు పెట్టగలస్థితి ఉంది గాని వారి షరతులకు లొంగవలసిన స్థితి లేదు.

పార్లమెంటరీ వామపక్షాలు, కొందరు ప్రగతిశీల మేధావులు వాదిస్తున్నట్టుగా ప్రపంచీకరణ బాధ్యతనంతా సామ్రాజ్యవాదుల మీదికే

నెట్టడం, దేశ పాలకవర్గాలు, ముఖ్యంగా నెహ్రూ వాద సోషలిజం ప్రజానుకూలమైనవని కితాబు ఇవ్వడం చాల ప్రమాదకరం. ప్రపంచీకరణ ప్రయోజనాలలో సామ్రాజ్యవాద శక్తులకు, దేశీయ పాలకవర్గాలకు వాటాల తేడాలు అటూ ఇటూగా ఉండవచ్చు. కాని ఈ ప్రజా వ్యతిరేక విధానాల రూపకల్పనలో, అమలులో ఇద్దరికీ భాగస్వామ్యం ఉంది. ప్రపంచీకరణను సామ్రాజ్యవాద బహుళజాతి సంస్థలు అంతకంతకూ పెరిగిపోతున్న ఆర్థిక సంక్షోభం నుంచి బయటపడే ఒక మార్గంగా చూడగా, దేశీయ పాలకవర్గాలు ఆంతరంగిక రాజకీయార్థిక సంక్షోభాన్ని ఎదుర్కోవడానికి అవసరమైన శక్తి సామర్థ్యాలు ఇచ్చే సాధనంగా చూశాయి. కనుక దేశీయ పాలకవర్గాలకు అమాయకత్వాన్ని, నిర్దోషిత్వాన్ని ఆపాదించడం అవాస్తవం. అలాగే 1947 నుంచీ 1991 వరకూ ప్రజానుకూల పాలన సాగిందనీ, సోషలిస్టు తరహా ఆర్థిక సామాజికాభివృద్ధి జరిగిందనీ, సార్వభౌమాధికారం కొనసాగిందనీ కట్టుకథలను ప్రచారం చేయడం వామపక్షాలకు ఉపయోగపడుతుందేమో గాని చారిత్రకంగా వాస్తవం కాదు. ఇలా బాధ్యతను పూర్తిగా బహుళజాతి సంస్థలమీద, అంతర్జాతీయ ద్రవ్య సంస్థల మీద నెట్టడం ప్రపంచీకరణ విధానాలను దేశంలో అమలుచేస్తున్న వారిని మినహాయించడానికే జరుగుతోంది. ఇలా అమలు చేస్తున్న వారిలో తమను తాము వామపక్షాలని పిలుచుకుంటున్న వారు కూడ రాష్ట్ర ప్రభుత్వాల స్థాయిలో పూర్తిగానో, కేంద్ర ప్రభుత్వాల స్థాయిలో మద్దతుదార్లు గానో ఉన్నారు గనుక ఈ వాదన వెలువడుతోంది. అందుకే దేశవ్యాప్తంగా ప్రపంచీకరణ వ్యతిరేక ప్రచారం చేస్తూ తాము పాలకులుగా ఉన్నచోట్ల మాత్రం అవే విధానాలను అమలు చేయడానికి అవకాశం దొరుకుతోంది.

ఈ విధానాలను ఆర్థిక సంస్కరణలు అనీ, సరళీకరణ - ప్రైవేటీకరణ - ప్రపంచీకరణ (లిబరలైజేషన్ - ప్రైవేటైజేషన్ - గ్లోబలైజేషన్) అనీ, నయా ఉదారవాద (నియోలిబరల్) సంస్కరణలు అనీ కూడ అంటున్నారు. ఈ విధానాలలో నూతనమైనవేమీ లేవు. పాత దోపిడీ పీడనల విధానాలే కొత్త పేర్లతో వచ్చాయి. అవి కేవలం ఆర్థిక విధానాలు కావు. రాజకీయార్థిక, సామాజిక సాంస్కృతిక రంగాలలో గణనీయమైన మార్పులకు దారితీసే విధానాలు. అవి సంస్కరణలు కావు, పాత అసమానతలను, అన్యాయాలను పెంచినవే తప్ప వాటిని సంస్కరించినవి కావు. అలాగే అవి ఈ దేశ ప్రజాజీవనాన్ని సరళీకరించినవి కావు, దోపిడీని సరళీకరించినవి. ఇందులో ఉదారవాదం ఎంతమాత్రమూ లేదు. పెట్టుబడిదారీ విధానంలో ఒక దశలో తలెత్తిన ఉదారవాద ఆలోచనలకూ దీనికీ కూడ చుక్కెదురు గనుక దీన్ని నయా ఉదారవాదం అనడానికి కూడ వీలులేదు.

అంటే మొత్తం మీద ఈ విధానాలలో మిగిలినవీ అమలైనవీ ప్రైవేటీకరణా ప్రపంచీకరణా మాత్రమే. ఇందులో ప్రపంచీకరణ అనే తటస్థమైన మాట కూడ అబద్ధమే. అది నిజానికి సామ్రాజ్యవాద ప్రపంచీకరణ. సామ్రాజ్యవాదం అనే శాస్త్రీయమైన పారిభాషిక పదానికి 'మార్క్సిస్టు-లెనినిస్టు' వాసన ఉంది గనుక, దాన్ని వాడే బదులు ఈ తటస్థమైన మాటనూ, ఇంకా అమాయకమైన నయా ఉదారవాద అనే మాటనూ వాడుతున్నారు.

ఈ ప్రపంచీకరణ విధానాలన్నీ పెట్టుబడిదారీ విధానపు దుర్మార్గం గురించీ, వనరుల బకాసుర ఆకలి గురించీ, మార్కెట్ల తీరని దాహం గురించీ మార్క్స్ వివరించినవే. అది సామ్రాజ్యవాద దశకు చేరిన తర్వాత ఏమి చేస్తుందో లెనిన్, మావోలు వివరించిన పనులన్నీ ఇవాళ ప్రపంచీకరణ చేస్తోంది. ఆ అర్థంలో ఇందులో కొత్త ఏమీ లేదు. కాని మార్క్స్, లెనిన్, మావో ల కాలం కన్న కూడ సామ్రాజ్యవాదం మరింత తెలివి సంపాదించింది గనుక, మరిన్ని దోపిడీ రూపాలు నేర్చుకుంది గనుక కొత్త పరిభాషతో, కొత్త ముసుగులతో, కొత్త వాదనలతో, కొత్త ఆకర్షణలతో, కొత్త వలలతో వస్తోంది. ఈ రకంగా సామ్రాజ్యవాదం ఎట్లా కొనసాగింపునూ మార్పునూ కలుపుకుంటున్నదో, సామ్రాజ్యవాద వ్యతిరేకత కూడ అదేవిధంగా కొనసాగింపునూ మార్పునూ చూపవలసి ఉంది. పెట్టుబడిదారీ వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక వర్గపోరాటాన్ని మౌలికంగా వదలకుండానే, మారిన దోపిడీ పీడనా రూపాలను ప్రతిఘటించగల కొత్త పోరాట రూపాలను, కొత్త నినాదాలను, కొత్త ప్రజా ఐక్యతను సాధించవలసి ఉంది.

ప్రపంచీకరణ సమాజాన్ని మౌలికంగా, స్థూలంగా రెండుగా విభజిస్తోంది. ఒకవైపు పాలకులకు, సంపన్నులకు, అగ్రవర్ణాలలో కొందరికి, బడా దళారీ పెట్టుబడిదారులకు, బడా భూస్వాములకు ప్రయోజనం చేకూర్చడానికే ప్రపంచీకరణ విధానాలు వస్తున్నాయి. అలా పాలకవర్గాలకు ప్రయోజనాలు చేకూర్చే క్రమంలోనే ఉన్నత మధ్యతరగతికి, కింది కులాలనబడేవాటిలో ఒక చిన్న బృందానికి, ధనిక రైతాంగానికి, ఉన్నత ఉద్యోగవర్గానికి కూడ కొన్ని ప్రయోజనాలనయినా ప్రపంచీకరణ విదిలిస్తోంది. కాని ఇలా ప్రయోజనాలు పొందేవారందరినీ కలిపినా మన సమాజంలోనైతే వారు పది శాతానికి మించరు. ఆ పది శాతంలో కూడ దాదాపు ఐదు శాతంతో సంభాషణ నడిపి వారు అవతలివైపు వెళ్లకుండా తటస్థం చేయడానికి అవకాశం ఉంది. ఇక ప్రపంచీకరణ వల్ల నష్టపోతున్న ప్రజారాశులలో మొత్తంగా పాలితులందరూ, మధ్యతరగతిలో అత్యధికులు, మొత్తంగా పేదలు, అగ్రవర్ణాలలో కొందరు, మధ్యంతర కులాలలో అత్యధికులు, దాదాపు మొత్తంగా దళితులు, మొత్తంగా ఆదివాసులు, మైనారిటీలు, మహిళలలో అత్యధికులు, మధ్యతరగతి రైతాంగం, పేద రైతాంగం, భూమిలేని నిరుపేద కూలీలు, చేతివృత్తులవారు, గ్రామీణ ఉద్యోగ వర్గం, మధ్యతరహా, చిన్న పెట్టుబడిదారులు, పట్టణ మధ్యతరగతిలో అత్యధిక భాగం, మొత్తంగా పట్టణ కార్మిక వర్గం, పట్టణ నిరుపేద వర్గం ఉన్నారు.

అంటే తొంబై శాతం జనాభా వారికి తెలిసినా, తెలియకపోయినా ప్రపంచీకరణ కోరలలో చిక్కుకుని ఉన్నారు. ఇప్పటికే ఆ కోరలకు బలైనవారు కొందరు కాగా, మిగిలినవారందరూ ఆ దారిలోనే ఉన్నారు. అలా నిస్సహాయంగా బలి అయిపోయే బదులు, విశాల ఐక్యత సాధించి, ఈ ప్రమాదకర మహమ్మారిని అంతం చేసే పోరాటానికి పూనుకుంటే తొంబై శాతం మంది ప్రజల శక్తి ముందు, ఐదు శాతం ప్రత్యర్థులు మట్టిగరవక తప్పదు. ఆ ప్రత్యర్థుల వెనుక ఉన్న సామ్రాజ్యవాద ప్రపంచీకరణ శక్తులు తోక ముడవక తప్పదు. ప్రపంచీకరణ వల్ల ప్రతిరోజూ జీవితం దుర్భరంగా మారిపోతున్న కోట్లాది మంది ప్రజలకు ప్రత్యామ్నాయాలను చూపి, ఆ ప్రత్యామ్నాయాల వైపు వారిని నడిపించి ఒక విశాల సంఘటిత ప్రజా ఉద్యమాన్ని నిర్మించినప్పుడు ప్రపంచీకరణ శక్తుల ఆటకట్టించడం అసాధ్యం కాదు. ప్రపంచీకరణే ఎక్కువమందిని ప్రజాఉద్యమాలలోకి పంపిస్తున్నదని ఫిలిప్పైన్స్ విప్లవోద్యమ నేత జోస్ మారియా సిజాన్ కొన్ని సంవత్సరాలకింద అన్నమాట వాస్తవం గురించిన ఒక ప్రకటన మాత్రమే కాదు, అది భవిష్యత్తు సూచన. అది ప్రజానుకూల శక్తుల నిర్మాణ వ్యూహంలో భాగం కూడ కావాలి. వీ

*(రచయిత వీక్షణం సంపాదకులు)*

*ప్రత్యామ్నాయ ఉద్యమాలు ఈ దేశంలోని ఉత్పత్తి సంబంధాలను విశ్లేషిస్తూ చేసుకున్న సూత్రీకరణను మారిన పరిస్థితుల్లో పునర్నిర్వచించుకోవాల్సిన అవసరం ఉందని అంటున్నారు* **రమేష్ పట్నాయక్**

# భారతదేశంలో భూస్వామ్య విధానం ఉందా?

భారతదేశం ఒక అర్ధవలస, అర్ధ భూస్వామ్య వ్యవస్థ అని అనేక విప్లవ కమ్యూనిస్టు పార్టీలు (ఎం.ఎల్. పార్టీలు) విశ్లేషిస్తున్నాయి. అటువంటి విశ్లేషణపై ఆధారపడి తమ విప్లవ పంథాను, ఎత్తుగడలను రూపొందించుకుంటున్నాయి. తక్షణమే సాయుధ పోరాటం అన్న వారిని మిగిలివారు దుందుడుకు వాదులంటున్నారు. సాయుధ పోరాటానికి ప్రజలను సమాయుతం చేయాలనే వారిని అవతలివారు విప్లవాన్ని వాయిదా వేసే వారుగా పేర్కొంటున్నారు. విముక్తి ప్రాంతాల నిర్మాణం, సాయుధ దళాల నిర్వహణ అవసరమని అత్యధిక విప్లవ పార్టీలు భావిస్తున్నాయి. ప్రజా సంఘాల నిర్మాణంపై, పార్లమెంట్‌ను ప్రచార ప్రయోజనాల కోసం ఉపయోగించుకోవడంపై ఈ పార్టీల మధ్య తీవ్ర విభేదాలున్నాయి. రెండవ వేపు సామాజిక నేపథ్యం మారిపోతూ ఉంది. వర్గపోరాటం ప్రధానంగా ఉండిన తెలంగాణ లాంటి ప్రాంతాలలో కులం, ప్రాంతం వంటి సమస్యలు ప్రాముఖ్యతను సంతరించు కుంటున్నాయి. రాష్ట్రంలో విప్లవ పార్టీలు ఈ సమస్యలను ఇముడ్చు కోవడంలో వివిధ విధానాలు అవలంబిస్తున్నాయి. ఎత్తుగడల సమస్యలు, ఎక్కడ కేంద్రీకరించి పనిచేయాలి, ఎలా విస్తరించాలి వంటి నిర్మాణ పరమైన సమస్యలు, కొన్ని సందర్భాలలో వ్యక్తిగతమైన సమస్యలతో విప్లవోద్యమం ముక్కలు చెక్కలవుతోంది. ఈ పార్టీల నాయకులు, కార్యకర్తలు ఎంతో నిబద్ధతతో పనిచేస్తున్నా, ఎన్నో త్యాగాలు చేస్తున్నా విప్లవోద్యమం మాత్రం అభివృద్ధి చెందడం లేదు.

ప్రతి పార్టీ ప్రతి సంవత్సరం తాను పెరుగుతున్నట్లు, బలపడుతున్నట్లు, విస్తరిస్తున్నట్లు నివేదికలు రూపొందించుకుంటుంది. అయితే గత ముప్పై సంవత్సరాల క్రితం కంటె లేదా గత ఇరవై సంవత్సరాల క్రితం కంటే ఇప్పుడు ఉద్యమం బలంగా ఉందని ఎవరూ నిర్ద్వందంగా చెప్పలేకపోతున్నారు. మార్క్సిస్ట్ మౌలిక సూత్రాలను, అదే విధంగా ఈ పార్టీల విప్లవ నిబద్ధతను నమ్మేవాళ్లు ఈ రాష్ట్రంలో పెద్ద సంఖ్యలోనే ఉన్నారు. విప్లవోద్యమం పెరగకపోవడం ఎడల వారు ఆందోళన చెందుతున్నారు. పార్టీల నిబద్ధత మీద ప్రశ్న లేనప్పుడు వాటి రాజకీయ పంథాలే చర్చనీయాంశం అవుతాయి. అందుకే రాజకీయ పంథాపై, దానికి భూమిక అయిన సమాజ వర్గ విశ్లేషణపై చర్చ అత్యంత ప్రధానమైనది. సమాజ వర్గ విశ్లేషణపై, వ్యవస్థ విశ్లేషణపై ఇప్పటికే చాలా సందర్భాలలో చర్చ జరిగినా అటువంటి చర్చ మరల మరల జరగవలసిందే. భారత సమాజ వ్యవస్థ నిజంగా ఒక అర్ధ వలస, అర్ధ భూస్వామ్య వ్యవస్థేనా అన్న విషయాన్ని ముందుగా విశ్లేషించుకోవాలి.

సామ్రాజ్యవాదం ఈ గ్లోబల్ దశలో లేదా కొద్దిమంది వామపక్ష ఆర్థిక శాస్త్రవేత్తలు ప్రతిపాదిస్తున్నట్లు ఈ 'ఫినాన్స్ మోనోపలి' దశలో వలసత్వాన్ని లేదా అర్ధ వలసత్వాన్ని పునర్నిర్వచించాల్సి రావచ్చు. అటువంటి నిర్వచనంపై ఆధారపడి భారతదేశం ఒక వలస లేక అర్ధ వలస దేశమా, ఒక స్వతంత్ర దేశమా లేక అదే ఒక సామ్రాజ్యవాద దేశమా అనే విషయాన్ని పరిశీలించవచ్చు. అంతేకాదు ఈ పాత సాంకేతిక పదజాలంలో దేశాలను వర్గీకరించడం సాధ్యమా అన్న విషయాన్ని కూడా పరిశీలించవలసి రావచ్చు. ఈ వ్యాసం భారత స్వతంత్ర, అస్వతంత్ర లేదా ఆధిపత్య స్థితిని పరిశీలించడానికి ఉద్దేశించింది కాదు. భారతదేశంలో భూస్వామ్య లేదా అర్ధ భూస్వామ్య విధానం ఉందా అన్న విషయంపై చర్చకు మాత్రమే ఈ వ్యాసంలో కొంత ప్రయత్నం జరిగింది. భారతదేశ గ్రామీణ సమాజంలో ఉత్పత్తి సంబంధాల విశ్లేషణకు ఈ వ్యాసం పరిమితమవుతుంది. ఇంకా నిర్దిష్టంగా చెప్పాలంటే భారతదేశ గ్రామాలలో నేడున్న కౌలు దోపిడీ భూస్వామ్య దోపిడీయా, పెట్టుబడిదారీ దోపిడీ ఒకానొక రూపమా అన్న విషయానికి మాత్రమే ఈ వ్యాసం పరిమితమవుతుంది. అంత మాత్రమేతప్ప నూతన ప్రజాస్వామిక విప్లవ పంథా తప్పొప్పులను విశ్లేషించడం ఈ వ్యాసం పరిధిలోనిది కాదు. రాష్ట్రంలో కౌలు విధానంపై తగినంత చర్చ జరిగిన తరువాతే మొత్తం రాజకీయ పంథాపై చర్చ మరింత అర్థవంతంగా ఉండవచ్చు.

ఈ యుగాన్ని సామ్రాజ్యవాదం - యుద్ధం - కార్మికవర్గ విప్లవాల యుగంగా లెనిన్ విశ్లేషించాడు. యుగ ప్రభావం వలస సామ్రాజ్యవాదం, యుద్ధం, కార్మికవర్గ విప్లవాలు కొత్త కొత్త రూపాలను సంతరించుకో గలుగుతాయి. అందుకే సామ్రాజ్యవాదాన్ని సరిగా గ్రహించడానికి దాని కొత్త రూపాలను గుర్తించి అధ్యయనం చేయవలసి ఉంటుంది. కాగా భూస్వామ్య విధానానికి ఈ యుగంలో నిత్య నూతన రూపాలను సంతరించుకునే జీవశక్తి ఉండదు. అందుకే భూస్వామ్య వ్యవస్థ ఉనికిలో ఉంటే అది దాని పాతరూపాలతోనే ఉండగలుగుతుంది. భారతదేశంలో భూస్వామ్య వ్యవస్థ ఉనికిని గ్రామాలలో నేడున్న ఉత్పత్తి సంబంధాలను ప్రధానంగా కౌలు సంబంధాలను ఐరోపా, రష్యా, చైనా, భారత్ దేశాల గత చరిత్రలో గ్రామీణ ఉత్పత్తి సంబంధాలతో పోల్చి గుర్తించవచ్చు.

భారత విప్లవోద్యమంలో ఎంతోమంది మేధావులున్నారు. అయితే వారు మారుతున్న గ్రామీణ పరిస్థితులను వివరించడానికి భూస్వామ్య వ్యవస్థకు కొత్త రూపాలను ఆపాదించడంలో తమ మేధస్సును వృథా

చేసుకున్నారు. గ్రామాలలో కొత్త కౌలు విధానం పెట్టుబడిదారీ దోపిడీ మరొక రూపం అయ్యే అవకాశాలను వారు పరిశీలించలేదు. ఐరోపాలో పెట్టుబడిదారీ వ్యవస్థ ప్రవేశించిన తరువాత అక్కడ గ్రామాలలో తలెత్తిన లేదా పట్టణాల నుండి గ్రామాలకు దిగబడిన పెట్టుబడిదారీ కౌలుదారులు (కాపిటల్ టెనెంట్స్) భూస్వామికి కౌలు చెల్లించి, వ్యవసాయ కూలీకి వేతనం చెల్లించి తన పెట్టుబడికి వడ్డీ, వ్యవస్థాపకుడిగా తనకు 'సాధారణ లాభం' (తరువాత పేజీలలో చర్చించాను.) గుంజుకునేవారు. అటువంటి పెట్టుబడిదారుల కోసం భారత గ్రామాలలో వెదకి, అట్టి వారు కనిపించకపోవడంతో మన దేశ గ్రామాలలో పెట్టుబడిదారీ వ్యవస్థ వృద్ధిచెందలేదని ఎం.ఎల్. పార్టీల నాయకులు నిర్ణయానికి వచ్చారు. భారత గ్రామాలలో పెట్టుబడిదారీ దోపిడీ దాని ఇతర రూపాలలో జరిగే అవకాశాలను స్వేచ్ఛగా అధ్యయనం చేయలేదు. వారు చేసిన అధ్యయనాలన్నీ వారు ముందుగా నిర్ణయించుకున్న రాజకీయ పంథాను బలపరచుకోవడం అనే సంకుచిత లక్ష్యంతోనే సాగాయి. భూమి సమస్య విప్లవ సమస్య కాదంటే సి.పి.ఐ., సి.పి.ఎం. వలె అవకాశవాదులమైపోతామనే భయం లేదా మరికొన్ని పార్టీల వలె శుద్ధ సిద్ధాంత వాదులుగా మారి, ఆచరణలో వర్గ పోరాటాన్ని పక్కనపెట్టి, బలహీనమైపోతామనే భయం ఎం.ఎల్. పార్టీల భావ సంఘర్షణ స్వేచ్ఛకు ఆటంకంగా నిలిచినట్లు కనిపిస్తోంది.

**నాటి ఐరోపాతో నేటి భారత్ తులనాత్మక పరిశీలన**

**భూస్వామ్య వ్యవస్థపై అధ్యయనాలు:** భూస్వామ్య విధాన విశ్లేషణను మార్క్స్ సమగ్రంగా చేపట్టలేదని ఇంగ్లిష్ మార్క్సిస్ట్ చరిత్రకారుడు రోడ్నీ హిల్టన్ అంటాడు. అది వాస్తవమే కావచ్చు. పెట్టుబడిదారీ విధానాన్ని ఆమూలాగ్రంగా, సోదాహరణంగా చర్చించినట్లు కార్ల్‌మార్క్స్ భూస్వామ్య విధానంపై విస్తృతంగా చర్చించలేదు. అయితే మూడవ వాల్యూం గ్రౌండ్ రెంట్ అధ్యాయంలో కార్ల్ మార్క్స్ భూస్వామ్య వ్యవస్థ అభివృద్ధి గురించి క్లుప్తంగా వివరించాడు. ఆ వివరణ క్లుప్తంగా ఉన్నా స్పష్టంగానూ, ఆసియా దేశాలతో సహా వివిధ దేశాలలో అన్వయించుకోవడానికి అవసరమయిన సార్వత్రిక లక్షణాలతోనూ ఉంది. అదలా ఉండగా అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాల గ్రామాలలో వర్గాల గురించి లెనిన్, చైనాలో గ్రామాలలో వర్గాల గురించి మావో చేసిన విశ్లేషణలు మనముందున్నాయి. ఇక మార్క్సిస్ట్ చరిత్రకారుని విషయానికి వస్తే 1940లలో ప్రపంచ వ్యాపితంగా ఎనిమిది మంది ప్రసిద్ధ చరిత్రకారులు పాల్గొన్న 'డాబ్ – స్వీజీ చర్చ' భూస్వామ్య వ్యవస్థ గురించి అనేక ఇతర విషయాలతో పాటు ఐరోపాలో భూస్వామ్య విధానాన్ని నిర్వచించడానికి ప్రయత్నించింది. ఇదే సమస్యపై అనంతర కాలంలో ఐరోపాలో 'బ్రెన్నర్ చర్చ' కూడా జరిగింది. ఇక భారతదేశం విషయానికి వస్తే 1955 నుండి సుమారు రెండున్నర దశాబ్దాల పాటు ఆర్థిక రాజకీయ శాస్త్రవేత్తలు గ్రామాలలో ఫ్యూడల్ ఉత్పత్తి సంబంధాలపై విస్తృతంగా చర్చించారు. భారతదేశంలో ఆచరణాత్మక ఉద్యమాల విషయానికి వస్తే తెలంగాణలో జరిగిన నిజాం వ్యతిరేక పోరాటం ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక రంగాలలో ఫ్యూడల్ వ్యతిరేక పోరాటమే. ఈ చర్చల, పోరాటాల అధ్యయనం భూస్వామ్య విధానాన్ని అర్థం చేసుకోవడానికి ఉపకరిస్తాయనడంలో సందేహం లేదు. అయితే ఈ వ్యాసం ప్రధానంగా మార్క్స్ 'భూమికౌలు', 'డాబ్ – స్వీజీ చర్చ' లపై ఆధారపడి నాటి ఐరోపా, నేటి భారత్‌ల తులనాత్మక పరిశీలనకు పరిమితం అయింది.

**'డాబ్ – స్వీజీ' చర్చ:** నిజానికి ఈ 'చర్చ' 'పెట్టుబడిదారీ వ్యవస్థ అభివృద్ధిపై అధ్యయనాలు' (1946) అనే మౌరిస్ డాబ్ పుస్తకం ప్రచురణతో ప్రారంభమయింది. ఈ డాబ్ రచనలో కొన్ని అంశాలపై పాల్.ఎం. స్వీజీ విమర్శలు చేసాడు. ఈ విమర్శకు 'డాబ్' సమాధానం ఇచ్చాడు. అంతేకాక ఇంతకు ముందు చెప్పినట్లు ఈ చర్చలో ఎనిమిది మంది ప్రముఖ చరిత్రకారులు పాల్గొన్నారు. తరువాత ఆ 'చర్చ' 'భూస్వామ్య విధానం నుండి పెట్టుబడిదారీ విధానానికి మార్పు' అనే పేరుతో మరో పుస్తకంగా వెలువడింది. 'భూస్వామ్య విధానం నిర్వచనం, పట్టణాల పుట్టుక, భూస్వామ్య విధానం, పెట్టుబడిదారీ విధానంగా మార్పు చెందే క్రమంలో కుటీర పరిశ్రమలు, వ్యాపార, డబ్బు – ఆర్థిక వ్యవస్థ నిర్వహించిన పాత్రలు, సరళ సరుకు ఉత్పత్తి విధానం (సింపుల్ కమొడిటీ ప్రొడక్షన్), పెట్టుబడిదారీ ఉత్పత్తి అభివృద్ధి క్రమంలో వివిధ మార్గాలు (ప్రధానంగా మార్క్స్ చర్చించిన మార్గం నెంబర్ 1, మార్గం నెంబర్ 2) ఇంకా మార్పును కలిగించిన మొదటి కారణం (ప్రైమ్ మూవర్) ఏది వంటి విషయాలపై చరిత్రకారుల మధ్య ఈ చర్చ జరిగిందని ఈ 'చర్చ'కు ముందుమాట రాసిన రోడ్నీ హిల్టన్ పేర్కొన్నాడు. ఆ చర్చనంతా క్రోడీకరించడం ఇక్కడ మన ఉద్దేశ్యం కాదు. భూస్వామ్య వ్యవస్థ నిర్వచనంపై ఈ చర్చలో వచ్చిన వాదనలు పరిశీలిద్దాం. మౌరిస్ డాబ్ భూస్వామ్య విధానాన్ని ఈ కింది విధంగా నిర్వచించాడు.

'(తనపై జరిగే) బలప్రయోగం వలన తన ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా భూస్వామి కొన్ని నిర్దిష్టమైన డిమాండ్లను తీర్చవలసిన బాధ్యత ఉత్పత్తిదారుని (రైతు)పై ఉండడమే సెర్ఫ్‌డమ్. ఈ డిమాండ్లనేవి చేయవలసిన సేవలు (వెట్టి చాకిరి)గా ఉండవచ్చు లేదా వస్తు రూపంలో గాని, డబ్బు రూపంలో గాని చెల్లించవలసిన బకాయిలుగా ఉండవచ్చు. ఈ అణచివేత శక్తి అనేది ఒక భూస్వామ్య ఆధిపత్యపు మిలిటరీ శక్తిగా ఉండవచ్చు. ఒక న్యాయ ప్రక్రియతో బలపరచబడిన సంప్రదాయంగా ఉండవచ్చు లేదా చట్టం బలంగా ఉండవచ్చు.'

డాబ్ నిర్వచనాన్నే ఈ చర్చలో పాల్గొన్న జపాన్ చరిత్రకారుడు తకహాషి సరళంగా వివరించారు. ఈ చర్చను సంకలనం చేసిన రోడ్నీ హిల్టన్ దానిని ఈ విధంగా క్రోడీకరించారు. 'రైతు కుటుంబ కనీస అవసరాలకు, ఆర్థిక పునరుత్పత్తికి మిగులుగా ఉన్న 'అదనపు శ్రమను' భూస్వామి ఉపయోగానికి బదలాయించడమే భూదాస్య వ్యవస్థ (సెర్ఫ్‌డమ్) సారాంశం. ఆ 'అదనపు శ్రమను' భూస్వామి ఇంటి వ్యవసాయం (డొమెస్ హోమ్ ఫార్మ్)పై ప్రత్యక్షంగా ఉపయోగ పెట్టవచ్చు లేదా దానిని రైతు తన స్వాధీనంలో ఉన్న భూమిపై ఉపయోగించి వచ్చిన ఉత్పత్తిని వస్తు రూపంలో గాని, ధన రూపంలో గాని కౌలుగా భూస్వామికి బదలాయించవచ్చు.' ఈ విధంగా రైతు భూస్వామికి కౌలు చెల్లించడం రాజకీయ – చట్టపరమైన, బలప్రయోగం వలన జరుగుతున్నదనే మౌరిస్ డాబ్ అభిప్రాయాన్ని కూడా తకహాషి బలపరుస్తాడు. ఆ మాటకు వస్తే మార్క్సిస్ట్ చరిత్రకారులందరూ ఈ

అభిప్రాయాల్ని బలపరుస్తారు. ఈ విషయాన్ని అలా ఉంచితే ఇక్కడ మౌరిస్ డాబ్, తకహషి భూస్వామ్య వ్యవస్థ (ఫ్యూడలిజం) ను భూదాస్య వ్యవస్థ (సెర్ఫ్‌డమ్)ను సమానార్థకాలుగా ఉపయోగించారు అన్న విషయం గమనార్హం. ఈ రెండు పదాలను సమానార్ధకాలుగా ఉపయోగించవచ్చా లేదా అన్న విషయంపై కూడా చర్చ జరిగింది. ఆ చర్చను తరువాత పరిశీలించవచ్చు.

తకహషి నిర్వచనంతో మన అధ్యయాన్ని ప్రారంభిద్దాం. తకహషి నిర్వచనం ప్రకారం భూస్వామ్య వ్యవస్థలో దోపిడీ రూపం భూస్వామికి కౌలు చెల్లించడం. ఈ కౌలు 'అదనపు శ్రమ' రూపంలోగాని, 'అదనపు ఉత్పత్తి' రూపంలో గాని, చివరికి డబ్బు రూపంలో గాని ఉండవచ్చని తకహషి నిర్వచిస్తాడు. అయితే ఇంగ్లిష్ మార్క్సిస్ట్ చరిత్రకారులు కౌలు డబ్బు రూపంలోనికి మారడం చాలా ప్రధానమయిన విషయంగా పరిగణించారని రోడ్నీ హిల్టన్ 'చర్చ'కు తాను రాసిన ముందు మాటలో పేర్కొన్నాడు.

'భూస్వామ్య వ్యవస్థ నుండి పెట్టుబడిదారీ వ్యవస్థ మార్పు ఇంగ్లాండులో, 14వ శతాబ్దంలో కౌలు శ్రమసేవల నుండి డబ్బు రూపంలోనికి మారడం (కమ్యుటేషన్) చాలా ప్రధానమైన విషయమని ఈ చర్చలో పాల్గొన్న ఇంగ్లిష్ మార్క్సిస్ట్‌లు భావించారు' రోడ్నీ హిల్టన్.

కార్ల్ మార్క్స్ తన గ్రౌండ్ రెంట్ అధ్యాయంలో కౌలు పైన పేర్కొన్న మూడు రూపాల గురించి రాసాడు. అంతేకాదు 'భూమి కౌలు' 'అదనపు శ్రమ నుండి', 'అదనపు ఉత్పత్తిలోనికి', చివరకు డబ్బు రూపంలోనికి మారిన విషయం, తత్పర్యవసానాలు కూడా విశ్లేషించాడు. అయితే భారతదేశ వామపక్ష సాహిత్యంలో రచయితలు ఇటు పార్టీల నాయకులు గాని, అటు మేధావులు గాని కౌలు రూపాలలో వచ్చిన మార్పుల ప్రాధాన్యతపై శ్రద్ధ చూపినట్లు లేదు. అంతేకాదు, భారతదేశంలో కౌలు రైతుపై 'భూస్వామికి' కౌలు ఒప్పందానికి అతీతంగా అధికారాన్ని చెలాయించే, బలప్రయోగం చేసే అవకాశం లేని విషయాన్ని గాని, కౌలు వసూలు చేసుకునే అసామి (భూస్వామి) దానిని ఫ్యూడల్ ప్రాధాన్యతల కింద ఖర్చు చేస్తున్నాడా లేక పెట్టుబడి ప్రాధాన్యతల కింద ఖర్చు చేస్తున్నాడా అన్న విషయంపై గాని మార్క్సిస్ట్ రచయితలు, నాయకులు పెద్దగా శ్రద్ధ పెట్టినట్లు లేరు. ఐరోపాలో భూస్వామ్య వ్యవస్థలో కౌలు పొందిన వివిధ రూపాలను, పర్యవసానాలను ఈ కింద పరిశీలిద్దాం. చర్చ సౌలభ్యం కోసం కౌలు వివిధ రూపాలలో ఉన్న కాలాలను వివిధ దశలుగా పరిశీలిద్దాం.

**భూస్వామ్య వ్యవస్థలో మూడు దశలు**

**1) 'అదనపు శ్రమ' దోపిడీ దశ :** భూస్వామి జమీందారీ (మేనర్)లో ఉన్న రైతులు చట్టపరంగా కాకపోయినా వారసత్వపు హక్కులతో సహా తమ స్వాధీనంలో భూమి కలిగి ఉంటారు. ఆచరణాత్మక అర్థంలో అది రైతు భూమే (డిఫాక్టో ఓనర్‌షిప్). అలాగే భూస్వామికి డిమిస్నీ అనే స్వంత వ్యవసాయం ఉంటుంది. భూస్వామ్య వ్యవస్థ అన్ని దశలలోనూ ఇదే పరిస్థితి ఉంటుంది. కాగా అదనపు శ్రమ దోపిడీ దశకు సంబంధించి ప్రత్యేకంగా చెప్పుకోవాలంటే, ఒక రైతు చట్టపరంగా కాకపోయినా వాస్తవంగా తన స్వాధీనంలో ఉన్న భూమిలో తన కుటుంబ కనీస అవసరాలు తీర్చుకోవడానికి అలాగే తదుపరి సంవత్సరం వ్యవసాయం చేయడానికి అవసరమైన మదుపులను సమకూర్చుకోవడానికి అవసరమైన శ్రమను చేస్తాడు. వారంలో కొన్ని రోజులు అందుకు పోగా మిగిలిన రోజులు భూస్వామి డిమిస్నీలో వెట్టి చేయవలసి ఉంటుంది. రైతు వెట్టి చేయవలసిన అవసరం లేకపోయి ఉంటే వారంలో అన్ని దినాలు తన స్వాధీనంలో ఉన్న భూమిలోనే వ్యవసాయం చేసి ఉంటే తన కుటుంబ శ్రమకు అవసరమైనంత భూమి తనకు అందుబాటులో ఉండి ఉంటే పెరిగిన ఫలసాయంతో కుటుంబ కనీస అవసరాలను మించి తన కుటుంబ అభివృద్ధి కొరకు మరింత ఉత్పత్తి కేటాయించుకోగలిగేవాడు. అలాగే తరువాత సంవత్సరం వ్యవసాయాన్ని అభివృద్ధి చేయడానికి మరికొంత అదనపు మదుపు సమకూర్చుకోగలిగి ఉండేవాడు. కాని భూస్వామి డిమిస్నీ మీద వెట్టిచేయడం తప్పదు. అందుకు తన స్వాధీనంలోని భూమి మీద పనిని కనీసానికి తగ్గించుకోవాలి. తన కుటుంబ అవసరాలను, తన వ్యవసాయ మదుపులను కనీసానికి తగ్గించుకోవాలి. వారంలో భూస్వామి డిమిస్నీ భూములపై పని చేయడానికి సంప్రదాయం ప్రకారం నిర్ణయమైన రెండు లేదా మూడు రోజులు అందుకై కేటాయించాలి. రైతు శ్రమ దినాల ఈ పంపకాన్ని సాంకేతిక పరిభాషలో చెప్పుకుంటే రైతు తన స్వాధీనంలో భూమిపై 'అవసర శ్రమ' భూస్వామి డిమిస్నీపై 'అదనపు శ్రమ' చేసేవాడు. ఒక వారంలో అవసర శ్రమ ఐదు రోజులు అనుకుంటే అదనపు శ్రమ రెండు రోజులవుతుంది. ఎటువంటి ప్రతిఫలం లేకుండా భూస్వామి భూమిపై చేసిన ఈ శ్రమనే వెట్టి శ్రమ (కర్వీ లేబర్) అని అంటాం. ఇటువంటి వెట్టి రూపంలో భూస్వామ్య దోపిడీ ఇంగ్లాండులో 10, 11 శతాబ్దాల వరకు కొనసాగింది. తూర్పు యూరప్‌లో మరల 15వ శతాబ్దంలో ఈ రూపం రెండవసారి దర్శనమిచ్చింది. అయితే ఆ విషయం ఇక్కడ ప్రధానాంశం కాదు. 12వ శతాబ్ది తరువాత భూస్వామి కౌలు వస్తు (పంట లేదా తయారీ వస్తువులు) రూపంలోనికి ఆ తరువాత డబ్బు రూపంలోనికి మారిపోయింది.

**2) అదనపు ఉత్పత్తి దోపిడీ దశ:** కౌలు పంట, వస్తు రూపంలో చెల్లించబడిన దశను ఇక్కడ అదనపు ఉత్పత్తి దోపిడీ దశగా పేర్కొంటున్నాం. పంట రూపంలో కౌలు చెల్లించబడిన దశలో రైతు భూస్వామి స్వంత భూమి (డిమిస్నీ)లో వెట్టి చేయవలసిన అవసరం లేదు. తన స్వాధీనంలో ఉన్న భూమిలోనే సంవత్సరం పొడుగునా శ్రమపడి పంట పండించి తన కుటుంబ కనీస అవసరాల కోసం, తరువాత సంవత్సరం కనీస మదుపుల కోసం 'అవసర ఉత్పత్తి'ని ఉంచుకుని మిగిలిన 'అదనపు ఉత్పత్తి'ని భూస్వామికి అద్దెగా చెల్లిస్తాడు. నిజానికి పంటలో ఒక నిర్దిష్టమైన భాగాన్ని (సగం, లేక మూడవ భాగం) భూస్వామికి చెల్లిస్తాడు. మిగిలిన దానిలోనే తన కుటుంబ అవసరాలు, వ్యవసాయ మదుపు అవసరాలు తీర్చుకుంటారు. అయితే పంట, వస్తు రూపంలో చెల్లించ వలసిన ఈ అద్దె దీర్ఘకాలిక విస్తృతిలో పరిశీలించినప్పుడు అదనపు ఉత్పత్తికి అంటే పరిమాణంలో ఆర్థిక పునరుత్పత్తి అవసరాలు (రైతు కుటుంబ కనీస అవసరాలు + వ్యవసాయ మదుపులు) పోనూ మిగిలిన ఉత్పత్తికి సర్దుకుంటుంది. రైతు భూస్వామికి వెట్టిచాకిరీ సందర్భంలో ప్రత్యేకంగా తన అదనపు శ్రమను ఇస్తాడు. కాగా ఈ సందర్భంలో అదనపు శ్రమ ఉత్పాదితమైన పంట, వస్తు సముదాయాన్ని భూస్వామికి కౌలుగా చెల్లిస్తాడు. ఈ సందర్భంలో కూడా

'అదనపు ఉత్పత్తి' భూస్వామికి చెల్లించబడడంతో రైతు కుటుంబ అభివృద్ధికి గాని, వ్యవసాయ అభివృద్ధికి గాని వనరులు అందుబాటులో ఉండవు. రైతు తన కుటుంబాన్ని, వ్యవసాయాన్ని కనీస వనరులతోనే నెట్టుకు రావలసి ఉంటుంది.

**3) డబ్బు రూపంలో కౌలు దశ:** భూస్వామ్య వ్యవస్థ చివరి దశలో రైతు భూస్వామికి కౌలు డబ్బు రూపంలో చెల్లించాడు. అంటే పైన చెప్పుకున్న 'అదనపు ఉత్పత్తి'ని మార్కెట్‌లో అమ్మి వచ్చిన డబ్బు (విలువ)ను భూస్వామికి కౌలుగా చెల్లిస్తాడు. ఈ సందర్భంలో కూడా డబ్బు రూపంలో కౌలు ప్రారంభంలో వస్తురూపంలో కౌలుకు సమానంగా ఉంటుంది. అయితే ఈ డబ్బు రూపేణా కౌలు స్థిరపడి పోయిన తరువాత ప్రతి ఎకరం నుండి భూస్వామికి అందే కౌలు వస్తురూపంలో కౌలు వాటా కంటె బాగా తగ్గిపోతూ వచ్చిందనే విషయం తరువాత చర్చించ బడింది. అయితే ఈ దశలో ఉత్పత్తి సాధనాల యాజమాన్యంలో కొంత మార్పు వచ్చింది. మొదటి రెండు దశలలో వలె ఈ దశలో కూడా రైతుకు భూమిపై చట్టపరమైన హక్కు లేకపోయినా వారసత్వంగా వస్తున్న సంప్రదాయకమైన హక్కు కొనసాగింది. (ఇది తరువాత చట్టపరమైన హక్కుగా మారిందనే విషయం ఇక్కడ అప్రస్తుతం.) ఈ దశలో ఉత్పత్తి సాధనాలకు సంబంధించి ప్రత్యేకమైన విషయ మేమంటే, భూమి కాని ఇతర ఉత్పత్తి సాధనాలు రైతు సమకూర్చుకోవడం మొదటి రెండు కౌలు పద్ధతులలో కూడా ఉన్నా, డబ్బు కౌలు పద్ధతికి అది తప్పనిసరి ముందస్తు నిబంధన అని మార్క్స్ రాసాడు. ఈ విధంగా రైతు భూమిపై సంప్రదాయకమైన హక్కు కలిగి ఉండడమే గాక ఇతర ఉత్పత్తి సాధనాలను కూడా స్వంతంగా కలిగి ఉండడం వలన భూస్వామికి కౌలు చెల్లింపు అనేది భూస్వామికి రైతుపై ఉన్న ఆర్థికేతరమైన రాజకీయ – చట్టపరమైన అధికారానికి (ఎక్స్‌ట్రా ఎకనమిక్ కోఎర్షన్)కు నగ్నమైన వ్యక్తీకరణగా కనపడింది. అందుకే డబ్బు కౌలు దశ, అస్థిరమైన దశగానూ, భూస్వామ్య వ్యవస్థ విచ్ఛిన్న దశగానూ, చివరి దశగానూ పరిణమించింది.

కౌలు రూపంలో ఉన్న ఈ వ్యత్యాసాల ప్రాధాన్యతను కార్ల్ మార్క్స్ స్వయంగా వివరించాడు (భూమి కౌలు – 3వ వాల్యూం). మేధావుల విషయానికి వస్తే, కౌలు డబ్బు రూపం, పెరిగిన వాణిజ్యంతో, భూస్వామ్య వ్యవస్థను అస్థిర పరచడానికి దోహదం చేసిందని పాల్. ఎం. స్వీజీ చూపించాడు. అయితే అద్దె మొదటి రూపాన్ని అంటే వెట్టి చాకిరీ రూపాన్ని మాత్రమే సెర్ఫ్‌డమ్ (భూదాస్య వ్యవస్థ) అనాలని, మూడు రూపాలను కలిపి ఫ్యూడలిజం (భూస్వామ్య వ్యవస్థ) అనాలని వాదించే వారున్నారు. పాల్. ఎం. స్వీజీ వారిలో ప్రముఖుడు. అంతేకాక పాల్. ఎం. స్వీజీ సెర్ఫ్‌డమ్‌ను మధ్య యుగాల భూస్వామ్య వ్యవస్థలోనే గాక అంతకు ముందు కూడా చరిత్రలో ఓడింపబడిన స్థానికులపై గెలుపొందిన ఆక్రమణదారులు బలవంతంగా రుద్దారని ఎంగెల్స్‌ను ఉటంకిస్తూ చెప్పాడు. (డాబ్ – స్వీజీ చర్చ, పేజీ నెం. 33, ఆకార్ – 2006). అంటే సెర్ఫ్‌డమ్ (వెట్టి చాకిరీ) అనే శ్రమ దోపిడీ రూపం భూస్వామ్య దోపిడీ ఉత్పత్తి సంబంధాలలోనే కాక చరిత్రలో ఇతర దోపిడీ ఉత్పత్తి వ్యవస్థలలో కూడా ఉండేదని స్వీజీ అభిప్రాయం. 'ఉత్పత్తిదారుణ్ని' కౌలు ఏ రూపంలోనైనా ప్రత్యక్ష రాజకీయ – చట్టపరమైన నిర్బంధంతో (పొలిటికల్ – లీగల్) దోపిడీ చేయడమే భూదాస్యం అని, భూస్వామ్య వ్యవస్థలో సెర్ఫ్‌డమ్ అనేది దోపిడీ పద్ధతి అని మౌరిస్ డాబ్ చెప్తాడు. మౌరిస్ డాబ్ ఫ్యూడలిజంలో పేర్కొన్న మూడు దశలను సెర్ఫ్‌డమ్‌గా పరిగణిస్తాడు. ఈ విషయంలో పాల్ ఎం. స్వీజీతో విభేదిస్తాడు. భూస్వామ్య వ్యవస్థ, భూదాస్య వ్యవస్థలను పర్యాయ పదాలుగా వాడవచ్చా లేక భూదాస్య వ్యవస్థను భూస్వామ్య వ్యవస్థ ఒకానొక రూపంగా, అంటే వెట్టి చాకిరీ రూపంగా మాత్రమే పరిగణించాలా అన్న విషయాన్ని పక్కన పెట్టినా భూస్వామ్య వ్యవస్థ మూడు రూపాల మధ్య ఉన్న వ్యత్యాసాన్ని మాత్రం చర్చించవలసి ఉంటుంది. ప్రధానంగా రైతు స్వేచ్ఛ, ఉత్పత్తి శక్తుల అభివృద్ధి అనే ప్రధాన విషయాల దృష్ట్యా, ఈ మూడు రూపాల మధ్య వ్యత్యాసాన్ని పరిశీలించవలసి ఉంటుంది.

**కౌలు రూపాలలో మార్పులు – పర్యవసానాలు**

**శ్రమరూపంలో కౌలు – రైతు అర్ధబానిస :** ఇంతకు ముందు చర్చించినట్లు భూస్వామ్య కౌలు మొదటి రూపం వెట్టిచాకిరీ. ఈ దశలో రైతు వారంలో ఐదు రోజులు తన స్వాధీనంలో ఉన్న భూమిలో పనిచేసి, ఆర్థిక పునరుత్పత్తి అవసరాలు (తన కుటుంబ కనీస అవసరాలు, కనీస మదుపు అవసరాలు) తీర్చుకునేవాడు. కాగా మిగిలిన దినాలు భూస్వామి భూమి (డిమిస్నీ) పై వెట్టి చేసేవాడు. భూస్వామ్య వ్యవస్థ ఈ రూపం మిగిలిన రెండు రూపాల కంటె దుర్భరమైనది. ఈ దశలో రైతును అర్ధబానిస అనిపిలువవచ్చు. బానిస వ్యవస్థతో ఈ రూపానికి అనేక పోలికలున్నాయి. ఈ దశలో వెట్టి చేసే రోజులలో రైతు భూస్వామి భూమి మీద పనిచేస్తాడు. అక్కడ ఉత్పత్త సాధనమైన భూమిపై రైతుకు ఎటువంటి హక్కు లేదు. ఉత్పత్తి పై కూడా రైతుకు ఎటువంటి హక్కూ లేదు. అంతేకాదు డిమిస్నీ భూములలో ఏమి పండించాలి, ఎలా పండించాలి, పని ఎప్పుడు చేయాలి అనే విషయాలను రైతు నిర్ణయించడు. డిమిస్నీపై రైతులు భూస్వామి లేక భూస్వామి మనుషుల ప్రత్యక్ష పర్యవేక్షణలో పనిచేస్తాడు. వెట్టిచాకిరీ చేసే రోజులలో రైతు ఉత్పత్తి సాధనాలు, ఉత్పత్తి ప్రక్రియ, ఉత్పత్తి అన్నింటి నుంచి పరాయీకరణ పొంది ఉంటాడు. ఈ స్థితి బానిస స్థితితో పోల్చదగ్గదిగా ఉంటుంది. అయితే వారంలో ఐదు రోజులు రైతు తరతరాలుగా తన స్వాధీనంలో ఉన్న (చట్టపరంగా తనదికాక పోయినా) భూమిపై పనిచేస్తాడు. ఉత్పత్తి ప్రక్రియను తానే నిర్ణయించుకుంటాడు. ఇక ఉత్పత్తి విషయానికి వస్తే అది పూర్తిగా రైతుకే చెందుతుంది. ఒక్క మాటలో చెప్పాలంటే భూస్వామ్య వ్యవస్థ ఈ దశలో తన స్వాధీనంలో ఉన్న భూమి మీద ఈ విధంగా తన స్వంత శ్రమను తన కొరకు స్వేచ్ఛగా ఉపయోగపెట్టుకోవడానికి రెండు, మూడు రోజులు భూస్వామి డిమిస్నీపై నిర్బంధంలో బానిసవలె పనిచేయవలసి ఉంటుంది. అయితే భూస్వామ్య వ్యవస్థ తదనంతర రెండు దశలలో అంటె కౌలు ఉత్పత్తి రూపంలోనూ, లేదా డబ్బు రూపంలోనూ చెల్లించబడిన దశలలో రైతు రెగ్యులర్ ప్రాతిపదికన వెట్టి చేయడు. ఆ దశలలో రైతు ఏ విధంగానూ బానిసను పోలడు. ఆ దశలో రైతు అధికారికంగా అర్ధబానిసగా కాక అస్వతంత్ర రైతుగా వ్యవహరించబడ్డాడు.

(ఇంకా వుంది)

*(రచయిత విద్యా పరిరక్షణ కమిటీ నాయకులు)* వీ

మూడు దశాబ్దాల దండకారణ్య ఉద్యమం అనేక ఆటుపోట్ల మధ్య చూపిస్తున్న ప్రత్యామ్నాయ స్వావలంబన అభివృద్ధి నమూనాను వివరిస్తున్నారు **సోను**

# ప్రత్యామ్నాయ ప్రజా ఆర్థిక విధానాలు - అనుభవం

భారతదేశానికి రైతు వెన్నెముక అంటారు. ఈ దేశంలో ఇప్పటికీ దాదాపు మూడొంతుల ప్రజలు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో వ్యవసాయంపై ఆధారపడి జీవిస్తున్నారు. గ్రామీణ భారతంలోని రైతాంగ బతుకులు దినదినం దుర్భరంగా మారుతున్నాయి. దేశ స్థూల జాతీయాదాయంలో వ్యవసాయరంగం వాటా నానాటికీ తగ్గిపోతోంది. ఇందుకు ప్రధాన కారణం ఏటేటా వ్యవసాయ రంగానికి ప్రభుత్వ కేటాయింపులు తగ్గిపోవడమే. రైతాంగాన్ని ఉద్ధరించడానికి 1950లలో అంటే 'స్వాతంత్ర్యం' వచ్చిన తొలి దశాబ్దంలో కమ్యూనిటీ డెవలప్‌మెంట్ ప్రోగ్రాంలను కేంద్ర ప్రభుత్వం మహా ఆర్భాటంగా ముందుకు తెచ్చింది. కాని వీటి అసలు ఉద్దేశం ఆనాడు దేశంలోని పలు ప్రాంతాల్లో తీవ్రమవుతున్న (ప్రధానంగా వీర తెలంగాణ విప్లవ రైతాంగ పోరాటం) పోరాటాలనూ - ఆనాటి ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ మాటల్లో 'ఎర్ర విప్లవాలు' - వాటి ప్రభావాన్నీ అడ్డుకోవడమేనన్నది సూక్ష్మగ్రాహులకు అర్థం గాని విషయమేమీ కాదు. ఆ ప్రోగ్రాంల వెనుక అమెరికా సామ్రాజ్యవాదుల హస్తం ఉందనేది ఈ దేశంలోని దేశభక్త ప్రజాస్వామిక వాదులకు తెలియనిదీ కాదు. ఆ తర్వాత 1960ల కరువు కాలంలో కేంద్ర ప్రభుత్వం ఈ దేశానికి అమెరికా నుంచి సస్య విప్లవాన్ని దిగుమతి చేసుకుంది.

ఈ సస్య విప్లవం నగ్జల్బరీ రైతు ఆగ్రహాన్ని చల్లార్చలేకపోయింది. మరికొంత కాలం గడిచాక 1991 నుంచి దేశంలో నూతన ఆర్థిక విధానాలు స్వారీ చేయడం ప్రారంభమైంది. ఇప్పుడు సస్య విప్లవం - 2 అంటున్నారు. ఇదంతా సెజ్‌లు, పరిశ్రమలు, రియల్ ఎస్టేట్‌ల వ్యాపార పర్వంగా మారిపోయి, రైతాంగ భూమి సమస్య కేంద్రంగా వ్యవసాయ సంక్షోభం ఇంకా తీవ్రమైంది. 1991 నుంచి ఇప్పటి వరకు గడచిన రెండు దశాబ్దాల కాలంలో రెండు లక్షలకు పైగా రైతులు విషం పుచ్చుకొని కుప్పకూలారు. ఇవన్నీ సర్కారీ హత్యలే అని చాలా మంది సూటిగానే నిందిస్తున్నారు. సామ్రాజ్యవాద, ప్రత్యేకించి అమెరికా సామ్రాజ్యవాద ఆర్థిక విధానాలను బేషరతుగా, నిస్సిగ్గుగా దేశ పాలకవర్గాలు అమలు చేస్తున్న ఫలితమే నేటి వ్యవసాయ సంక్షోభం అని ఏ మావోయిస్టులో అనడం లేదు. విషం పుచ్చుకుని ప్రాణాలు కోల్పోతున్న రైతన్నల గుండె చప్పుళ్లే చెపుతున్నాయి. దేశంలోని రైతు సమస్యను మరో మాటలో భూమి సమస్యను పరిష్కరిస్తానంటూ బయలుదేరిన భూదానోద్యమ వినోబా భావే కృషి ఎలా అపహాస్యం పాలైందో, ఆ తర్వాతి భూ పరిమితి చట్టాలు ఎలా విఫలమయ్యాయో మన దేశంలోని రైతు జీవితాలే వెల్లడి చేస్తున్నాయి. ఇలాంటి అనుభవాల నేపథ్యంలో గత మూడు దశాబ్దాలుగా కొనసాగుతున్న దండకారణ్య విప్లవోద్యమం మన ముందు వినూత్న పద్ధతులలో స్వావలంబన ఆర్థిక విధానాలను ఆవిష్కరిస్తోంది. వాటి గురించి ఇక్కడ తెలుసుకుందాం.

1980 జూన్-జూలైల నుంచీ దండకారణ్యంలో విప్లవోద్యమం కొనసాగుతోంది. దండకారణ్యం చాలా వరకు దట్టమైన అడవులతో, ఎత్తైన కొండలతో కూడుకొని ఉన్న ప్రబల ఆదివాసీ ప్రాంతం. దీని విస్తీర్ణం భారతదేశంలోని పలు రాష్ట్రాలకన్నా, యురప్ ఖండంలోని పలు దేశాల కన్న ఎక్కువే ఉంటుంది. అంకెల్లో చెప్పుకొంటే 55 వేల చదరపు కిలోమీటర్ల పైగానే ఉంటుంది. ఇక్కడి జనాభా విషయానికి వస్తే ఈనాడు 'జాస్మిన్ విప్లవాలు' అంటూ జరుగుతున్న అనేక దేశాల జనాభాకు మించే ఉంటుంది. ఇక్కడ 1995 తర్వాత నుంచి నూతన రాజ్యాధికార సంస్థలు ఉనికిలోకి వస్తున్నాయి. వీటిని విప్లవ ప్రజా కమిటీలు - జనతనా సర్కార్‌లుగా పిలుస్తున్నారు. ఇవి ఈనాటి దోపిడీ రాజ్య వ్యవస్థ ప్రత్యామ్నాయంగా ఏర్పడుతున్నాయి. 1980-95 మధ్య కాలంలో దండకారణ్యంలో కొనసాగిన తీవ్ర వర్గ పోరాటం ఫలితంగా గ్రామీణ దోపిడీ ఆర్థిక, రాజకీయ అంగాలు ధ్వంసమై ఏర్పడిన వాక్యూంలో నుంచీ జనతన సర్కార్లు ఉద్భవిస్తున్నాయి. 'దున్నే వారికే భూమి' ప్రాతిపదికన సాగిన తీవ్ర వర్గ పోరాటం ఫలితంగా దండకారణ్యంలో దాదాపు మూడు లక్షల ఎకరాల ప్రభుత్వ అటవీ భూములను కబ్జా చేసుకోగలిగారు. దీనితో వేలాది మంది పేద, భూమి లేని రైతాంగం సాధించిన విజయాలలో దండకారణ్యంలోని అత్యధిక మెజారిటీ రైతాంగానికి భూములు లభ్యమైనాయి. మూడు దశాబ్దాల వ్యవసాయ విప్లవం సాధించిన విజయాలలో దండకారణ్యంలోని అత్యధిక మెజారిటీ రైతాంగానికి భూమి లభించడం ప్రధానమైందిగా నిల్చింది. ఈ భూములను సంస్కరించే కర్తవ్యాన్ని జనతన సర్కార్లు చేపట్టాయి. ప్రజల చేతుల్లో ప్రాథమిక స్థాయిలోనైనా రాజ్యాధికారం లేకుండా ఇలాంటి కర్తవ్యాలను చేపట్టడం సాధ్యం కాదని బోధపడుతోంది. స్థానిక ప్రజలు ఎన్నుకొంటున్న జనతన సర్కార్లు తమను చుట్టుముట్టిన వేలాది మందితో కూడిన శత్రు బలగాల మధ్యనే 'విప్లవ ప్రజా కమిటీలకే సర్వాధికారాలు' నినాద స్ఫూర్తితో భూసంస్కరణలకు పూనుకుంటున్నాయి. వాటికే ప్రథమ ప్రాధాన్యతను ఇస్తున్నాయి.

1947లో దేశానికి 'స్వాతంత్ర్యం' వచ్చిందనుకుంటే ఇప్పటికి 65 సంవత్సరాలు నిండాయనుకోవచ్చు. ఈ 65 ఏండ్లలో దేశంలోని ఏ ఆదివాసీ ప్రాంతమూ అభివృద్ధి గడప తొక్కలేదు. మూడు దశాబ్దాల విప్లవోద్యమంతో ప్రజలు సాధించుకున్న ఏ ఒక్క విజయం కూడా దీని పొరుగున ఉన్న జిల్లాలో కానరాదు. ఆదివాసీ ప్రాంతాలు అంటేనే సంపద్వంతమైన ప్రాంతాలు. ఈ ప్రాంతాలన్నీ అపార ప్రకృతి సంపదలకు నిలయం. 1947కు ముందూ, తర్వాతా దోపిడీ పాలకవర్గాలు ఇక్కడి సమస్త సంపదలను కొల్లగొట్టుక పోవడానికి పూనుకున్నాయి తప్ప, వీటి అభివృద్ధి గురించి ఎన్నడూ పట్టించుకున్నది లేదు. ఈ దోపిడీ అంతా హింసా, దౌర్జన్యాలతో కూడుకొని అతి దుర్మార్గంగా సాగింది. సాగుతోంది. ఇక్కడ నుంచి ముడిపదార్థాలను తరలించుకుపోవడానికి కావల్సిన రోడ్లు, రైల్వేలైన్‌లు, ప్రాజెక్టులు, పరిశ్రమలు

మాత్రం 'అభివృద్ధి' అంటూ తెగ ప్రచారం సాగుతోంది. ఈ అభివృద్ధి దేశంలోని లక్షలాది మంది ఆదివాసులను, దళితులను విస్థాపితులను చేసింది.

వారి అభివృద్ధి అంచుల్లో నీళ్లు చేరని పంట పొలాలు, బీళ్లుగా మారిన పంట భూములు, గడ్డి సైతం మొలవని బీడు భూములు, కప్పులేని కొంపలు, పలుచబడిన అడవులు, కాలుష్యపు నీళ్లు దర్శనమిస్తుంటాయి. ఈ వాతావరణంలో బతుకు నావను నెట్టుకవస్తోన్న ఆదివాసీ రైతు వ్యవసాయం చాలా పురాతన పద్ధతుల్లో కొనసాగుతోంది. ఇక్కడి జీవనదుల నీళ్లు పంట భూములకు దక్కడం లేదు. కానీ పైపు లైన్ల ద్వారా పరిశ్రమల అవసరాలు తీరుస్తున్నాయి. గడచిన 65 సంవత్సరాలలో దండకారణ్యంలో రెండు శాతం పంట భూములకు మించి సాగునీరు అందివ్వలేని ప్రభుత్వ పంచవర్ష ప్రణాళికలు ప్రజల విశ్వాసాన్ని ఎన్నడో కోల్పోయాయి. దండకారణ్యం ఆదివాసీ వ్యవసాయంలో ఎకరాన దిగుబడి మూడు క్వింటాళ్లకు మించి లేదు. మైదాన ప్రాంతాల్లో ఆరు క్వింటాళ్లు దాటలేదు. కానీ 2010లో రాష్ట్ర అభివృద్ధి రేటు దేశంలో గుజరాత్ తర్వాత 11 శాతంతో రెండవ స్థానంలో నిల్చిందంటూ ఛత్తీస్‌గఢ్ ముఖ్యమంత్రి రమణ్‌సింగ్ మురిసిపోతున్నారు.

దోపిడీ పాలకవర్గాల, వారి ప్రభుత్వాల వైనం తెలిసిన జనతన సర్కార్లు భూముల్లో ఉత్పాదకతను పెంచే కార్యక్రమాలను ఈ సంవత్సరం నూతనంగా చేపట్టాయి. గ్రీన్‌హంట్ దాడుల మధ్య వీటిని ఒక సవాల్‌గానే తీసుకొన్నాయి.

దండకారణ్య జనతన సర్కార్ జోన్ సన్నాహక కమిటీ 2010 నవంబర్‌లో పూర్తి చేసుకున్న బడ్జెట్ సమావేశంలో రెవెన్యూ ఖర్చు కింద ఒక కోటీ యాభై లక్షల రూపాయలను వ్యవసాయ రంగానికి కేటాయించింది. ఇంత పెద్ద మొత్తంలో డబ్బు కేటాయింపులు జరగడం ఇదే మొదటిసారి. ఇది జనతన సర్కార్ వార్షిక బడ్జెట్‌లో సింహభాగాన్ని (50 శాతంకు పైగా) ఆక్రమించింది. ఈ డబ్బుతో భూముల చదును క్యాంపేయిన్‌ను చేపట్టాలని దండకారణ్య జనతన సర్కార్ అధ్యక్షులు జనతన సర్కార్లకు పిలుపునిచ్చారు. ఈ పిలుపు అందుకున్న దండకారణ్య రైతాంగం చాలా ఉత్సాహంగా ముందుకొచ్చింది. ఈ పిలుపును అమలు చేయడంలో భాగంగా ఏరియా జనతన సర్కార్లు 2011 జనవరిలో గ్రామ జనతన సర్కార్ల స్థాయి కమిటీ (స్టాండింగ్ కమిటీ) సభ్యులను ఆహ్వానించి కార్యశాలను (వర్క్‌షాప్) నిర్వహించాయి. ఈ కార్యశాలలో ప్రతినిధులు తమ తమ గ్రామాలలోని రైతాంగ భూముల వివరాలను చర్చించి పేద రైతుల భూములలో మొదట భూమి చదును క్యాంపేయిన్‌ను చేపట్టాలని అనుకొని తమ శక్తిమేరకు టార్గెట్‌ను నిర్ణయించుకున్నాయి. ఆదివాసీ వ్యవసాయ పద్ధతులలో గుణాత్మకమైన మార్పును ప్రవేశపెట్టడంలో భాగంగా ముందుగా భూమి చదును పూర్తిచేసి మళ్లీ నిర్మాణాన్ని చేపట్టాలనీ వాళ్లు గ్రహించారు. ఇవి చేయకుండా, ఆదివాసీ వ్యవసాయంలో నీటి తావుల వద్ద ధాన్యం గింజలు చల్లుకొని ఖరీఫ్ పంటలు తీసే పద్ధతిలో మార్పు తేలేమని గుర్తించారు. 'మిన్ను కురిస్తే మన్ను పండే' వ్యవసాయ పద్ధతులలో మార్పును ఆశించలేమని వాళ్లు అర్థం చేసుకున్నారు. దీంతో 'భూమి చదును – మళ్లీ నిర్మాణం' క్యాంపేయిన్‌గా పేరు పెట్టుకొని సాగారు. క్యాంపేయిన్‌ను భూంకాల్ దివస్‌తో జోడించి విప్లవ స్ఫూర్తితో కొనసాగించారు. ఇందుకు దండకారణ్య ముప్పై సంవత్సరాల విప్లవ వేడుకల సందర్భాన్ని ఎంచుకోవడం రైతాంగానికి గొప్ప ప్రేరణగా నిలిచింది.

దండకారణ్య ఉద్యమ చరిత్రలో ఫిబ్రవరి 10కి ఎంతో ప్రాముఖ్యత ఉంది. బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా గోండు ఆదివాసీ ప్రజలు స్వేచ్ఛా–స్వాతంత్ర్యాలను కోరుకొని కొనసాగించిన పలు ప్రజా తిరుగుబాట్లలో 1910 భూంకాల్ (ప్రజా) పోరాటం తీవ్రతలోనూ, విస్తృతిలోనూ గొప్పది. ఈ తిరుగుబాటు ఫలితంగా ప్రజలు 1910 ఫిబ్రవరి 10న బార్సూర్ (ఈనాటి దంతెవాడకు ఇరవై కిలోమీటర్ల దూరంలో ఉంది) రాజధానిగా తమ మాడియా రాజ్య స్థాపనను ప్రకటించుకున్నారు. ఆ తిరుగుబాట్లన్నిటి వారసత్వంగా కొనసాగుతున్న నేటి దండకారణ్య ప్రజా విప్లవోద్యమం ఆనాటి ప్రజల రాజ్య స్థాపనా దినాన్ని ఈనాటి విప్లవ కమిటీల స్థాపనా దినంగా మలచుకున్నాయి. విప్లవం అంటేనే రాజ్యాధికార స్థాపన. ఒకవర్గాన్ని మరో వర్గం హింసా యుతంగా కూలదోయడమే విప్లవం. ఈ అవగాహన నేపథ్యంలోనే ఫిబ్రవరి 10 జనతన సర్కార్ల స్థాపనా దినంగా మారింది. ఈసారి ఫిబ్రవరి 10 నుంచే 18 రోజుల పాటు 30 సంవత్సరాల దండకారణ్య విప్లవోద్యమ వేడుకలను ఘనంగా, విప్లవోత్సాహంతో జరపాలనీ పార్టీ చేసిన నిర్ణయాన్ని భూమి చదును క్యాంపేయిన్‌గా మలచుకొని దానిని ప్రజలు గొప్ప ప్రజా క్యాంపేయిన్‌గా కొనసాగించి జయప్రదం చేశారు.

దండకారణ్యానికి కేంద్ర అర్ధ సైనిక బలగాలు దిగి ఎనిమిదేళ్లు పూర్తయ్యాయి. 2005 జూన్ నుంచి మొదలైన సల్వాజుడుం 2010లో దండకారణ్య శాంతి సంఘర్ష్ సమితిగా అవతారమెత్తి కొనసాగిస్తున్న విధ్వంసం ఆగింది లేదు. అది ఇక్కడి ప్రజల జీవితాలనూ, ప్రజల ఆర్థిక వ్యవస్థనూ చిన్నాభిన్నం చేసింది. 2009 నుంచి కొనసాగిస్తున్న హరిత వేట (గ్రీన్ హంట్) దానిని ఇంకా తీవ్రం చేసింది. రైతుల నాగండ్లను విరగ్గొట్టడం, నాగటెడ్లను చంపుక తినడం, గొడ్డళ్లు – కొడవళ్లను ఎత్తుకెళ్లడం, విత్తనాలను తగులబెట్టడం, పొలాల్లోని పాకలను కాలబెట్టడం, పంటలు పండించే రైతులను హత్య చేయడం, రైతాంగ స్త్రీలపై అత్యాచారాలకు పాల్పడడం లాంటివి చిత్తానుసారంగా దోపిడీ రాజ్యం కొనసాగిస్తున్న చోట, చింతల్‌నార్, మోరపల్లి, తింపురం, తాడిమెట్లలు మంటలై మండుతున్న చోట జనతన సర్కార్లు విప్లవ భూసంస్కరణలు చేపట్టడం అనివార్యమైంది. 1970ల నాటి భూ పరిమితి చట్టాలు గానీ, ఆదివాసీ భూ బదలాయింపు నిరోధక చట్టాలు గానీ, 2006 నాటి నూతన అటవీ చట్టం గానీ ఇంకే ప్రభుత్వ చట్టం గానీ ఆదివాసీ రైతాంగానికి మేలు చేయలేదు. ఈ పరిస్థితులలో దేశ అంతర్గత భద్రతకు అతిపెద్ద ముప్పుగా తయారైన మావోయిస్టులు ప్రజా యుద్ధం చేస్తూనే తమ వ్యవసాయక విప్లవ లక్ష్యంలో భాగంగా విప్లవ భూసంస్కరణ కార్యక్రమాలు చేపడుతూ రైతాంగాన్ని – ధైర్యంగా నిలబెడుతున్నారు. ఈ ఇరవై ఏండ్లలో నూతన ఆర్థిక విధానాల ఫలితంగా తీవ్రమైన వ్యవసాయ సంక్షోభంతో దేశవ్యాప్తంగా లక్షల సంఖ్యలో రైతాంగం ఆత్మహత్యలు చేసుకుంటున్న తీరు చూస్తున్నాం కానీ, దండకారణ్యంలో ఇలాంటి ఆత్మహత్యలు ఒక్కటి కూడా జరగలేదు. దండకారణ్యం పొరుగున ఉన్న ఛత్తీస్‌గఢ్ ప్రాంతంలో 2010లో సర్కారీ లెక్కల ప్రకారం 9489 మంది రైతులు ఆత్మహత్యలు చేసుకున్నారు. అవును, దండకారణ్యంలోనూ అరకొరగా ఆత్మహత్యలు జరుగుతున్నాయి. భారత భద్రతా బలగాల ఉక్కు వలయాలలో బందీలుగా మారిన దండకారణ్య ఆదివాసీ రైతాంగం ఖాకీల క్రౌర్యాన్ని తట్టుకోలేక బుధురాం, లక్ష్మయ్య లాంటి గుండె చెదిరిన రైతులు ఆత్మహత్యలు చేసుకుంటున్న ఉదాహరణలున్నాయి. ఈ నేరం బుధురాం, లక్ష్మయ్యలది ఎంత మాత్రం కాదు. దీనికి సోనియా, మన్మోహన్ సింగ్, చిదంబరం, రమణ్‌సింగ్‌లు బాధ్యత వహించాలి. విశ్వరంజన్ (ఛత్తీస్‌గఢ్ డి.జి.పి.) విరేశ్ ప్రభు (గడ్‌చిరోలి ఎస్.పి.)లు జవాబు చెప్పాలి.

2011 ఫిబ్రవరి 11 భూంకాల్ దివస్ రోజు ఊరూరా రైతాంగం ఉత్సాహంగా వేడుకలు జరుపుకుంది. తమ ప్రాంతంలో జనతన సర్కార్లను నిర్మించడంలో, వాటిని కాపాడి విస్తరించడంలో దోపిడీ పాలకవర్గాల భద్రతా బలగాలతో ధైర్యంగా పోరాడి తమ 'పడిమోర' (పూర్వీకుల / అమరయోధుల) ఆశయ సాధనలో అసువులు బాసిన ప్రజా వీరులందరినీ స్మరించుకొని రెండు నిముషాలు మౌనం పాటించారు. జనతన సర్కార్ల నిర్మాణంలో, పని

దండకారణ్యంలోని ఒక ఏరియాలో జరిగిన కేంపేయిన్ వివరాలు ఇలా ఉన్నాయి. (కేవలం 11 పంచాయితీల వివరాలు మాత్రమే)

| | | |
|---|---|---|
| 1. | పనిలో పాల్గొన్న మొత్తం ప్రజలు | 61,099 |
| | స్త్రీలు - 22,138 | |
| | పురుషులు - 38961 | |
| 2. | మొత్తం పని దినాలు | 929,835 |
| 3. | భూమి చదును - మళ్లీ నిర్మాణం - | 195 ఎకరాలు |
| 4. | లబ్ధి పొందిన రైతాంగం - | 167 కుటుంబాలు |
| 5. | పనిలో ఉపయోగించిన శ్రమ పరికరాలు | 55,000 |
| 6. | ప్రజా మిలిషియా ఆయుధాలు | |
| | విల్లులు | 7129 |
| | బాణాలు | 17,690 |
| | బాంబులు | 200 |
| | కత్తులు | 466 |
| | బరిసెలు | 313 |
| 7. | తిండి ఖర్చు - 8 క్వింటాళ్ల బియ్యం కొనుగోలు (చందాలు విడిగా ఉన్నాయి.) | |
| | మాంసం గొడ్లు | 24 |
| | మేకలు | 8 |
| | కోళ్లు | 14 |
| | డబ్బు ఖర్చు | రు. 2,74,808 |

విధానంలో, విస్తరణలో, దేశ - విదేశాల్లో వాటి గురించి ప్రచారం చేసి శ్రమజీవుల సంఘీభావాన్ని కూడగట్టడంలో అద్వితీయమైన పాత్ర పోషించిన అమరుడు కా. చెరుకూరి రాజ్‌కుమార్ (కేంద్ర కమిటీ సభ్యుడు, పార్టీ అధికార ప్రతినిధి) స్మృత్యార్థం నిర్మించిన స్థూపాల వద్ద ఈ కార్యక్రమం జరగడం విశేషం. అమరుల పోరాట స్ఫూర్తితో భూ చదును ప్రజా క్యాంపేయిన్‌ను జయప్రదం చేస్తామనీ దండకారణ్య విప్లవ ప్రజానీకం ప్రతిన బూనింది. విప్లవ సాంస్కృతిక బృందాలు - చేతనా నాట్యమంచ్ - నిర్వహించిన సాంస్కృతిక కార్యక్రమాలను తిలకించిన జనం చివరకు వారూ అందులో భాగమై సామూహిక ఆట పాటలుగా మార్చుకొని సంప్రదాయ నృత్యాలతో రాత్రంతా గడిపారు. ఈ వేడుకంతా వారు చేపట్టిన 18 రోజుల ప్రజా క్యాంపేయిన్‌కు ఆలంబనగా నిలిచి వారికి నూతన శక్తి, ఉత్సాహాల నిచ్చింది. ఈ ప్రజా క్యాంపేయిన్ కొన్ని చోట్ల నెల రోజులకు పైగా కూడా జరిగి తమ లక్ష్యాలను పూర్తి చేసుకుంది.

దండకారణ్య వ్యాప్తంగా ఆ మూడు వారాలు మున్నెన్నడూ కానరాని విధంగా వేలాది రైతాంగం భూమి చదను పనుల్లోకి చురుగ్గా కదిలారు. ఆ మూడు వారాల్లో దండకారణ్యంలోని ఏ ఊరుకెళ్లినా ఉత్సాహంతో ఉరుకులు వేస్తున్న స్త్రీ - పురుషుల శ్రమ బృందాలే అగుపడేవి. వారంతా తమ చేతుల్లో శ్రమ పరికరాలతో ఉండి, గునపం పోట్లతో మట్టి పెళ్లలను పెకిలిస్తూ, పారలతో మట్టిని తట్టల్లోకి ఎత్తుతూ జట్లు - జట్లుగా మోసుకెళ్లే దృశ్యాలే కానవచ్చేవి. పని స్థలాల వద్ద కొలిమి వెలిసింది. కమ్మరి, వడ్రంగికి ఊపిరాడని పని ఉండేది. గాయపడిన వారికి చికిత్స చేయడానికి రైతాంగ వైద్యులు పనుల్లో పాల్గొంటూ సిద్ధంగా ఉండేవారు. జనతన స్కూలు పిల్లలు, ఉపాధ్యాయులు కూడా వారం రోజులు పనుల్లో పాల్గొనాలనీ జనతన సర్కార్లు కోరాయి. ఉత్పత్తిలో విద్యను సమన్వయం చేసుకోవడం, శ్రమశక్తిని గౌరవించడం తెలిసిన పిల్లలూ, ఉపాధ్యాయులూ ఆ క్యాంపేయిన్‌లో భాగమయ్యారు. పని స్థలాల వద్దనే సామూహిక పాఠశాలలు వెలిశాయి. పనిస్థలాలే ఊళ్లుగా మారాయి. గ్రామస్తుల తిండి, నిద్ర, సంసారాలు అన్నీ ఆ పద్దెనిమిది రోజులు పని స్థలాల వద్దే జరిగాయి. చంటి పిల్లల తల్లులు సైతం పనుల్లో పాల్గొన్నారు. వారి చంక పిల్లల కోసం పొలాల్లోని ఇప్పచెట్లకు కొమ్మ - కొమ్మకూ ఉయ్యాలలే. వాటిని ఊపుతూ పిల్లలను నిద్రపుచ్చడానికి ఎడపిల్లలతో ఏర్పడ్డ టీములను చూస్తుంటే ముచ్చటేసింది. శ్రమలో పాల్గొన్న ప్రజలందరికీ జనతన సర్కార్లే తిండి సమకూర్చినప్పటికీ ప్రజలు చాలా చోట్ల బియ్యం, కూరగాయలు అందజేసి ఆదుకున్నారు. పని స్థలాలన్నీ ప్రజా కమ్యూన్‌లను తలపింపజేసి, మాంస ప్రియులైన ఆదివాసీలు చివరి రోజు మాంసంతో విందులు చేసుకున్నారు.

పోలీసు వలయంగా మారిన దండకారణ్యంలో పని స్థలాలు మినహాయింపు కాదు. ప్రజా క్యాంపేయిన్ గురించి స్పష్టంగా అర్థమైన పోలీసులు వాటిని విచ్ఛిన్నం చేయడానికి తీవ్ర ప్రయత్నాలు చేశారు. పోలీసుల దాడుల నుంచీ పనిస్థలాలకు భద్రత కల్పించడానికి ప్రజా మిలీషియా, ప్రజా విముక్తి గెరిల్లా సైనికులు అహర్నిశలూ కృషి చేశారు. పని బృందాలు, కాపలా బృందాలుగా విడిపోయి ద్వంద్వ బాధ్యతలు సమర్థవంతంగా కొనసాగించారు. అయినప్పటికీ పశ్చిమ బస్తర్ డివిజన్‌లో (బీజాపూర్ జిల్లా) పొరపాటున పోలీసుల వలలో చిక్కిన రైతును వాళ్లు నిర్దాక్షిణ్యంగా హత్య చేశారు. అయినా పనులు మాత్రం అగింది లేదు. ఎందుకంటే జీవితమే యుద్ధంగా మారిన దండకారణ్యంలో నెత్తురు చిందకుండా రోజు గడవదన్న అనుభవం గత ఆరేళ్లుగా వారికెరుకైందే.

పనిస్థలాల వద్ద ఎనిమిది గంటల పని దినం అమలైంది. గంట, గంటకూ 5-10 నిముషాలు స్వల్ప విరామం కాగా మధ్యాహ్న భోజన విరామం గంట ఉండింది. రోజూ సాయంత్రం సమయంలో సామూహిక చర్చలు, ప్రపంచ వార్తలు వినేవాళ్లు. తెహరీర్ చౌక్ ప్రదర్శనలు, అరబ్బు దేశాల ప్రజల నిరసన ర్యాలీలు, ప్రభుత్వ బదిలీల డిమాండ్ల గురించి రైతాంగానికి గెరిల్లాలు బోధించేవాళ్లు. ఆ తర్వాత శ్రామిక గీతాలు, నృత్యాలు, నాటకాలు విజ్ఞానదాయకంగా, వినోదాత్మకంగా ప్రదర్శించే వారు. ఈ ప్రజా క్యాంపేయిన్ దండకారణ్య విప్లవోద్యమంలో ఒక కొత్త ఒరవడిని సృష్టించింది. ఈ క్యాంపేయిన్‌లో పాల్గొన్న రైతాంగం ఇలాంటి క్యాంపేయిన్‌లు మళ్లీ మళ్లీ చేపడుదామనీ జనతన సర్కార్లను కోరారు.

ముప్పై సంవత్సరాల దండకారణ్య విప్లవోద్యమ వేడుకలను ఘనంగా, ఉత్సాహంగా జరుపుతున్న రైతాంగం కొనసాగించిన మూడు వారాల ప్రజా క్యాంపేయిన్‌లో ఒక లక్షా ఇరువై వేలకు మించిన ప్రజానీకం పాల్గొన్నారు. వారంతా కలిసి ముప్పై లక్షల పని దినాలను పూర్తి చేశారు. ఫలితంగా వెయ్యిమంది పేద రైతుల భూములు చదునవడంతో మళ్లు నిర్మాణమయ్యాయి. అదనంగా చాలా చోట్ల రైతాంగం తమ జనతన సర్కార్ల, గెరిల్లాల అవసరం కోసం సమష్టి భూముల్లో కూడా పనిచేశారు. రైతాంగ భూములకు అవసరమైన సాగునీటి సౌకర్యాన్ని కల్పించడానికి మొత్తంగా యాభైకి పైగా చెరువులు, కుంటలు నిర్మించారు. అక్కడక్కడ కంచెలు తీశారు. 136 మంది ఇండ్లులేని రైతులకు కొత్తగా ఇండ్లు నిర్మించి ఇచ్చారు. ఈ క్యాంపేయిన్ కోసం జోన్ సర్కార్ కేటాయించిన డబ్బులో మూడవ వంతు మాత్రమే ఖర్చైంది. జనతన సర్కార్ల పద్దుల్లో మిగులు డబ్బు లాప్స్ కావడం అనేది ఉండదు కాబట్టి ఆ డబ్బును ఇలాంటి అవసరాల కోసమే రెండవ విడుత ఖర్చు తీసుకోవాలనీ ప్రజలు అభిప్రాయపడ్డారు.

దండకారణ్య విప్లవోద్యమాన్ని అణచివేయడానికి భారత పాలకవర్గాలు కొనసాగిస్తున్న సైనిక దాడికి తోడు సంస్కరణల తతంగం కూడా నడుస్తోంది.

*లంబాడీలకు ఎస్.టి. జాబితాలో రిజర్వేషన్ కల్పించడం వల్ల అట్టడుగు ఆదివాసులకు అన్యాయం జరుగుతోందని అంటున్నారు* **మైపతి అరుణ్‌కుమార్**

# ఎస్.టి. జాబితా - లంబాడీలు

అరవై నాలుగేళ్ల స్వాతంత్ర్య పాలనలో యాభై ఐదేళ్ల ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అవతరణలో పాలకవర్గ రాజకీయ పార్టీలు ఆదివాసీల అభివృద్ధికి పాటుపడకుండా, ఆదివాసులను, అణగదొక్కే విధానాలకు పాల్పడు తున్నాయి. ఓటు బ్యాంక్ రాజకీయాలకు ప్రాణం పోస్తూ కులాలను తెగలలో విలీనం చేసి ఆదివాసుల భవితవ్యాన్ని ప్రశ్నార్థకం చేస్తున్నాయి. దీనికి ఉదాహరణ 1976లో ఎస్.టి., జాబితాలో అక్రమంగా కలుపబడిన లంబాడీలు ఆదివాసీల రిజర్వేషన్‌లను దోచుకుంటున్నా పాలకులు మాత్రం ఏం పట్టనట్లు ఉంటున్నారు. దీనిని సహించలేని ఆదివాసీలు, రిజర్వేషన్‌లలో దగాపడుతున్నామని నేడు పోరాట మార్గమే శరణ్యంగా ఆదిలాబాద్ నుంచి మరొక చారిత్రక పోరాటానికి సిద్ధం అవుతున్నారు. లంబాడీలను ఎస్.టి. జాబితా నుంచి తొలగిస్తేనే ఆదివాసీల మనుగడ అని ఉద్యమాన్ని తీవ్రతరం చేస్తున్నారు. ఇటువంటి సందర్భంలో ఇంతకూ లంబాడీలు షెడ్యూల్డ్ తెగకి చెందినవారా? చరిత్ర కాలం నుండి ఆదివాసీ తెగలతో సహజీవనం చేసినట్టు, చారిత్రక పోరాటం చేసినట్లు ఏమైనా ఆధారాలున్నాయా? భారత రాజ్యాంగం ప్రకారం వీరిని ఎస్.టి.లుగా గుర్తించారా? లేక అక్రమంగా కొనసాగు తున్నారా? అనేది ఒకసారి చరిత్రపుటల్లోకి పోయిచూద్దాం.

భారతదేశ మూలవాసులు ఆదివాసీలు. అనగా అనాది నుంచి భారతదేశంలో ఉంటున్న భారతీయులు. వీరిని మొదటగా ద్రావిడ పూర్వ ఆదివాసీలు అని పిలిచేవారు. ఈ వారసత్వ ఫలితమే ప్రస్తుతం ఆదివాసీ తెగలు. దీని గురించి కేంబ్రిడ్జ్ హిస్టరీ ఆఫ్ ఇండియా, వాల్యూమ్ 1లో స్పష్టంగా పేర్కొనబడింది. ఆదివాసీల తర్వాతనే 92 శాతం ప్రజలు భారతదేశానికి వివిధ మతాల, కులాల వారు వచ్చినారు. సమతలమైన, సారవంతమైన భూమి, వందలాది నదులతో కూడిన భాగ్యవంతమైన సహజ వనరులు కలిగిన భారతదేశం వ్యవసాయమే సమాజానికి ప్రధాన జీవనాధారంగా కొనసాగుతోంది. అందుకే గత పది వేల సంవత్సరాలుగా భారత దేశానికి ప్రజలు వలసలు వస్తున్నారు.

మధ్య భారతదేశంలో మధ్యప్రదేశ్, బీహార్, ఒడిశా, ఛత్తీస్‌ఘడ్, పశ్చిమ బెంగాల్ ఈ మధ్య భూభాగాన్ని గోండ్వానా రాజ్యమని అంటారు. ఈ గోండ్వానా రాజ్యాన్ని ఏలిన వారు గోండ్‌లు, కోయతూర్ (కోయ)లు.

---

భూమి చదును ప్రజా క్యాంపేయిన్ చేపట్టిన సమయంలోనే కేంద్రం రు. 1376 కోట్లు కేటాయించింది. తాడిమెట్ల అగ్నికాండ, హింసాకాండకు ముందు చిదంబరం గడ్‌చిరోలి పర్యటించి వెళ్లారు. ఆ తర్వాత ఆయన సహాయమంత్రి అజయ్ మాకన్ చత్తీస్‌గఢ్, గడ్‌చిరోలి పర్యటించారు. వీళ్ల పర్యటన తర్వాత సివిల్ ఆక్షన్ ప్రోగ్రాంలు వేగవంతమయ్యాయి. రాష్ట్ర, కేంద్ర పోలీసులు పోటీ పడుతున్నారు. సంతల్లో రైతులకు తొడిగి విడిచిన (సెకండ్ హ్యాండ్) గుడ్డలు పంచుతున్నారు. మందులు ఇస్తున్నారు. సైకిళ్లు ఇస్తున్నారు. బోల్లు - బొక్కెలు అందజేస్తున్నారు.

యువతకు ఆటల పోటీలు నిర్వహిస్తున్నారు. కాని వాళ్ల సంస్కరణల్లో రైతాంగ పంట భూములకు గ్యారంటీ ఇవ్వడం లేదు. టాటాలు, ఎస్.ఆర్.లు, జిందల్‌లు, మిత్తల్‌లు మీ అడవుల్లోకి రారు అనే హామీలు లేవు. పొలాల్లోకి దిగింది లేదు, మట్టి తట్టలు మోయడమూ లేదు. ఇండ్లు కట్టింది లేదు. చెరువులు పోసేది లేదు. అమెరికా వాళ్ల ఎల్.ఐ.సి. (తక్కువ తీవ్రత యుద్ధం) మాన్యువల్‌లో డబ్ల్యూఎచ్ఎఎం (హృదయాలను, మెదళ్లను గెలుచుకోవడం) గురించి చెప్పిందాంట్లో ఇవేవీ లేవు. 'గెరిల్లాలతో గెరిల్లాలుగా పోరాడాలి' అనే శిక్షణలోనూ ఇవి ఉండవు. కాకపోతే వాళ్లు విప్లవకారులను ఉగ్రవాదులంటూ, సంఘ వ్యతిరేక, జాతి వ్యతిరేక, అభివృద్ధి నిరోధక శక్తులంటూ నిందిస్తూ తెగ ప్రచారం చేయడం ఉంటుంది.

ఏప్రిల్‌లో ప్రజా క్యాంపేయిన్ సమీక్షలు జరిగాయి. ఈ క్యాంపేయిన్ జరగడం ద్వారా ప్రజలు పొరుగు రాష్ట్రాలకు వలస వెళ్లడం ఆ మేరకు నిలిచిందంటూ, ఆ సమయంలో తీవ్రమైన పోలీసు దాడులను సామూహికంగా ఎదుర్కొనడానికి వీలు పడిందంటూ గ్రామ సభలలో రైతాంగం సమీక్షించారు. సరిగ్గా అదే సమయంలో ఢిల్లీలో అన్నా హజారే అవినీతికి వ్యతిరేకంగా జనలోక్‌పాల్ బిల్లును తేవాలంటూ ఆమరణ నిరహారదీక్షకు పూనుకున్నాడు. ఏళ్ల తరబడిగా పట్టణ యువతలో గూడుకట్టుకుంటూ తీవ్రమవుతున్న వ్యవస్థ వ్యతిరేకతను వ్యక్తం చేస్తూ ఢిల్లీ రోడ్లపైకి యువత చేరింది. 'నియోరిచ్ వర్గం'లో చాలామంది హజారేకు మద్దతన్నారు. ఈ వ్యవహారమంతా ప్రమాద సంకేతాలను అందించేల ఉందని గ్రహించిన సోనియా, మన్మోహన్‌లు నాలుగు రోజుల్లోనే హజారే డిమాండ్‌కు ఒప్పుకున్నారు. ఈలోగా దండకారణ్యంలో సమీక్షలూ ముగిసాయి. కానీ రైతాంగమంతా ఆ బిల్లు చట్టమైనా తాత్కాలిక సురక్షా తొడుగులాగానైనా ప్రజలకు మేలు చేయదంటూ వ్యాఖ్యానించారు. దండకారణ్యంలో ప్రజలు తమ విప్లవ ప్రభుత్వాలను ఏర్పర్చుకుంటూ చేపడుతున్న స్వావలంబన ఆర్థిక విధానాలే ఈ దేశానికి, పీడిత ప్రజలకు ప్రత్యామ్నాయం తప్ప మరోటి ఏం లేదన్నది వాస్తవం. బాబాల మహిమలపై భ్రమలు నింపే, భూస్వామ్య, సామ్రాజ్యవాదుల ప్రయోజనాలకు పాటుపడే భారత దోపిడీ పాలకవర్గాలకు పిడుగుపాటు దెబ్బలతో తప్ప మరో విధంగా బోధపడదు.

*(రచయిత దండకారణ్య ఉద్యమ నాయకులు)* వీ

ఆదివాసీలు గోండ్వానా ప్రాంతంలో పరిపాలించిన చారిత్రక ఆధారాలు చూస్తే ఆదిలాబాద్ జిల్లాలో సిర్పూర్ (టి), ఉట్నూరు, చెన్నూరు, నిర్మల్ ప్రాంతాలను ఆత్రం వంశీయులు పాలించారు. దానికి సాక్ష్యంగా సిర్పూరులో గోండ్‌ల కోటలు కూడా సజీవంగా ఉన్నవి. మహారాష్ట్ర (నాగపూర్)ను మడవి వంశస్తులు పరిపాలించారు. చంద్రం, ఆత్రం వంశస్తులు బల్లార్షను, జబల్‌పూర్, శివని (మధ్యప్రదేశ్), జగదల్‌పూర్, రామ్‌పూర్ (ఛత్తీస్‌ఘడ్), రామ్‌టెక్ (మహారాష్ట్ర)ను పాలించారు. అందుకే ఈ ప్రాంతాలు గోండ్ రాజుల నామకరణంతోనే ఇప్పటికీ పిలువబడుతున్నవి. గోండ్వానా రాజ్యాన్ని ఏలిన చివరి రాజు నీల్‌కంఠషా. భారతదేశానికి రాచరిక పాలనను నేర్పించింది గోండ్‌లే. అగ్నిని కనుగొన్నది కూడా గోండ్‌లే.

అదే విధంగా చరిత్రతో ఆదివాసులకు గల సంబంధాలను చూస్తే రామాయణంలో రామునికి ఫలాలు అందించిన శబరి వెరియర్ ఎల్విన్ దృష్టిలో 'భారతీయ జీవితానికి గిరిజనులు ఇవ్వగల ఫలాలకు ప్రతీక' అని పేర్కొన్నాడు. ఆమె పేరుతోనే శబరి నది పేరుగాంచింది. మహాభారతంలో ఏకలవ్యుడు గురుదక్షిణగా ద్రోణాచార్యునికి బొటనవేలు కోసిచ్చి పురాణాల్లో ఆదర్శంగా నిలిచినాడు. ముండా, నాగ తెగలు పాండవులకు వ్యతిరేకంగా కౌరవ సమాజంలో పోరాటం చేశారు. భీముడు ఆదివాసీ యువతికి జన్మించిన ఘటోత్కచుడు యుద్ధంలో వీరోచితంగా పోరాడి వీరమరణం పొందాడు. క్రీ.శ. రెండవ శతాబ్దం వరకు నాగాల రాజ్యం వర్ధిల్లింది. ప్రాచీన సాహిత్యంలో గాని, సంస్కృతిలో గాని ఆదివాసులకు విపులమైన వివరణ ఉంది.

ఆదివాసులకు రాచరిక పోరాటాలు, బ్రిటిష్ వ్యతిరేక పోరాటాలతో పాటు, స్వాతంత్ర్య అనంతరం కూడా పోరాటం చేయక తప్పడం లేదు. 13వ శతాబ్దంలో (1260-1300) ఆదివాసి ప్రాంతాలకు స్వయం పరిపాలన అధికారం కల్పించాలని కాకతీయ రాజులపై మేడారం కేంద్రంగా సమ్మక్క సారలమ్మలు పోరాటం చేశారు. 1778లో బీహార్ కొండల్లో పహాడియాలో తిరుగుబాటు, 1803లో ఆంధ్రప్రదేశ్‌లో కోయ, కొండరెడ్లు, 'రంప పితూరి', 1855లో పశ్చిమ బెంగాల్‌లో సంతాల్ తిరుగుబాటు, 1895లో బిర్సాముండా నాయకత్వంలో బ్రిటిష్ వారిపై 'ఉల్‌గులాన్ ఉద్యమం', 1836-46 కాలంలో ఆదిలాబాద్ జిల్లా నిర్మల్ ప్రాంతంలో రాంజీగోండ్ బ్రిటిష్ పాలకులకు వ్యతిరేకంగా పోరాటం, తదనంతరం ఈ పోరాటంలో రాంజీగోండుతో సహా వెయ్యి మంది గోండ్‌లను నిర్మల్‌లోని మర్రి చెట్టుకు ఉరితీస్తే, ఆ చెట్టు ఇప్పటికీ సజీవంగా అమాయక గోండ్‌ల ఆర్తనాదాలను వినిపిస్తుంది. 1928-40లో 'జల్ జంగల్ జమీన్'ల పై హక్కు కోసం జోడేఘాట్ కేంద్రంగా కొమురం భీం పోరాటం. ఇంత పురాతన చరిత్ర, ఆత్మగౌరవం కోసం, మనుగడ కోసం, స్వయం ప్రతిపత్తి కోసం, అలుపెరగని పోరాటాల ఫలితంగా రాజ్యాంగ నిర్మాతలు ఆదివాసి ప్రాంతాలకు ప్రత్యేకమైనటు వంటి రిజర్వేషన్‌లు, 5, 6 షెడ్యూల్‌లు కల్పించారు. కాని భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటుతో ఆంధ్రప్రదేశ్‌లో ఆదివాసి ప్రాంతం కొంత భాగం విలీనం కావల్సి వచ్చింది.

ఇంత చరిత్రలో రామాయణం, మహాభారతం పురాణాల్లో రాజరిక పాలనలో, స్వాతంత్ర్య సమరంలో, సంస్కృతి సాంప్రదాయాలలో, భాషా వేషాధారణలో, భౌగోళిక విస్తీర్ణ ప్రాంతాలలో, చారిత్రక పోరాటంతో సహజీవనం చేసినట్టు ఎక్కడ కూడా ఆదివాసీలతో లంబాడీలకు సంబంధాలు లేవు.

షెడ్యూల్డ్ తెగలతో లంబాడీలను ఏ రాష్ట్రంలో కలపకున్నా మన రాష్ట్రంలో కలిపినందుకు ప్రతిఫలం ఏమిటనేది ఇప్పుడు పరిశీలిస్తే 2001 జనాభా లెక్కల ప్రకారం రాష్ట్రంలో 50,24,104 మంది గిరిజనులు నివసిస్తున్నారు. ఈ జనాభాలో 41 శాతం మంది షెడ్యూల్డ్ ప్రాంతంలో 30 ఆదివాసీ తెగలుగా నివసిస్తుండగా, మైదాన ప్రాంతంలో 59 శాతం మందికి చెందిన ఐదు తెగలు నివశిస్తున్నాయి. మైదాన ప్రాంత గిరిజనుల అక్షరాస్యత 34 శాతం కాగా, షెడ్యూల్డ్ ఏరియా విద్యార్థుల అక్షరాస్యత - పురుషులది 17 శాతం కాగా, మహిళలది 8.64 శాతం. రాజ్యాంగంలో సూచించిన 366 ఆర్టికల్ 25 ప్రకారం ఆంధ్రప్రదేశ్‌లో అడవి ప్రాంతంలో స్థిర నివాసం కలిగిన 30 తెగల సమూహాలు, 1. ఆంద్, 2. బగత, 3. బిల్లులు, 4. చెంచులు, 5. గదబలు, 6. గోండ్, 7. నాయకపోడు, 8. గౌడు, 9. హిల్‌రెడ్డి, 10. జాతాపు, 11. కమ్మర, 12. కట్టునాయక్, 13. కోలాం, 14. కొండదొర, 15. కొండకాపు, 16. కొండరెడ్డి, 17. కోందులు, 18. కోటియ, 19. కోయ, 20. కులియ, 21. మలీలు. 22. మన్నెదొర, 23. మూకదొర, 24. నాయక్, 25. పరధాన్, 26. పోర్జ, 27. రెడ్డిదొర, 28. రేన, 29. సవర, 30. తోటి తెగలను గుర్తించడం జరిగింది. వీరినే గిరిజనులు, గిరిపుత్రులు, అడవి పుత్రులు, వనవాసీలు, మూలవాసులు, ఆదివాసీలు అని పిలుస్తారు. కాని నేడు ఈ తెగలకు రిజర్వేషన్ ఫలాలు అందక నానాటికీ కనుమరుగయి పోతున్నవి.

1950 నుంచి 1975 కాలం వరకు అభివృద్ధి వైపు సాగిన ఆదివాసీల ప్రయాణం కాంగ్రెస్ ప్రభుత్వం లంబాడీలను ఎస్.టి. జాబితాలో చేర్చాలనే నిర్ణయంతో శాపంగా మారిందని చెప్పవచ్చు. నిజాం ప్రభుత్వ పాలనాకాలంలో ఆదివాసీలపై, ఆదివాసీల స్థితిగతులపై సమగ్ర అధ్యయనం జరిపిన ఆంత్రపాలజిస్ట్ ప్రొ. హేమెన్‌డార్ఫ్ ఆదివాసీలు అభివృద్ధి చెందాలంటే శతాబ్ది కాలం పడుతుందని నివేదించారు. నివేదికలో ఆదివాసీలు అభివృద్ధి చెందే వరకు ఇతర కులాలను గాని, ఇతర సమూహాలను గాని ఎస్.టి. జాబితాలో చేర్చవద్దని సూచించాడు. కాని కనీస అక్షర జ్ఞానం లేని ఆదివాసీ సమూహాలు మాకు అన్యాయం జరుగుతుందని గొంతెత్తలేని పరిస్థితులలో స్వార్థపర రాజకీయాలతో ఓటు బ్యాంక్ కోసం 1970 వరకు బి.సి.-ఎ లుగా జి.ఒ. ఎం.ఎస్. నెం. 1773 (ఎస్. డబ్ల్యు.), 23 సెప్టెంబర్ 1970 ప్రకారం రిజర్వేషన్‌లను అనుభవించిన లంబాడీలతో పాటు, ఎరుకల, యానాది కులాలను రాష్ట్రపతి ఆమోద ముద్ర లేకుండా పార్లమెంట్‌లో బిల్లు ప్రవేశపెట్టకుండా 1976 అక్టోబర్ 29న షెడ్యూల్డ్ తెగల చట్టం, యాక్ట్ 108 జాబితా నెం. 29, జి.ఒ.ఎం.ఎస్. నెం. 149 ప్రకారం డినోటిఫైడ్ ట్రైబ్స్‌గా ఐదు సంవత్సరాల ప్రాతిపదికన కలపడం జరిగింది.

1961 జనాభా లెక్కల ప్రకారం 96,174 మంది జనాభా కలిగిన లంబాడీలు, 1971 జనాభా లెక్కల ప్రకారం 1,32,464 కు పెరిగారు. 1976లో ఎస్.టి. జాబితాలో చేర్చిన తదుపరి మహారాష్ట్ర - బి.సి.,

రాజస్థాన్ - ఒ.సి., కర్ణాటక - ఎస్.సి.లుగా చలామణి అవుతున్న వారు ఆంధ్రప్రదేశ్‌కు భారీగా వలసలు వచ్చి 1981 జనాభా లెక్కల ప్రకారం 11,58,342కి పెరిగారు. 2001 జనాభా లెక్కల ప్రకారం 20,77,947కి పెరిగారు. ప్రభుత్వ నిబంధనలు రెవెన్యూ గణాంకాల ప్రకారం 1976 నుంచి 2001 వరకు ఏడు లక్షల జనాభా మాత్రమే పెరగాలి. కాని ఇంత జనాభా ఎలా పెరిగారు? కారణం ఏమిటనేది పాలకులకు తెలియనిది కాదు. కాని ఆదిమ తెగలు అంతరించి పోతుంటే మాత్రం దున్నపోతు మీద వాన కురిసినట్టుగా వ్యవహరిస్తోంది. 2001 జనాభా లెక్కల ప్రకారం హిల్ రెడ్డి - 77, కులియ - 368, కట్టు నాయక్ - 161, బిల్లులు - 421, తోట్-2074లు మాత్రమే ఉన్నారు.

విద్య, ఉద్యోగ, ఉపాధి, రాజకీయ రంగాలలో లంబాడీల ఆధిపత్యాన్ని గమనిస్తే ప్రజాస్వామ్యంలో సామాజిక న్యాయాన్ని పాలకులు బొంద పెట్టారని చెప్పవచ్చు. విద్యారంగంలో 2005 ఎస్.టి. రిజర్వేషన్ జాబితాను పరిశీలిస్తే బి.ఇ. / బి.టెక్ సీట్లు 6452లో 5821 సీట్లు లంబాడి, యానాది, ఎరుకల వారు పొందగా 30 తెగలకు 127 మాత్రమే లభించినవి. ఐ.ఐ.టి., ఎన్.ఐ.టి., మెడిసిన్ కోర్సులలో చేర్పించాలనే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ప్రతిభ పాఠశాలలు, మూడు కళాశాలలు, ఏడు గురుకులాలలో లంబాడీ వర్గం పైచేయి సాధించుకుంది. 2003-06 ఉస్మానియా యూనివర్సిటీ పి.జి. అడ్మిషన్‌లలో 1689 గిరిజన విద్యార్థులలో 1441 మంది లంబాడీలు ఉన్నారు. 2007-08 బేగంపేట (హైదరాబాద్) పబ్లిక్ స్కూల్ అడ్మిషన్‌లలో 194 సీట్లలో 190 లంబాడీలు పొందారు. ఉద్యోగ రంగంలో చూస్తే 2005లో వంద శాతం ఉద్యోగాల్లో 57 శాతం లంబాడీలు, 26 శాతం ఎరుకలు, ఏడు శాతం యానాదిలు పొందారు. 30 ఆదివాసీ తెగలకు మాత్రం 10 శాతం ఉద్యోగాలు లభించినవి. వివిధ శాఖలలో పెరిగిన ఉద్యోగ నియామకాలలో 382 నియామకాలు జరగగా 250 మంది లంబాడీలు ఉద్యోగాలు పొందారు.

రాజ్యాంగం 5వ షెడ్యూల్ (1)వ పేరా ప్రకారం రాష్ట్రంలో 31,435 చదరపు కిలోమీటర్లలో విస్తరించి ఉన్న షెడ్యూల్డ్ ప్రాంత ఉద్యోగాలన్నీ 1950కి ముందు నుంచి స్థిర నివాసం కలిగి ఉన్న గిరిజన తెగకు మాత్రమే వివిధ శాఖలలో ఉద్యోగాలు నింపబడాలి. కాని మైదాన ప్రాంతంలో ఎస్.టి.లుగా కొనసాగుతున్న లంబాడీలు షెడ్యూల్డ్ ఏరియాలోకి వచ్చి స్థానిక తహశీల్దార్ల దగ్గర అక్రమ ఏజెన్సీ సర్టిఫికేట్లు పొంది రాజకీయ బలంతో ఉద్యోగాలను దోచుకుంటున్నారు.

అరవై ఏళ్ల స్వతంత్ర భారతావనిలో ఆంధ్రప్రదేశ్‌లో ఒక్క ఐ.ఎ.ఎస్. గాని, ఐ.పి.ఎస్. గాని ఆదివాసీలు లేరంటే ప్రజాస్వామ్య పాలన ఎంత నీచంగా సాగుతుందో అర్థం చేసుకోవచ్చు. ఒక్క ఆదిలాబాద్ జిల్లా ఖానాపూర్ మండలంలోనే 20 మంది లంబాడీలు ఐ.ఎ.ఎస్., ఐ.పి.ఎస్.లు ఉండడాన్ని గమనిస్తే రిజర్వేషన్‌ల దోపిడీ రాష్ట్ర వ్యాప్తంగా ఎలా ఉందో అర్థం చేసుకోవచ్చు. స్పష్టంగా చెప్పాలంటే ఆంధ్ర ప్రాంతం వారు తెలంగాణ ప్రాంత ఉద్యోగాలు దోచుకున్న దానికంటే ఎక్కువ లంబాడీలు ఆదివాసీల ఉద్యోగాలు దోచుకున్నారు.

అదే విధంగా రాజకీయ రంగంలో శ్రీకాకుళం నుంచి ఆదిలాబాద్ వరకు అటవీ ప్రాంత ఏజెన్సీలో మూడు లోక్‌సభ స్థానాలు, 19 అసెంబ్లీ స్థానాలు, ఎస్.టి.కి కేటాయించబడినవి. అందులో 30 తెగల నుండి 14 ఎం.ఎల్.ఎ. స్థానాలు పొందగా, ఐదు స్థానాలు లంబాడీలు పొందారు. రెండు పార్లమెంట్ స్థానాలు లంబాడీలు పొందారు. 70 శాతం ఆదివాసీ జనాభా కలిగిన మహబూబాబాద్ (వరంగల్) ఎం.పి. స్థానం, ఖానాపూర్ (ఆదిలాబాద్) స్థానాలు 30 శాతం జనాభా కలిగిన లంబాడీలు పొందారంటే ఆదివాసీల నిరక్షరాస్యత, అమాయకత్వాన్ని అంచనా వేయవచ్చు. వాస్తవంగా లంబాడీలకు చెందవలసిన ఎం.ఎల్.ఎ స్థానాలు - 2, లోక్‌సభకు అర్హత లేదు. జడ్.పి. చైర్మన్ కేటాయించిన వరంగల్, ఆదిలాబాద్ స్థానాలు కూడా లంబాడీలే దోచుకున్నారు. దీన్ని బట్టి కింది స్థాయి రాజకీయాన్ని అంచనా వేయవచ్చు.

ఈ విషయాన్ని హేమెన్‌డార్ఫ్ ముందుగానే చెప్పాడు. మొదటగా బంజారాల వలస మహారాష్ట్ర బేరాన్ జిల్లా నుంచి ఆదిలాబాద్ ఏజెన్సీకి వచ్చి నివాసం ఏర్పాటు చేసుకున్నారు. ఒకసారి లంబాడీలు ఆదివాసీ గ్రామాలలో పట్టు సాధిస్తే గోండులు గాని, కోలాంలు గాని ఆ గ్రామాన్ని ఖాళీ చేయాల్సిందేనని పేర్కొన్నాడు. స్థూల జాతీయ దృక్పథం నుంచి ఆలోచిస్తే ఆదిలాబాద్ జిల్లాలోని ఆదివాసీ ప్రాంతాలలో బంజారాల చొరబాటు భారత ద్వీపంలోకి కొనసాగిన ఆర్యుల ఆక్రమణకు మరో దశగా కనిపిస్తుందని, నల్ల చర్మంతో ద్రవిడ భాషా సముదాయానికి చెందిన భాషా వ్యవహారమున్న గోండ్, కోలాం ప్రాంతాలను ఆక్రమించుకునేందుకు వచ్చిన తెల్లని ఉత్తర భారత జాతీ లక్షణాలు ఉండి, సంస్కృత కుటుంబానికి చెందిన భాషను మాట్లాడే బంజారాలు మూల వాసులను ఖాళీ చేసిన ఆర్యుల వర్తమాన ప్రతినిధులుగా అనిపించక తప్పదు అని పేర్కొన్నారు. ప్రస్తుతం జరుగుతున్నది అదే. రిజర్వేషన్‌లు కాక ఆదివాసీల భూములను కూడా ఆక్రమించుకున్నారు.

భారత రాజ్యాంగం 342 (1) క్లాజు ప్రకారం భారత రాష్ట్రపతి కేంద్రంలో కొన్ని వర్గాలను గాని, వాటిలోని కొన్ని భాగాలను గాని షెడ్యూల్డ్ తెగలుగా గుర్తించవచ్చు. 342 (2) క్లాజు ప్రకారం రాష్ట్రంలో గవర్నర్‌ని సంప్రదించి షెడ్యూల్డ్ తెగలలో చేర్చే అధికారం పార్లమెంట్‌కు ఉంటుంది. కాని కొన్ని కొలబద్దలు పరిగణనలోకి తీసుకోవాలి. అవి, 1. ఆదిమ లక్షణాలు గోచరించడం, 2. నిర్దిష్టమైన సంస్కృతి సాంప్రదాయాలు కలిగి ఉండడం, 3. భౌగోళికంగా విడిగా ఉండడం, 4. ఇతరులతో సంబంధాలు నెరపడానికి బెరుకు చూపడం, 5. వెనుకబాటు తనం. ఈ నిబంధనలను పాలకులు పెడచెవిన పెట్టారు. ఈ నిబంధనలకు లంబాడీలకు ఏమాత్రం పొంతన లేదని చెప్పవచ్చు.

ఆదివాసీలతో సంబంధం లేని ఓటు బ్యాంక్ రాజకీయాల కోసం ఎన్.టి. జాబితాలో చేర్చబడిన లంబాడీలను ఏ నిబంధనలతో కలిపారనేది ప్రజలకు తెలియజేసి, లంబాడీలను ఎస్.టి. జాబితా నుంచి తొలగించాలి. పాలకులు లంబాడీల అభివృద్ధికి నిజంగా పాటు పడాలనుకుంటే ఎస్.టి.ల నుండి తొలగించిన తరువాత వారికి ప్రత్యేక రిజర్వేషన్ కల్పించాలి. (గుజరాత్‌లో గుజ్జర్ల తరహాలో.) ప్రభుత్వం తక్షణం ఏదో ఒక నిర్ణయం తీసుకోకపోతే మనుగడ ప్రశ్నార్థకం అవుతున్న ఆదివాసీలు ఆదిలాబాద్ నుంచి మరో చారిత్రక పోరాటానికి ఇప్పుడు శ్రీకారం చుట్టారు. ఆ పోరాటం తీవ్రరూపం దాల్చి పెల్లుబుకడం ఖాయం.

*(రచయిత ఆదివాసీ విద్యార్థి సంఘం (తుడుం దెబ్బ) ఉపాధ్యక్షులు)* వీ

**కాపీ కొట్టైనా సరే అనుకున్న మార్కులూ, ర్యాంకులూ సాధించాలనుకునే విద్యా పద్ధతి విద్యార్థులకు ఎటువంటి జ్ఞానాన్ని, విలువల్ని ఇస్తుందో ప్రతి ఒక్కరూ ఆలోచించాలని అంటున్నారు బి. మల్లయ్య**

# కాపీ ఆధారిత పరీక్షలు - ప్రభావం

*'నైతిక ధర్మం, సాంప్రదాయం, చట్టం, సద్గుణం నాటి నాటికీ భిన్నమైన ప్రవర్తనయే అవినీతి.'*

– ఐక్యరాజ్య సమితి నిర్వచనం

ఈసారి పదవ తరగతి పరీక్షలు గత ఆనవాయితీనే కొనసాగించాయి. పరోక్షంగా విద్యార్థుల మనో నేత్రాలు తెరచుకోకుండా ఉండే ప్రయత్నం చేస్తున్నాయి. విద్యార్థులు పరీక్షలు పూర్తయ్యాక ఒక నిట్టూర్పు విడిచారు. బాగా చదివి, సంతృప్తిగా పరీక్షలు రాశామని కావచ్చు లేదా, కాపీ చేయడమనేది నిరాటంకంగా కొనసాగి ఎట్టకేలకు సాఫీగా ముగిసిందనుకోవచ్చు. ఈ కాపీ చేయడమనేది విద్యార్థులకు ప్రాథమిక స్థాయి నుండే మొదలవుతుందని చెప్పవచ్చు. పాఠం అర్థం కాని పిల్లలు, అక్షరాలు సరిగ్గా తెలియని పిల్లలు ఏం రాయాలో తెలియక పక్కనున్న విద్యార్థి ఏది రాస్తాడో అదే రాయడానికి ప్రయత్నిస్తారు. ఆ స్థాయిలో ఆ బాలుడిని ఇది తప్పు, అలా రాయకూడదు, నీకు తెలిసినప్పుడే సొంతంగా రాయాలి అనీ, ఇప్పుడు నీకు తెలియకుంటే తర్వాతనైనా బాగా చదువుకుని వచ్చే పరీక్షల్లోనైనా సొంతంగా బాగా రాయి అనీ, ఇలాంటివి చేయడం పరీక్ష అనిపించుకోదనీ తెలియజేయాలి. ఇలాంటివి చేయడం తప్పులుగా వారి మనసుల్లో నాటుకుపోయే విధంగా, ప్రాథమిక స్థాయి పూర్తయ్యే వరకూ అర్థం చేయించాలి. ఈ స్థాయి బాలలు ఎలాంటి సంఘటనలకు ప్రభావితమవుతారో, అలాంటి సంఘటనల ఫలితాలను కొనసాగిస్తూ ఉంటారు. ఏ క్షణమైతే టీచరు ఇలాంటివి చూసి 'ఆఁ ఏమవుతుందిలే' అనే నిర్లక్ష్య ధోరణి ప్రదర్శిస్తారో, ఆ క్షణం నుండే ఆ విద్యార్థి గాడి తప్పుతున్నాడనీ, దీని ప్రభావం అతడూ చదివినంతకాలం, సాంఘిక జీవనంలో అసమర్థుడిలాగా జీవిస్తాడని టీచరుకు తెలియక పోవచ్చు.

ప్రాథమిక స్థాయిలో పిల్లలు ఏం చెబితే అదే కచ్చితంగా పాటిస్తారు. ఏనాడూ మరిచిపోరు. పిల్లలకు ఈ స్థాయిలో వారి హృదయాలను హత్తుకునేలా పాఠాలు చెప్పాలి. చక్కటి నీతినీ, నీతి కథలనూ చెప్పాలి. పిల్లలు వీటికి ఎంతో బలంగా ప్రభావితమవుతారు. ఇలాంటి పిల్లలు నీతినే నమ్ముకుని జీవిస్తారు. ఇది మంచి పరిణామం. ఇలాంటి విద్యార్థులు కాపీ చేయమన్నా చేయరు సరికదా, చేయమన్న టీచరును మనసులో అసహ్యించుకుంటారు. దీనికి చక్కటి ఉదాహరణ, బాల గాంధీని ప్రాథమిక స్థాయిలో వారి పాఠశాలకు విద్యాధికారి వచ్చినప్పుడు, అతడు ఏమీ రాయలేకపోవడం గమనించిన మాస్టారు– పక్క విద్యార్థి దాంట్లో చూసి రాయమన్న సంఘటనకు ఆ బాలుడు, 'ఇలాంటివి తప్పు అనీ మీరే చెప్పారు కదా మాస్టారూ' అని వెంటనే సమాధానమివ్వడం బాల గాంధీ నైతిక పరిణతికి అద్దం పట్టింది. ప్రాథమిక స్థాయి నైతిక బోధనలో తల్లి ద్వారా లభించిన నీతి కథల ప్రభావ ఫలితమిది.

ఏడవ తరగతి కామన్ పరీక్షల గురించి మనకు తెలుసు. కొన్ని దశాబ్దాలు పిల్లల చేత కాపీ చేయించి వందశాతం ఫలితాలు సాధించామని చెప్పుకోవడం పిల్లల పరోక్షంగా పతనానికి హేతువయ్యే బోధకుల అల్పబుద్ధికి నిదర్శనం. దీన్ని గమనించిన మేధావులు, తల్లిదండ్రులు, ప్రభుత్వం, విద్యాసంస్థలు చివరికి ఆ పరీక్షను రద్దు చేశాయి. ఆలస్యంగానైనా వాస్తవాస్తవాలను గ్రహించడం, ఇది బాలలకు మంచి పరిణామం. పదవ తరగతి పరీక్షల వాతావరణం పిల్లల భవిష్యత్తును ప్రశ్నార్థకంగా చేస్తోంది. దీనికి ప్రైవేటు యాజమాన్యాలు, ప్రభుత్వ బోధకులు ఏకంగా పకడ్బందీ ప్రణాళిక తయారు చేస్తారు. సూపరింటెండెంట్‌లు, డిపార్ట్‌మెంటల్ అధికారులు, ప్రైవేట్ యాజమాన్యాల మధ్య నిత్యం వేలాది రూపాయలు చేతులు మారుతూంటాయి. వీరూ, పరీక్ష హాలులో విధులు నిర్వహించే ఇన్విజిలేటర్లూ కలిసి పరీక్షల తంతు ముగిసే వరకు విందులు, వినోదాలతో గడిపేస్తారు. దీనిలో కొంతమంది తల్లిదండ్రుల సహకారం ఉండడం శోచనీయం. విద్యార్థులకు పకడ్బందీ ప్రణాళికలతో బోధనాభ్యాస ప్రక్రియలను నిర్వహించాల్సిన బోధకులు అత్యాశలకు లొంగి ఇలాంటి పనులకు అత్యుత్సాహాన్ని, అల్పత్వాన్ని ప్రదర్శించడం ఉపాధ్యాయ వ్యవస్థకు అవమానకరం. విద్యార్థుల చేత కాపీ చేయించడానికి చూపే ఉత్సాహాన్ని తరగతి గదిలో పాఠాలు చెప్పడంలో చూపిస్తే చక్కటి ఫలితం వస్తుంది కదా. ఇదంతా తల్లిదండ్రులకు, మేధావులకు, సంఘ నాయకులకు, ప్రభుత్వానికి తెలుసు. అయినా ఈ విధానాన్ని ఇలాగే కొనసాగించడం వెనుక దాగి ఉన్న అంతరార్థం ఏమిటో? కొన్ని ప్రైవేటు యాజమాన్యాల అధిపతులు పదవ తరగతి పిల్లలను వారి పాఠశాలల్లో చేర్పిస్తే, పాస్ చేపిస్తామనే గ్యారంటీని ఇవ్వడంలోనే తెలిసిపోతుంది వారి పరీక్షా సెంటర్‌లోని హీన పరిస్థితి. ఈ తంతు పై అధికారులకు తెలియనిది కాదు. వీటిని ఎలా గౌరవించాలో ప్రైవేట్ అధిపతులకు బాగా తెలుసు. ఉన్నత విద్యాధికారుల స్థాయిలో ఉండి కూడా కళ్లముందే విద్యార్థుల భవితకు ఛిద్రం పడుతుంటే తమ స్థాయినీ, అధికారాలనూ మరచి చచ్చు దద్దమ్మల్లా వ్యవహరించి కక్కుర్తితో

తోక ముడుచుకుంటూ వీరే ఇలా ప్రవర్తిస్తే ఇక ఈ దారుణ పరీక్షా పద్ధతిని ఎవరు మారుస్తారు? ఇలా ఎంతకాలం కొనసాగాలి? ఇది ఎవరి వల్ల అంతర్గించాలి?

పదవ తరగతి పబ్లిక్ పరీక్షల్లో కాపీలన్నది విచ్చలవిడిగా మారినప్పుడు విద్యార్థుల మానసిక వైఖరిలో కూడా విచ్చలవిడితనం క్రమంగా చోటుచేసుకుంటుంది. వీరు చేసిన ఘనకార్యాలు వంశ పారంపర్యం లాగ జూనియర్లకు చేరవేస్తారు. వారికీ అర్థమవుతుంది. పరిస్థితి అలాగ ఉన్నప్పుడు ఇక ఈ టీచర్లతో పనేముంటుందని నిర్ణయించుకొంటారు. గురువులన్నా, తమకంటే పెద్దలన్నా చులకన భావాన్ని ప్రదర్శించడం, కనీస మర్యాదలు ఇవ్వకపోవడం వారి నైతిక పతనానికి ప్రారంభ చిహ్నం. దీనికి తోడు ప్రచార మాధ్యమాల విపరీత ధోరణి దీనికి ఇంకా దోహదం చేస్తోంది. దీన్ని ఆసరాగా భావించి పిల్లలు ఇంటి దగ్గర చక్కగా చదువుకోవడాన్ని పూర్తిగా విస్మరించారు. ఎన్నిమార్లు హెచ్చరించినా వారు ఆ పనిని మాత్రం చేపట్టలేరు. ఇక నోట్స్ అంతంత మాత్రమే. దీని ప్రభావ ఫలితంగా గైర్హాజరు విపరీతంగా పెరిగిపోతుంది. వీరిని మందలిస్తే, అదోలా చూడడం, అదోలా మాట్లాడడం లాంటి ధోరణులు వారికి వారే పెంపొందించుకుంటున్న తీరు అనాగరిక మనస్తత్వ ధోరణికి పునాదులు వేస్తోంది.

ఈ బాలలంతా రేపటి ఆశాకిరణాలు. భారతావనిని సన్మార్గంలో నడిపించే రథసారథులు. భారతీయ సంస్కృతిని, చరిత్రను, అమూల్యమైన వనరులను కాపాడుతూ తదుపరి తరాలకు అందించే ఆధార స్తంభాలు, మేధో వనరులు. ఇలాంటి తరానికి అనైతిక చీడపడితే, ఇక తరతరాలు ఉత్కృష్టమైన మానవ సంస్కృతి నుండి నికృష్ట సంస్కృతికి మారతారనుకోవడంలో అతిశయోక్తి లేదు. విద్య లేకపోయినా నైతిక విలువలతో మనిషి జీవించవచ్చు కానీ, అనైతిక జీవన విధానం జీవచ్ఛవం లాంటిదే అవుతుంది. దీని ప్రభావం అంత తక్కువగా అంచనా వేయకూడదు. ఒక శాస్త్రవేత్త, ఒక సామాజికవేత్త, ఒక సాహితీవేత్త, ఒక సంఘ సంస్కర్త, ఒక తత్వవేత్త, ఒక వ్యోమోగామి, ఒక ప్రొఫెసర్, రాజకీయవేత్త. లాంటి వాళ్లు అంతరించిపోతారు. ఒక ఉన్మాదపూరిత విలువ, మనస్తత్వాలు బాలలకు అలవడుతాయి. వీరికి కనీస నైపుణ్యాలు, సహజ సామర్థ్యాలు, సహజ కల్పనా సామర్థ్యాలు, నైతిక విలువలు, కళలు, కళాభిరుచులు, నవరసాలు, జీవన మాధుర్య రసాస్వాదనలు, క్రీడలు, క్రీడాస్ఫూర్తి, రాగద్వేషాలు, ప్రకృతిపరమైన రసరమ్య దృశ్యకావ్యాలు, రసస్ఫూర్తి లాంటివన్నీ కోల్పోయి నిస్సారమైన జీవనాన్ని వెళ్లదీస్తారు. మనిషి జీవన సార్థకతకు ఇది నిరర్ధకమవుతుంది.

ఒక ఆరోగ్యపూరిత వాతావరణంలో విద్యార్థుల సహజ సామర్థ్యాలను అంచనా వేయడానికి పరీక్షల్ని నిర్వహించాలి కాని, మార్కులు సంపాదించడానికి, వక్రమార్గాల ద్వారా పరీక్షల్ని నిర్వహించడానికి కూడదు. దీనికి బదులు పరీక్షలనే రద్దు చేయడం ఉత్తమం. లేదా పుస్తకాధారంగా చూస్తూనే రాయమనడం మరో మంచి మార్గం. పరోక్షంగా కాపీ పూరిత వాతావరణం విద్యార్థికి గురువుల ద్వారానే అలవడింది. గురువుల నిర్లక్ష్యం, బాధ్యతారాహిత్యం, ఉద్యోగ భద్రత, పర్యవేక్షణ లోపం, సహజ సంబంధాలు లోపించడం, స్వార్థపూరిత వైఖరి, సంపాదనాపరమైన అత్యాశ, స్టేటస్‌లో తారతమ్యత లాంటి వాటితో సతమతమవుతూ ఉంటారు తప్ప, విద్యార్థిని మనసులో దాచుకుని మనసు విప్పి వారికై నిరంతరం తపించి, శ్రమించి, అద్భుతమైన బోధనా ప్రక్రియను సాగించే గురువులా ఉండాలి. వారి ఆలోచనలతో మమేకమవుతూ వారికి రోల్ మాడల్‌గా ఉండాలి. తన ఆదర్శ జీవనశైలి విద్యార్థుల భావి జీవన విధానం ప్రతిఫలించాలని ఎంతమంది టీచర్లు ఆ దిశగా సాహసిస్తున్నారు? ఆచరిస్తున్నారు? ఇవన్నీ కొరవడినప్పుడే విద్యార్థుల్ని పట్టించుకోకపోవడం, వారిపట్ల విముఖత, అసహనం, చిరాకు, అలసత్వ భావనల ప్రదర్శనలు. విద్యార్థులు కూడా అట్టే గ్రహించి వారికి వారే ఒక గమ్యంలేని ప్రవర్తనా దృక్పథాన్ని ఏర్పరచు కుంటున్నారు. చంచలమైన, అసహజమైన మానసిక ధోరణులు నిశ్శబ్దంగా వారికి తెలియకుండానే వారి మనసుల్లో చోటు చేసుకుంటున్నాయి. వీటి ఫలితాలే విద్యార్థుల విపరీత మానసిక కార్యకలాపాలకు దారితీస్తున్నాయి. ఇప్పటికైనా గురువులు గమనించాలి. విద్యార్థుల పట్ల వారి దృక్పథంలో ఆదర్శవంతమైన మార్పు రావాలి. వారిని ఉత్తమ పౌరులుగా మార్చాలి కానీ, ఉత్త పౌరులుగా కాదు. గురువులు మనిషిని మనిషిగా చెక్కి, మంచిని మిళితం చేసే శిల్పులు కావాలి గానీ, మనిషిని చెక్కి అవలక్షణాలను మిళితం చేసే శిల్పులుగా కాకూడదు.

ప్రభుత్వం కూడా ఈ కాపీ విధానంపై ప్రత్యేక దృష్టిని కేంద్రీ కరించాలి. పిల్లల భవిష్యత్తుపై ఇప్పటికైనా ఈ విషయంలో ఒక కచ్చితమైన నిర్ణయం తీసుకోవాలి. ప్రభుత్వ నిర్లక్ష్య వైఖరితో ఈ విధానం ఇలాగే పునరావృతమవుతుంటే పిల్లల మానసిక వైఖరుల్లో ఎలాంటి విపరీత ధోరణులు జనిస్తున్నాయో మనందరం చూస్తూనే ఉన్నాం. ఇలాంటి సంఘటనలు విద్యా విలువలను పాటించే ఉపాధ్యాయులను కలచివేస్తున్నాయి. కళ్లముందే జరిగే ఇలాంటి దారుణాలని చూస్తూ కూడా నిష్క్రియపరత్వాన్ని ప్రదర్శించాల్సి వస్తోంది. ఎదుర్కొనే సాహసానికి, ఉద్రేకానికి, ఉద్వేగానికి అడ్డుకట్ట వేయాల్సి వస్తోంది. 'అన్యాయాన్ని చూస్తూ ఎదిరించలేనివాడూ నేరస్తుడే' అన్న మాటకూ, 'అన్యాయాన్ని ఎదిరించువాడే నాకు ఆరాధ్యుడు' అన్న కాళోజీ మాటల స్ఫూర్తికి సార్థకత ఎలా కలుగుతుంది. ఇది మంచి పరిణామం కాదు. దీనికి ఎంత తొందరగా పరిష్కారాన్ని కనిపెడితే అంత తొందరగా మన భావి తరాలను రక్షించుకోవచ్చు. అన్ని వర్గాల మేధావులు దీనికై కార్యరూపం దాల్చాలి. బాలల బంగారు భవిష్యత్తును కాపాడడంలో మనందరి బాధ్యత ఉన్నదనే విషయం మరువరాదు.

దాదాపు అధిక శాతం కాపీలతో పూర్తయ్యే ఈ పరీక్షల మూల్యాంక నానికి ప్రతియేట లక్షలాది రూపాయలు డ్యూటీ ఉద్యోగుల జేబులు నింపడానికి, విద్యార్థులకు కాపీని ప్రాక్టీసు చేయించడం తప్ప విద్యార్థులకు ఒనగూరింది ఏమీ లేదు. పిల్లల్లో ఉన్మాదత్వాన్ని పెంచి పోషించడం తప్ప, ఈ బహిరంగ బూటకానికి 7వ తరగతి కామన్ పరీక్షల లాగ ఇప్పటికైనా తెరవేస్తే మంచిదని విజ్ఞుల అభిమతం. ఈ కాపీ తంతు నిర్వహణకు ప్రశ్నాపత్రాల, జవాబు పత్రాల అచ్చుకు, రవాణాకు, పేపరు కొనుగోలుకు, ఇతర సామాగ్రికి, విధులు నిర్వహించిన పైస్థాయి నుండి కింది స్థాయి ఉద్యోగులందరకు కలిపి లక్షలాది రూపాయలు ప్రతి ఏటా

విత్తనాలతో మొదలుపెట్టి పంటకు గిట్టుబాటు ధర వరకు రైతులు ఎదుర్కొంటున్న అవస్థలను విశ్లేషిస్తూ, ఈ పరిస్థితి నుంచి రైతులను ఆదుకోవడానికి సూచనలిస్తున్నారు **బండారి ఐలయ్య**

# వ్యవసాయానికి ఉపాధి హామీ పథకం

**భా**రతదేశం వ్యవసాయక దేశమని మన పాలకులు గొప్పగా చాటుకుంటారు. పరాయి దేశస్తుల నుంచి అధికార మార్పిడి జరిగిన తొలిరోజుల్లో దేశవ్యాప్తంగా 50 లక్షల వ్యవసాయ కమతాలు కలిగి ఉండి పూర్తిగా ఆహార దిగుబడుల మీదనే ఆధారపడాల్సి వచ్చేది. స్వయం సమృద్ధి పొందాలని ఆహార ఉత్పత్తుల్ని పెంచుకోవాలనే లక్ష్యంలో భాగంగా 20 కోట్లకు పైగా భూ కమతాలు పెరిగాయి.

ప్రపంచంలో ప్రతి నలుగురు రైతుల్లో ఒక్కరు భారతీయ రైతు అనేది మరువరాదు. నేటికీ 60 శాతం మందికి పైగా వ్యవసాయం మీదనే జీవిస్తున్నారు. దేశంలో ఉన్న భూమిలో సగ భాగం వ్యవసాయానికి వినియోగిస్తున్నదే., అటువంటిది రాను రాను వ్యవసాయరంగంపై పాలకుల నిర్లక్ష్యం వలన సాగుభూమి క్రమక్రమంగా తగ్గుతూ వస్తున్నది. 1980-81లో 185.09 మిలియన్ హెక్టార్ల నుండి 2008-09 నాటికి 181.57 మిలియన్ హెక్టార్లకు తగ్గిపోయింది. ఇదే సమయంలో వ్యవసాయేతర అవసరాలకు వినియోగించే భూమి 19.06 మిలియన్ హెక్టార్ల నుండి 25.94 మిలియన్ హెక్టార్లకు పెరిగింది. ఇది కాకుండా 1,22,799 హెక్టార్ల బంజారు భూమి ఉంది. వ్యవసాయయోగ్యం కాని భూమి 17.86 మిలియన్ హెక్టార్ల నుండి 17.29 మిలియన్ హెక్టార్లకు తగ్గింది. ఈ గణాంకాలను పరిశీలిస్తే వ్యవసాయానికి ఉపయోగపడే భూమినే పారిశ్రామిక రంగాల అభివృద్ధి కొరకు ఉపయోగిస్తున్నారు అనేది అర్థం అవుతుంది.

ఈ నేపథ్యంలోనే దేశ, రాష్ట్ర పాలకులు ముందుకు తెచ్చిన నూతన వ్యవసాయ విధానాలు రైతుల పాలిట ఉరితాళ్లుగా మారాయి. వ్యవసాయరంగానికి ఇస్తున్న అన్ని రకాల సబ్సిడీలను ఒక్క కలం పోటుతో రద్దు చేసి వ్యవసాయ ఉత్పత్తి వ్యయం మరింత పెరగడానికి ప్రభుత్వం కారణమైంది. మరోవైపు దిగుమతులపై ఆంక్షలు ఎత్తివేస్తున్నది. అభివృద్ధి చెందిన దేశాలు జపాన్, అమెరికా తమ రైతులకు ఎకరానికి 33,000 డాలర్ల నుండి 30,000 డాలర్ల వరకు మద్దతు ఇస్తున్నాయి. మొత్తంగా చూస్తే అభివృద్ధి చెందిన (ఒ.ఇ.సి.డి.) వ్యవసాయ ఉత్పత్తిదార్లు 362 బిలియన్ డాలర్ల (16,29,000 కోట్ల రూపాయలు) సబ్సిడీలను పొందుతున్నారు.

భారతదేశంలో ఒక రైతు కుటుంబానికి సంవత్సరమంతా కష్టపడితే లభించే మొత్తం ఆదాయం కంటే కూడా యురోపియన్ యూనియన్‌లోని ఒక ఆవుకు ఇచ్చే సబ్సిడీ ఎక్కువగా ఉంటుంది.

ఒకవైపు సబ్సిడీలు తగ్గడం, వ్యవసాయ ఉత్పత్తి ఖర్చులు పెరగడం, గిట్టుబాటు ధరలు లేకపోవడంతో రైతులు తీవ్ర నిరాశ నిస్పృహలకు లోనవుతున్నారు. ఇటీవల జరిపిన ఒక అధ్యయనం ప్రకారం 40 శాతం రైతులు సరైన మరో ప్రత్యామ్నాయం లభిస్తే వ్యవసాయాన్ని విడనాడాలనుకొంటున్నారని తెలిసింది. వ్యవసాయం వల్ల లాభం లేదని మరో 40 శాతం రైతులు పెదవి విరుస్తున్నారు. ప్రత్యేకించి మన రాష్ట్రంలో మూడింట రెండొంతుల మంది వ్యవసాయం మీదనే ఆధారపడుతున్నారు.

---

ఖర్చు అవుతుంది. వీటన్నింటి పర్యవసానంగా విద్యార్థుల నుండి వచ్చిన ఫలితాలు ఏమిటి? మా జిల్లా ప్రథమ స్థానంలో ఉందంటే, మా జిల్లా రెండవ స్థానంలో ఉందని గొప్పగా చెప్పుకుని మురిసిపోయే ఉన్నత స్థాయి అధికారులు కూడా ఉన్నారంటే విద్యా విలువలు పతనస్థాయి ఏ మేరకు పతనం చెందిందో అందరం గ్రహించాలి.

ప్రాథమిక స్థాయి నుండి ఉన్నత స్థాయి వరకు కాపీకి అలవాటు పడిన బాలలు అది చేయడానికి సాహసిస్తారు తప్ప ఎంత మాత్రం చదవరు. వారి భవిష్య సాంఘిక జీవన విధానంలో ప్రతి విషయం పట్ల కాపీకి అలవాటు పడిన ప్రభావం ప్రతిబింబిస్తూ ఉంటుంది. ప్రతి విషయానికి మరొకరిని అడగడం, ఏవైనా సమస్యల గురించి మరొకరి సలహాలపై ఆధారపడడం, సమయస్ఫూర్తి పూర్తిగా కొరవడడం, ఇతరుల సలహా సంప్రదింపులపై ఆధారపడడం, విజ్ఞతగల వారి ముందు భయాన్ని, సంకుచితత్వాన్ని ప్రదర్శించడం, తన అభిప్రాయాలను వ్యక్తపర్చడంలో వెనకబడడం, స్వీయ భావాలను అలవోకగా వ్యక్తీకరించక పోవడం, అధిక సమయం మౌనంగా ఉండడం, ఏకాంతవాసాన్ని కోరుకోవడం, మానవ సంబంధాలపై అయిష్టత, ముక్తసరి సమాధానాలు చెప్పడం లాంటివి జీవితాంతం వేధిస్తుంటాయి. వీటికి మూల హేతువు కాపీయేనని ఈ వ్యక్తులు గుర్తించకపోవచ్చు. కాపీకి ప్రోత్సహించిన వ్యక్తులు తాత్కాలికంగా వీరిని గట్టెక్కిస్తారేమోగాని, పరోక్షంగా వారి వ్యక్తిగత జీవన పతనానికి ఎలా కారణమవుతున్నారో ప్రోత్సహించిన వారికీ తెలియకపోవచ్చు. చివరి అంకంలో వాస్తవాలు తెలిస్తే, అప్పుడు ఎవరు మాత్రం చేసేదేముంటుంది? అనుభవించక తప్పదు మరి. ఇలాంటివి పునరావృతం కాకుండా చూడడం మాత్రమే దీనికి పరిష్కారం.

(రచయిత ఉపాధ్యాయులు)

అలాంటి రంగాన్ని ప్రభుత్వం పట్టించుకోకపోవడంతో 82 శాతం రైతులు అప్పుల్లో కూరుకుపోయారని ఎన్.ఎస్.ఎస్. సర్వే తెలిపింది.

**వ్యవసాయ భూమిని వ్యవసాయేతర పనులకు కేటాయించడం**

ప్రభుత్వం భూసేకరణ భారీ ఎత్తున చేస్తోంది. బ్రిటిష్ వలస పాలకులు 1894లో చేసిన భూసేకరణ చట్టాన్ని ఉపయోగించుకొని రైతుల నుండి నిర్బంధంగా భూమిని సేకరిస్తోంది. ప్రభుత్వం గత 61 ఏళ్లలో దేశంలో దాదాపు 4 కోట్ల ఎకరాల భూమిని వ్యవసాయేతర పనులకు వినియోగించినట్లు అంచనా వేశారు. సాగునీటి, విద్యుత్ ప్రాజెక్టులు, పరిశ్రమలు, విమానాశ్రయాలు, ఓడ రేవులు, నాలుగు లైన్ల-ఆరు లైన్ల ఎక్స్‌ప్రెస్ హైవేలు, పట్టణీకరణ, ఇళ్ల నిర్మాణం, ప్రత్యేక ఆర్థిక మండలాలు, కోస్తా కారిడార్ మొదలైన వాటికి రైతుల నుండి భూములను నిర్బంధంగా ప్రభుత్వం తీసుకుంటున్నది. ప్రైవేట్ కంపెనీలు కూడా నేరుగా రైతుల నుండి భూములను సేకరిస్తున్నాయి. రియల్ ఎస్టేట్ వ్యాపారం కొరకు భూములను కేటాయిస్తున్నాయి. ఫలితంగా ఆహార ఉత్పత్తి తగ్గిపోతున్నది. సుమారు 110 కోట్ల జనాభాకు వ్యవసాయ రంగం ఆహారాన్ని సమకూర్చవలసి ఉంది. 2020 వచ్చే నాటికి మన జనాభా చైనా జనాభాను కూడ దాటిపోయి ప్రపంచంలో అత్యధిక జనాభా కల్గిన దేశంగా మారుతుంది. ఇప్పటికే మన దేశ అవసరాలకు సరిపడా ఆహార ధాన్యాలు పండించలేకపోతున్నాం. కేంద్ర వినియోగ వ్యవహారాల మంత్రిత్వశాఖ సాగించిన అధ్యయనం ప్రకారం 5 మిలియన్ టన్నుల బియ్యం కొరత ఏర్పడింది.

వాస్తవానికి దేశ జనాభాలో 40 శాతం మంది దారిద్ర్యరేఖకు దిగువన జీవిస్తున్నారు. వరి ఆహార వినియోగం చాలా తక్కువగా ఉంది. భారతదేశం ఇప్పటికీ తక్కువ ఆదాయం గల దేశంగా 2007-08 కేంద్ర ఆర్థిక సర్వే పేర్కొంది. అంతర్జాతీయ ఆహార పరిశోధనా సంస్థ 118 దేశాలను పరిశీలించి తయారు చేసిన ఆకలి సూచికలో భారత దేశం 94వ స్థానంలో ఉందని పేర్కొంది. కరువుతో అల్లాడుతున్న ఇథియోపియా దేశం కూడ మనకంటే ఒక్క స్థానం పైన ఉంది. పిల్లల పౌష్టికాహారం విషయంలో 117వ స్థానంలో ఉందని కూడా పేర్కొంది. బంగ్లాదేశ్ ఒక్కటి మాత్రమే భారతదేశానికి దిగువన ఉంది. దేశంలో రోజుకు 2400 కంటే తక్కువ కాలరీల ఆహార పదార్థాలు తీసుకుంటున్న ప్రజలు 87 శాతం ఉన్నారని జాతీయ నమూనా సర్వే 61వ నివేదిక తెలియజేస్తోంది. రక్తహీనతతో మహిళల్లో బాధపడేవారు 1996-2006 సంవత్సరాల మధ్య 52 నుండి 56 శాతం పెరిగారనీ, రక్తహీనతతో బాధపడే గర్భిణి స్త్రీలు 49.7 శాతం నుండి 63.9 శాతానికి పెరిగారనీ, రక్తహీనతతో బాధపడే 3 సంవత్సరాల లోపు పిల్లలు 74 నుండి 79 శాతం పెరిగారనీ, పిల్లల వయస్సుకు తగ్గ బరువు లేనివారు 43 శాతం ఉన్నారనీ 2005-06 జాతీయ కుటుంబ ఆరోగ్య సర్వే నివేదిక పేర్కొన్నది. ప్రతి సంవత్సరం 1,50,000 మంది స్త్రీలు ప్రసవ సమయంలో మరణిస్తున్నారు. మన రాష్ట్రంలో పిల్లల పురిటి చావులు 49 శాతం ఉన్నాయని అధికారిక గణాంకాలు సూచిస్తున్నాయి.

**వ్యవసాయ కూలీల పెరుగుదల - కారణాలు**

రాష్ట్రంలో 1.64 కోట్ల మంది వ్యవసాయ కూలీలు ఉన్నారు. గత 64 సంవత్సరాల నుండి కేంద్ర, రాష్ట్ర పాలకులు అనుసరిస్తున్న తప్పుడు విధానాల ఫలితంగా వ్యవసాయ కూలీల సంఖ్య రోజు రోజుకీ పెరగడంతో పాటు వారి జీవన పరిస్థితులు క్షీణిస్తున్నాయి. పాలకులు కాకి గోల చేసే భూసంస్కరణల వలన భూమి పొందిన వారికంటే, అప్పుల పాలై భూమిని పోగొట్టుకొని వ్యవసాయ కూలీలుగా మారుతున్న రైతాంగమే అనేక రేట్లు ఎక్కువగా ఉంది. దేశంలో 1951లో 2.79 కోట్ల మంది వ్యవసాయ కూలీలుండగా 1961కి ఆ సంఖ్య 3.51 కోట్లకు, 1977కి 4.75 కోట్లకు, 1981కి 5.56 కోట్లకు, 1991కి 7.38 కోట్లకు, 2001కి 10.74 కోట్లకు, 2010 12.30 కోట్లకు పెరిగింది.

రాష్ట్రంలో ప్రాంతాల వారిగా పరిశీలిస్తే 2001న కోస్తాంధ్ర ప్రాంతంలో 47.78 లక్షలు (48.6 శాతం), తెలంగాణలో 32.11 లక్షలు (32.7 శాతం), రాయలసీమలో 18.34 లక్షలు (18.7 శాతం) ఉన్నారు. వీరిలో దళితులు (38.88 శాతం), గిరిజనులు (12.93 శాతం) అత్యధికులు ఉన్నారు. 'వ్యవసాయ కార్మిక విచారణ సంఘం' నివేదిక ప్రకారం 1960-70ల మధ్యకాలంలో వ్యవసాయ కూలీల సంఖ్య 48 శాతం పెరిగింది. 1971-91 మధ్యకాలంలో భూమిలేని నిరుపేదలు, సన్నకారు రైతుల సంఖ్య ఏటా 3.3 శాతం చొప్పున పెరుగుతోంది. ప్రస్తుతం 30 కోట్ల వరకు వీరు పెరిగారు.

వ్యవసాయరంగంలో యాంత్రీకరణ పెరగడంతో, పాలకుల తప్పుడు విధానాలతో వ్యవసాయ కూలీలకు ఉపాధి అవకాశాలు రోజు రోజుకూ తరుగుతున్నాయి. 'హరిత విప్లవం' తరువాత అనేక రాష్ట్రాల్లో వ్యవసాయ కూలీల పనిదినాలు తగ్గిపోయినట్లు రాజ్‌కృష్ణ తదితరుల పరిశోధనలు స్పష్టం చేస్తున్నాయి. 1965లో సంవత్సరానికి 217 రోజులు పని దినాలుండగా 2001 నాటికి అవి 140కి పడిపోయాయి. 2010 వచ్చేసరికి 100 రోజులు కూడ పని దొరకని పరిస్థితి ఏర్పడింది. నీటి వసతి లేని ప్రాంతంలో 60 రోజులు మాత్రమే పని దొరుకుతోంది. 1983-93 మధ్యకాలంలో 2.4 శాతం చొప్పున ఉపాధి వార్షిక వృద్ధి రేటు ఉండగా 1993-2000 మధ్యకాలంలో అది 0.29 శాతం వరకు పడిపోయింది. దేశం మొత్తం మీద ఉపాధి రేటు 1.7 శాతం నుండి 0.5 శాతం వరకు పడిపోయింది.

**రైతుల ప్రాణాలను హరించే పొలాలు**

మన రాష్ట్రంలో వరి పంట 40 లక్షల హెక్టార్లలో పండిస్తున్నారు. ఇందులో 60 శాతం కోస్తా ప్రాంతంలోను, 32 శాతం తెలంగాణలో, 8 శాతం రాయలసీమలో పండిస్తున్నారు. పంట దిగుబడి విలువల రీత్యా వ్యవసాయంలో వరి ప్రథమ స్థానం ఆక్రమించింది. అధిక సంఖ్యలో ప్రజలకు జీవనధారమే కాకుండా ఆహార సరఫరా, ఆహార భద్రత కల్పిస్తూ ఎగుమతి సామర్థ్యం కూడ కలిగి ఉన్నందున వరి ఉత్పత్తి ప్రథమ స్థానంలో ఉంది. దేశంలో కూడా పంజాబ్, హర్యానా, ఉత్తరప్రదేశ్, తమిళనాడు, కేరళ, కర్నాటక, రాష్ట్రాలలో వరి ప్రధానంగా పండుతోంది. వరి ఇతర రాష్ట్రాలకు, ఇతర దేశాలకు ఎగుమతి చేస్తున్నందువల్ల వరికి ప్రాధాన్యత పెరిగింది. ఇలాంటి ప్రాధాన్యత కలిగిన వరి ధాన్యం పట్ల ప్రభుత్వం అనుసరించే విధానాల ఫలితంగా ఖర్చులు

పెరిగి, దిగుబడి తగ్గి పండిన పంటకు గిట్టుబాటు ధరలేక రైతు వరి పంట వేయడానికి శ్రద్ధ చూపలేకపోతున్నాడు.

మరోపక్క సబ్సిడీల కోతతో కునారిల్లుతున్న రైతాంగంపై పిడుగులాగా నాటి ఎన్.డి.ఏ. ప్రభుత్వం 1500 రకాల ఉత్పత్తులపై దిగుమతి ఆంక్షల్ని ఎత్తివేసింది. దీనితో దేశంలోకి వ్యవసాయ ఉత్పత్తులు ఇబ్బడి ముబ్బడిగా చౌకగా దిగుమతి చేసింది. కొద్ది కొద్దిగా పత్తి దిగుమతులపై దిగుమతి సుంకాన్ని తగ్గించుతూ ప్రభుత్వం ముందుకు తెచ్చింది. అది 0 శాతం నుండి 10 శాతం లోపుగా కొనసాగింది. దీనితో 1995 నుండి పత్తి రేటు తగ్గుతూ వచ్చింది. అదే సందర్భంలో సబ్సిడీల ఎత్తివేతల వలన రైతు పంట ఖర్చు పెరిగింది. దీంతో ప్రత్తి రైతుల ఆత్మహత్యలు పెరిగిపోయాయి. నేషనల్ 'క్రైం రికార్డ్ బ్యూరో' వారి డేటా ప్రకారం 1997-2010 మధ్యకాలంలో రెండు లక్షల మంది రైతులు చనిపోయారు. ప్రధానంగా పత్తి రైతులు మన రాష్ట్రంలో, మహరాష్ట్రలో ఆత్మహత్యలకు గురి అయ్యారు.

**మిర్చి :** భారతదేశంలో అధికంగా మిర్చి పండించే రాష్ట్రాలల్లో మన రాష్ట్రం ఒకటి. ఇది వ్యాపార పంట కావడం వలన ఏదో ఒక సంవత్సరం రేటు రాకపోతుందా అని రైతులు ఆశతో మిర్చి సాగుచేస్తున్నారు. మిర్చి విత్తనాలు కొనుగోలు చేసిన దగ్గర నుండి రైతుకు కష్టం ప్రారంభమవుతుంది. నారుపోసిన తరువాత నారును 40 రోజులు పెంచాలి. రోజుకు 3 పూటల నీళ్లు పోయాలి, కలుపు తీసుకోవాలి, మందు కొట్టాలి. తోటవేసిన తరువాత సావు చెట్లు పెట్టాలి. 3 సార్లు పాటు చేయాలి. పాటు చేస్తున్న క్రమంలో చెట్లు కింద పడిపోతే వాటిని లేపడానికి వెనుక ఒక మనిషి ఉండాలి. 4 రోజులకోసారి తోటకు నీళ్లు కట్టాలి. ఈ విధంగా 8 నెలలు నీళ్లు కట్టాలి అంటే సుమారు 60 సార్లు నీళ్లు కట్టాలి.

మందులకు సంబంధించి తోట పరిస్థితిని బట్టి వారానికి ఒక్కసారి నుండి 3 సార్లు మందు కొట్టాలి. దుక్కి మందులు తడి తప్పించి తడికి వేయాలి. అంటే పంట పూర్తి అయ్యేటప్పటికి 30 సార్లు దుక్కి మందు వేయాలి. దుక్కి మందుల్లో పోటాష్ యూరియా కల్పిగాని, 20-20+ యూరియాకాని, 28-28+ యూరియాకాని, 17-17+ యూరియాకాని, 14-35+ యూరియాకాని వేస్తారు. చేన్లో రెండు సార్లు చెత్త పీకాలి. దానికి ఒక్కొక్కసారి 10 మంది కూలీలు పడుతారు. 8 నెలలు రైతు తన మిర్చి చేన్లో రోజూ పనిచేస్తూనే ఉండాలి. ఇంత పని చేసినప్పటికీ తోటకు ఆకు ముడత, చెట్టు మొదల్లో చెదలు వచ్చి ఇలా అనేక రకాల జబ్బులు వచ్చి చివరకు రూపాయి కూడా రాకుండా ఉట్టి చేతులతో పెట్టిన పెట్టుబడులను వదిలివేసి ఖాళీగా ఇంటికి రావల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. ఈ పరిస్థితి ఏర్పడిన రైతులు తాము తెచ్చిన అప్పులు తీర్చలేక, మరో సంవత్సరానికి అప్పులు ఎక్కడా పుట్టవని ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. రైతులు ఎందుకు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. పట్టికలను పరిశీలిస్తే అర్థం అవుతుంది.

ఎకరానికి సగటున 20 క్వింటాల్లు దిగుబడి వచ్చినా అదనంగా 2 క్వింటాల్ల తాలు ఉంటుంది. ఒక్కొక్కసారి తాలు మిర్చి మంచి మిర్చి సమానంగా కూడా ఉంటుంది. తాలు మిర్చియె ఎక్కువ ఉండే అవకాశం కూడా ఉంది. దీనిని గమనించాలి.

**ఒక ఎకరం మిర్చికి పెట్టుబడి కూలీ ఖర్చులు (రు.)**

| | |
|---|---|
| మిర్చి విత్తనాలు 10 ప్యాకెట్లు | 3,500 |
| నారు పోయడానికి 5గురు కూలీలకు | 500 |
| నారు పెంపకం 40 రోజులు<br>(రోజుకు ఒక్క మనిషి 3 పూటలా నీళ్లు కట్టాలి,<br>కలుపు తీయాలి, మందు కొట్టుకోవాలి)<br>3 నుండి 6 సార్లు (అదును బట్టి ఉంటుంది) | 4,000 |
| దుక్కి దున్నాలి | 6,000 |
| అచ్చు తోలకం | 400 |
| మొక్క వేసినందుకు (10 మంది కూలీలకు) | 1,000 |
| నాగటి చాళ్లు తీసినందుకు | 300 |
| మొదటి సారి నీళ్లు కట్టుటకు (ఇద్దరి కూలీలకు) | 200 |
| 3 సార్లు పాటు చేసినందుకు | 2,400 |
| పాటు చేసేటప్పుడు నాగలి వెనుక చెట్లు లేపడానికి<br>మనిషి ఉండాలి అతనికి (రోజుకు రు.100 చొప్పున) | 300 |
| 2 సార్లు కలుపు తీసుదు కూలి (20 మంది) | 2,000 |
| తోట తవ్వడానికి కూలి | 2,000 |
| తోటకు నీళ్లు 8 నెలల్లో 60 సార్లు కట్టాలి వారికూలీ<br>(రోజుకు ఇద్దరు చొప్పున 2 రోజులు కడుతారు)<br>రు. 240 కూళ్లు | 24,000 |
| తోట మొదటిసారి మైలకాయ<br>ఏరే కూలీలు 45-60 మంది | 5,000 |
| 2వ సారి ఏరుటకు కూలీలు 150 మంది | 15,000 |
| 3వ సారి ఏరుటకు కూలీలు 150 మంది | 15,000 |
| తాలు మిరపకాయ ఏరదానికి 30 మంది | 3,000 |
| పురుగు మందులు (వారానికి 2 సార్లు చొప్పున<br>7 నెలలకు 56 సార్లు కొట్టాలి ట్రిప్పుకు రు.1000) | 56,000 |
| ఆటో బస్సు ఛార్జీలు దూరాన్ని బట్టి (మా దగ్గర 10 ఛార్జి) | 1,200 |
| దుక్కి మందులు 30 సార్లకు<br>(20-20 యూరియా, పోటాష్‌కు కల్పి) | 22,250 |
| పెట్రోల్ | 200 |
| మందుకొట్టే రోజు కూలీ (56 కూలీలకు) | 5,600 |
| గుళికలు, స్ప్రెయర్‌కు కల్పి | 1,000 |
| 50 బస్తాలకు (బస్తాకు రు. 30లు) | 1,500 |
| బస్తా తొక్కినందుకు రు. 20<br>500 బస్తాలకు (20 క్వింటాలు) క్వింటాలుకు | 1,000 |
| రు. 50 ఖర్చు పురికొస రు. 2 1/2 | 1,000 |
| కమిషన్ 100కు 3 నుండి 5 రూపాయలు<br>(20 క్వింటాలుకు 8 వేల రేటు చొప్పున) | 4,800 |
| హమాలి కూలీ బస్తాకు 12 (50 బస్తాలకు) | 600 |
| రైతు 8 నెలల శ్రమ (రోజుకు 100 చొప్పున) | 24,000 |
| మొత్తం ఖర్చు | **2,03,750** |

అంటే ఎకరం మిర్చికి రు. 35,750ల దాకా నష్టం వస్తుంది. 20 క్వింటాల్ల దిగుబడి కొద్ది మందికే వస్తుంది. 10 క్వింటాల్ల దిగుబడి అసలు దిగుబడి రానివాళ్లు ఉన్నారు. వారికి ఇంకా ఖర్చు ఎక్కువ వస్తుంది. ఎందుకంటే తన పంటకు జబ్బు తగిలిన కొద్ది మందులు

| | |
|---|---|
| 20 క్వింటాళ్ళు × 8,000 | రు. 1,60,000 |
| 2 క్వింటాళ్ళు × 4,000 | రు. 8,000 |
| మొత్తం ఆదాయం | రు. 1,68,000 |
| మొత్తం ఖర్చు | రు. 2,03,750 |
| ఆదాయం | రు. 1,68,000 |
| లోటు | రు. 35,750 |

**ఒక ఎకరం వరి పెట్టుబడి - కూలీల వేతనం ఖర్చు (రు.)**

| | |
|---|---|
| నారు విత్తనాలు 15 మానికలకు | 500 |
| నారు మడి దున్నిన అరకకు నారుపోసినందుకు కల్పి | 550 |
| దున్నుడు కూలి మొదటిసారి | 700 |
| సాలు ఇరువాలుకు ట్రాక్టర్ ఐతే | 1,000 |
| మళ్లీ ఇరువాలుకు దమ్ముకు | 1,000 |
| గొర్రుకు | 500 |
| పారపనికి | 450 |
| నాటుకు 10 మంది కూలీ 150 చొప్పున | 1,500 |
| నాటు వేసేరోజు పిడసలు తొక్కడానికి కూలీ | 200 |
| బొద్దు కలుపు ఐదుగురి కూలీ | 500 |
| సన్న కలుపుకు 10 మంది | 1,000 |
| కోతకూలి 10 మంది 150 చొప్పున | 1,500 |
| కట్టివేత, కుప్పవేయడానికి 10 మంది | 1,500 |
| కుప్పకొట్టుడు మిషన్‌కు 2 గంటలు | 3,200 |
| (మనుషులకు అయితే పుట్టికి 3 కుండల కుంచెడు 4 పుట్లకు 14 కుండలు) | |
| గడ్డితోల ట్రాక్టర్‌కు | 700 |
| గడ్డి కట్టినందుకు | 500 |
| 20-20 దుక్కి మందు 2 కట్టలు | 1,000 |
| 2 కట్టల యూరియా | 600 |
| పొటాష్ | 250 |
| గుళికలు | 125 |
| స్ప్రేకు 2 సార్లు | 1,000 |
| **మొత్తం** | **18,275** |

**ఇందులో రైతు శ్రమను లెక్కవేయలేదు**

వాడుతుంటాడు. పై వివరణలు స్వయంగా వ్యవసాయం చేస్తున్న రైతులు చెప్పిన రిపోర్టు. రైతులు రిపోర్టు చెప్పుతూ కంటనీరు తీసుకున్న వాళ్లు కూడా ఉన్నారు.

ఎకరానికి సగటున 3½ పుట్ల వడ్లు పుట్టి 5 క్వింటాల 50 కేజీల చొప్పున 19 క్వింటాళ్లకు 25 కేజీలు అవుతాయి.

| | |
|---|---|
| 19 క్వింటాళ్ల 25 కేజీలకు × 800 | 15,400 |
| ఖర్చు | 18,275 |
| | 2,875 |

వరిపంట కూడా అన్ని విధాలుగా సక్రమంగా పండి చేతికి వచ్చినా రు. 2,875 నష్టం వస్తుంది. ఇంకా కరెంటు మోటర్ల వ్యవసాయం అయితే అదనంగా ఖర్చు వస్తుంది. ఈ విధంగా ఏ పంటలు చూసినా రైతుకు నష్టాలే తప్ప లాభం వచ్చే పరిస్థితి లేదు అందుకే ఉపాధిహామీ పథకం పనులు వ్యవసాయ పనులకు వర్తింపచేయాలని కోరుతున్నాం. వ్యవసాయానికి ఉపాధి హామి పనులు ఎందుకు వర్తింపజేయాలో ఆలోచించండి.

ఉపాధి హామి పనులల్లో 16 అంశాలను చేర్చారు. కుటుంబం లో ఒక్కరికి మాత్రమే 121 రోజులు పని కల్పిస్తామని ప్రభుత్వం చెపుతోంది. అంటే భర్త పనిచేస్తే భార్య ఖాళీగా ఉండాలి. భార్య పనిచేస్తే భర్త ఖాళీగా ఉండాలి. ఈ పనిని 3 విడతలుగా చేయిస్తారు. ఈ పనులల్లో కూడా కోట్లాది రూపాయల అవినీతి జరుగుతోంది. 'దోసుకున్నోడికి దోసుకున్నంత మహదేవా' అన్నట్లు అందినా కాడికల్ల దోసుకోవడమే జరుగుతోంది. అయినా ఈ నిధులు పూర్తిగా ఉపయోగించడం లేదు. పనుల పట్ల కూడ ప్రజలల్లో తీవ్ర అసంతృప్తి ఉంది. కొన్ని పనులు ఎవరికీ ఉపయోగపడడంలేదని బహిరంగంగానే అధికారుల ముందే విమర్శిస్తున్నారు.

గ్రామీణ ప్రాంతంలో ఈ పథకం అమలు చేస్తున్నారు. పనికి వెళ్లే కూలీలల్లో సన్న, చిన్నకారు రైతులు ఉన్నారు. బతకడానికి మరో అవకాశం లేక ఎర్రటి ఎండను సైతం లెక్కచేయకుండా కిలోమీటర్ల కొద్ది నడిచి వెళ్లి పనిచేసి ఎర్రటి ఎండలో నడుచుకుంటూ ఇంటికి వచ్చి సొమ్మసిల్లి పడిపోతున్నారు. మరుసటి రోజు మళ్లీ ఇదే తంతు 6-7 కిలోమీటర్ల దూరం వరకు నడిచే పోతారు. 10 నుండి 15 కిలోమీటర్ల పనికి ఆటోలల్లో, ట్రాక్టర్లల్లో ప్రయాణిస్తారు. ఒక్క ఆటోలో 20 మందికి పైగా ఎక్కి వెళ్లడం జరుగుతుంది. ట్రాక్టర్లలో 60-70 మంది వెళ్లడం జరుగుతుంది. ఈ సందర్భంలో అనేక యాక్సిడెంట్లు, బోల్తా పడడం జరుగుతున్నాయి. గత సంవత్సరం బయ్యారం మండలంలో ట్రాక్టర్లు, ఆటోలు బోల్తాపడి 20-30 మందికి కాళ్లు చేతులు విరగడం జరిగింది. ఏ ఒక్కరికీ కూడా నేటికీ ప్రభుత్వం వైపు నుండి సాయం అందలేదు. ఇన్ని ఇబ్బందులు పడుకుంటూపోయినా కాని సరైన కూలిపడడం లేదు. గత సంవత్సరం గంధంపల్లి, కొత్తపేటలలో వారానికి మనిషికి రు. 40 లు వచ్చిన పరిస్థితి ఉంది. అంటే రోజుకు రు. 7.50ల చొప్పున కూలిపడింది.

## వ్యవసాయపనులకు వర్తింపచేయడం

వ్యవసాయరంగం ఎక్కువ కూలీల మీద ఆధారపడి నడిచే రంగం. పై పట్టికలను పరిశీలిస్తే మనకు స్పష్టంగా అర్థం అవుతుంది. వరికి ప్రారంభం నుండి చివరి వరకు 100 మంది కూలీలు పడతారు. నాటుకు 10 మంది, కలుపులకు 15 మంది, కోతకు 10 మంది, కట్టివేతకు 10 మంది, పారపనికి నలుగురు, కుప్పకొట్టుడుకు 20 మంది, మందులు చల్లెరోజు ఇద్దరు, ఆ విధంగా స్ప్రే చేసే రోజు ఇద్దరు చొప్పున కూలీల అవసరం ఉంటుంది. కావున 100 మందికి కూలి మనిషికి రు. 100 చొప్పున రు.10 వేలు అవుతుంది.

మిర్చికి 600 మంది అవసరం ఏర్పడుతుంది. నారు పోయడానికి ఐదుగురు, నారు పెంపకంకు ఒక మనిషి 40 రోజులు, మొక్క వేసిన రోజు 10 మంది, నీళ్లు 60 సార్లు కట్టాలి అంటే 60 కూళ్లు, తోట

*దళితులను నిర్బంధంగా హిందువులుగానే గుర్తించడం, అలా ఉండేలా చేయడం గొప్ప విషయాలు కావనీ, హిందూ మతం సాటి పౌరులని, దళితుల్ని సమానంగా చూడగలుగుతుందా అనీ ప్రశ్నిస్తున్నారు* **జూపాక సుభద్ర**

# దళితులపై హిందూ బందిఖానాలు

**నా** ప్రమేయం లేకుండానే నా కుల సర్టిఫికెట్టులోకి 'హిందూ మతం' అనే పేరు ఎట్లా వచ్చిందో తెలువది. మా ఇంట్ల, మా వాడల కూడా 'హిందూ మతం' అనే మాట వాడుకలోనే లేదు. మరి నా సర్టిఫికెట్లోకి నేను హిందువునని ఎట్ల ఎక్కింది? మా కుటుంబం, కులం ఆ 'పదం'తో ఐడెంటిఫై కాలే. అది అనరు, మాట్లాడరు. మరి ఎక్కడిది ఈ పదం నాకు తెలువనిది. మా పర్యావరణంలో, మా భాషలో లేని ఈ పదం ఎక్కడిది అని నేను కొత్తలో చాలా కొట్టుకులాడేది. తర్వాత తెలిసింది ఇది నాలుగు తలలతో, వేయి పడగలతో విచ్చుకొని మా కులాలకు, జాతులకు తెలువకుండనే మమ్మల్ని దురాక్రమించుకున్నదని. సరే, కానీ మాకు హిందూ మతాన్ని కట్టబెట్టినా ఫాయిద ఏముంది? మమ్మల్ని అంటరానివారుగా, కుక్కలు, పశువుల కన్న నీచంగా, దూరంగా చూసే అమానవీయతలు, గుడిలోకి రానీయని నిషేధాలు. అట్లాంటి దుర్మార్గపు కుల విలువలు, నిషేధ విలువలు అమానుషత్వ విలువలున్న 'హిందూ' మతాన్ని ఎట్లా మోయాలనేదే నేడు దళితులు ఎదుర్కొంటున్న ప్రధాన సంకటం.

చారిత్రకంగా చూస్తే దళిత కులాలు హిందూ మతం మీద తిరుగుబాటు చేసి ఓడిన కమ్యూనిటీలు. హిందూ మత హింసా దుర్మార్గాలపై, ఆ భావజాలంపై ఎదురు తిరిగి తిరస్కరించిన వారు దళితులు. తర తరాల్నించి హిందూ మతం దళితుల్ని శత్రువులుగానే చూస్తుంది. అనుమానాస్పదులుగా, అపనమ్మకస్తులుగానే చూస్తుంది. చరిత్రలో దళితుల్నించీ ఎన్ని తిరుగుబాట్లు, ఎంత పోరాటాన్ని చవిచూసి భంగపడిందో హిందూమతం. అందుకే దానికి ఆధిపత్యం దొరికినప్పుడల్లా దాని హింసను, నిషేధాల్ని ప్రదర్శించుతూ తన స్వభావాన్ని నిలబెట్టుకుంటుంది.

హిందూ మతం మనుషుల్ని చీల్చేది. నిచ్చెన మెట్ల సమాజానికి తాత్విక భూమికను ఇచ్చింది. మనిషిని మనిషి కులం పేరుతో సాగించే దోపిడీ హింసలకు సామాజిక దన్ను కల్పించేది. వ్యవస్థీకరించేది హిందూ మతం. దళితులు దాని కోరలు చీల్చే కొడవండ్లే. హిందూ మతం దళితులను భూముల్నించి, మానవ హుందాతనాల్నించి, విద్య నుంచి దూరం చేసి సోషల్ ఖైదీలుగా, బానిసలుగా నెట్టేసింది హిందూ మతం. ఇది చాలా తెలివిగా పకడ్బందీగా రాజ్యాంగంలోని ఆర్టికల్ 341లో 3వ పేరాలో చదువుకున్న దళితుల్ని తన కంట్రోల్‌లోనికి తెచ్చుకుంది. బహిరంగంగా 'దళితులు హిందువులు' అనే దమ్ము లేక హిందూ ఆధిపత్య కులాలు ఈ ఆర్టికల్‌లో ఇరికించిండ్రు.

ఆర్టికల్ 341లోని 3వ పేరా ఏంటంటే దళితులు వేరే మతంలో ఉంటే దళితులుగా పొందే ప్రభుత్వ రాయితీలు వర్తించబడవని, దానివల్ల నా కుల సర్టిఫికెట్టులో నేను హిందువుగాకున్నా నేను హిందువునైన. నాకు నా కుటుంబానికి జాతికి తెలువకుండానే నా పేరును బట్టి హిందువును జేసిండ్రు హిందూ మతస్తులు. మా ఇంట్లోనే మా చిన్నాయన పేరు యాకోబు. అతని కుల సర్టిఫికెట్టులో 'బి.సి.' కులం అని ఇచ్చిండ్రు. మా బంధువుల్లోని చాలా మంది పేర్లు హిందూ పేర్లు కాకుంటే వాళ్లకు తెలువకుండానే వాళ్లు ఎస్.సి.ల నుంచి బి.సి.లయిండ్రు సర్టిఫికెట్లలో. సరే బి.సి.లయిండ్రని వాళ్లని ఊళ్లే ఉండనిస్తరా. పల్లెకు పోనిస్తరా, వాళ్లు అంటరానితనాల నుంచి విముక్తి అయిండ్రా అంటే అదీ లేదు.

---

మొదటిసారి ఏరడానికి 45 నుండి 60 మంది, 2వ సారి ఏరడానికి 150 మంది, 3వ సారి ఏరడానికి 150 మంది తాలు మిరపకాయలు ఏరడానికి 30 మంది, మందుకొట్టే రోజుకు ఇద్దరు చొప్పున ఎన్నిసార్లు కొడితే అన్నిసార్లు ఇద్దరు చొప్పున మొత్తంగా 600 మంది అవసరం ఏర్పడుతుంది. ఒక్క నెల రోజులలోనే 300 మంది కూలీల అవసరం ఏర్పడుతుంది. రైతు ఎరువులకు, పురుగుమందులకు పెట్టిన ఖర్చు రు. 89,750, కూలీలకు పెట్టిన ఖర్చు రు. 1,10,000 అంటే పురుగు మందులకు, ఎరువుల కంటే కూలీలకే ఎక్కువ ఖర్చు పెడుతున్నట్లు స్పష్టంగా అర్థం అవుతుంది.

వరి పంటఖర్చును చూసినట్లయితే ఎరువులకు, పురుగు మందులకు కల్పి రు. 2,975 మాత్రమే ఖర్చు పెడుతున్నారు. మిగిలిన రు. 15,250 కూలీలకు. దున్నుడు ఖర్చులకు అవుతుంది. అందుకే వ్యవసాయ రంగానికి ఈ పనులు కేటాయిస్తే ఏ వ్యవసాయం చేసే రైతుకైనా రు. 15 వేల నుండి ఒక లక్షా రూపాయలకు పైగా మిగులుతుంది. దీంతో రైతుల్లో ఆత్మస్థైర్యం పెరుగుతుంది. అన్నం పెట్టె రైతు ఆత్మహత్యలు చేసుకోకుండా సగర్వంగా బతకగలడు. తన కొనుగోలుశక్తి పెరుగుతుంది. దీంతో వ్యవసాయరంగాన్ని అభివృద్ధి చేసుకోగలడు. కూలీలకు కూలి దొరుకుతుంది. వారి జీవన విధానం కొద్ది మేరకు మెరుగవుతుంది. వ్యవసాయ రంగం అభివృద్ధి అయితే దేశ అభివృద్ధికి తోడ్పడుతుంది. ఆ ఉద్దేశ్యంతోటే వ్యవసాయ పనులకు ఈ పథకాన్ని వర్తింపచేయవల్సిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం.

(రచయిత సామాజిక కార్యకర్త) వీ

వాళ్లని మాదిగల కిందనే చూస్తరు గానీ బి.సి.లుగా చూడరు. బి.సి.లే కదాని బి.సిలు వియ్యాలందుతారా అంటే అదీ లేదు. అదీకాక వాళ్లకున్న రిజర్వేషన్ రాయితీలు మొత్తం కోల్పోబడింద్రు. దళిత రాయితీలు, రిజర్వేషన్లు దళిత క్రిస్టియన్‌లకు వర్తించవట. ఇదెక్కడి న్యాయం. ఇదేమి దుర్మార్గం. దళితులు హిందువుగ ఉంటేనే దళిత రాయితీలనే నిబంధన దళితులకే, ఎందుకు?

అదే మా ఊళ్లె కొంతమంది బి.సి.లు, ఎరుకలోల్లు, లంబాడోల్లు కొద్ది మంది క్రిస్టియన్ మతంల జేరి పేర్లు మార్చుకున్నరు. వాళ్ల కుల ధృవీకరణ పత్రాల్లో వాళ్ల కులం ఎటూ బోలే. ఏ కులం వాళ్లకు ఆ కులం సర్టిఫికెట్లే ఇచ్చింద్రు. మరి మా కులం (దళిత) వాళ్లకు మా కులం సర్టిఫికెట్లిచ్చే దానికి ఈ హిందూ మత తిరకాసేంది? బి.సి.లకు, ఆదివాసులకు మత ప్రాతిపదికన కాకుండా కుల ప్రాతిపదికనే కుల గుర్తింపు సర్టిఫికెట్లు తద్వారా పొందే రాయితీలకు ఎలాంటి అడ్డంకు ల్లేనపుడు దళితులకే ఎందుకు ఈ రాజ్యాంగ వివక్షలు? దళితులకు మతం మార్చుకునే స్వేచ్ఛ లేకుండా చేసి, దళితులుగా పొందాల్సిన రాజ్యాంగ రాయితీలను చాలా కుట్రపూరితంగా, దౌర్జన్యపూరితంగా, అప్రజాస్వామికంగా హిందూ మతం దళితుల్ని దురాక్రమించింది.

దళితులది ప్రకృతి మతం. మొదట్నుంచీ హిందూ మతం అదుపాజ్ఞల్లో లేదు. కనుసన్నల్లో ఇమడలేదు. గుడిలోకి రానియ్యరు. ఊరిలో ఉండనివ్వరు. తామేం హిందువుల బంధువులం కాదు. అయినా మా కుల సర్టిఫికెట్ల మీద దౌర్జన్యంగా 341 ఆర్టికల్ 3వ పేరా చూయించి పేరును బట్టి హిందువని, హిందువుకాదని దళిత రాయితీలు గుంజేయడమేంటి, హిందువునని పేరుమార్చుకొని ఒప్పుకుంటే నాకు 15 శాతం రిజర్వేషన్. లేకుంటే నాకు బి.సి. 'సి'లో ఒక శాతం రిజర్వేషనే. ఏందో ఈ హిందూ హింస. జీవితాంతం ఎదుర్కొనే హింస ఇది.

హిందూ హింస దళితులకు కుల ధృవీకరణ పత్రాలలోనే ఆగిపోవడం లేదు. ఎస్.సి. రిజర్వేషన్లు పొంది ఉన్నత విద్య, ఉద్యోగంలో చేరిన వారి మీద, స్థానిక సంస్థల్లో ఎస్.సి. రిజర్వేషన్లలో సర్పంచి, ఎం.పి.టి.సి., జెడ్.పి.టి.సి. లుగా ఎన్నికైన వారి మీద, ప్రమోషన్స్‌లో రూల్ ఆఫ్ రిజర్వేషన్స్ (ఆర్.ఒ.ఆర్.) మీద హిందూ రంధ్రాన్వేషణ సాగుతుంటది.

మా ఆఫీసులో చేరేప్పుడు బొట్టు లేకుండా జాయినయి హిందూ హింస పడలేక ఉద్యోగానికి ఎసరొస్తదని బొట్టు బిల్లలు అంటించుకున్న దళిత మహిళలు చాలా మంది ఉన్నారు. అట్లనే స్థానిక సంస్థల్లో ఎన్నికైన దళిత నాయకుల్ని, దళిత మహిళా నాయకుల్ని 'నువ్వు ఎస్.సి. రిజర్వేషన్‌లో సర్పంచైనవు. నీ మొకాన బొట్టేది' అని వేధిస్తుంటరు హిందుత్వ వాదులు. వారి బొట్టు కారణం చూపి వాళ్లను బ్లాక్‌మెయిల్ చేయడం బలవంతంగా బొట్టు బెట్టించడం లేదా క్రిస్టియన్‌వు నీవు ఈ 'ఎస్.సి.' రిజర్వేషన్ కోటా కిందా వచ్చినవు నిన్ను తొలగిస్తాం' అని బెదిరించడం వంటి కేసులు స్థానిక సంస్థల్లో బోలెడు బొచ్చెడు.

ఒక ప్రభుత్వ డాక్టర్ ఈ మధ్య ఇటువంటి కేసే ఎదుర్కొంటుండు. ఒక ప్రభుత్వాసుపత్రికి మా బంధువు ఒకతను (ఎస్.సి. మాదిగ) డాక్టరు తర్వాత సుపరింటెంటయి ఆ తర్వాత రీజినల్ డిప్యూటీ డైరెక్టరయిండు ప్రమోషన్స్‌లో రిజర్వేషన్స్ వల్ల. ఆ డాక్టర్‌తో పాటే జాయినైన ఒక దళితేతర డాక్టర్ 'ఈ రీజినల్ డిప్యూటీ డైరెక్టర్ హిందువు కాదు క్రిస్టియన్' అని హ్యూమన్ రైట్స్ కమిషన్‌లో బిజెపి 'దళిత మోర్చా'ను కూడా కలుపుకొని కేసు వేసిండు. 'దళిత మోర్చా' 'పని ఏంటంటే' 'దళితులు హిందువులుగానే ఉండాలె. హిందూ పేర్లే పెట్టుకోవాలే, హిందూ పెండ్లే చేసుకోవాలె, చచ్చిపోయినా హిందూ కర్మకాండలే చేసుకోవాలే' అని చెప్తరు. వీరు దళితుల్ని హిందూ కట్టడి చేయడానికి సందు దొరకకున్నా కిరస్తాని పేర్లు బెట్టుకుని దళిత రిజర్వేషన్స్ అనుభవిస్తున్న వారి మీద బడ్డరు. విద్యలో, ఉద్యోగంలో, స్థానిక సంస్థల్లో హిందూ పేరు లేకున్నా, మొకాన బొట్టు లేకున్నా వారిని హింస బెట్టి వారి రిజర్వేషన్స్ పీకి పడెయ్యడమే! ఈ దళిత మోర్చా కార్యకలాపాలు హిందూ మాల మాదిగలకే రిజర్వేషండ్లు. కిరస్తాండ్ల జేరినంక గూడ మీకు రిజర్వేషండ్లు కావాలా కుదరది. 'మేము నష్టపోమా' అని మాట్లాడ్తరు.

దీనికి జవాబుగ హిందువులుగానే పెండ్లిల్లు జేస్కుంటం. పేర్లు బెట్టుకుంటం. సావు, దినం అన్ని హిందువుల్లెక్కనే జేస్తం. మరి మాకు అంటరానితనాలు లేకుండ జేస్తరా? గుడిలోకి బాజాప్త్మగబోయే అవకాశాలు కల్పిస్తారా? మా అవకాశాల్ని మనుషులుగా పొందనిస్తారా? వీటి మీద ఎందుకు మీ 'దళిత మోర్చ' కొట్లాడది? మీ సాటి కులపోల్లు రిజర్వేషన్ పొంది ఏదో ఉద్యోగం, ప్రమోషన్, సర్పంచి అయితే వారి రాయితీలను తీసేసే దాకా నిద్రబోరు. ఎందుకు? అని వాదిస్తే, 'కులపోల్లయితే హిందువుగ ఉండి కొట్లాడు. వేరే మతంలకు బొయి మా హిందూ రాయితీలను దొబ్బుతరా' అని అడ్డంగా వాదిస్తుంటరు ఉన్మాదంగా.

సరే ఈ యునాని దళిత డాక్టరైన రీజనల్ డిప్యూటీ డైరెక్టర్ తల్లి పేరేంది, తండ్రి పేరేంది, బంధువులందరి పేర్లేంది? వాళ్లకేం సర్టిఫికెట్లున్నయి? వాళ్ల పరిసరాల్లో చర్చీలున్నాయా? ఉంటే వీరి కార్యకలాపాలేంటి? పెండ్లి ఎట్లా జరిగింది అని నఖశిఖ పర్యంతం అనేక విచారణలు జరిగినయి. పెండ్లి ఫొటోల్లో చాలామంది బొట్టులేని ఆడవాళ్లు, సూట్ వేసుకున్న మొగవాళ్లను జూసి ఇది క్రిస్టియన్ నేపథ్యాలున్న కుటుంబమే అనీ నెత్తిమీద పెళ్లికూతురికి కొంగున్నది ఇది క్రిస్టియన్ సంప్రదాయమేమో అని రకరకాల అనుమానాలతో, ఎంక్వైయిరీలతో వేధించడం జరిగింది. చివరికి అతను 'దళిత మోర్చా'ల హిందూ శీల పరీక్షల్లో నుంచి తప్పించుకున్నాడు. ఎంత ప్రాణ సంకటం, ఎంత హింస అనుభవించారో. దళితుడైన ఆ డాక్టర్‌తో పాటు కుటుంబ మంతా. హిందూ రాజకీయ మతోన్మాదులు 'దళిత మోర్చా'తో తమవేళ్లని తమ కండ్లల్లనే పొడిపించే హిందూ కుట్రలు చేస్తున్నారు.

'దళిత మోర్చా'లో ఉన్న దళితులు ఈ హిందూ దళిత వ్యతిరేక కుట్రలకి, అమానుషాలకు వ్యతిరేకంగా పనిచేస్తూ హిందూ మతాన్ని మట్టుబెట్టే తమ జాతి పునాదుల్ని పునరుద్ధరించాల్సిన అవసరముంది. ఆర్టికల్ 341 పేరా మూడవదాన్ని తొలగించడానికి, దళితుల పట్ల ఉన్న హిందూ వివక్షల్ని, బలవంతపు చట్రాల్ని కూల్చడానికి లౌకిక వాదులంతా పోరాడాల్సిన అవసరముంది. మానవ విలువల్లేని హిందూ మతాన్ని తుదముట్టించేది అంతిమంగా దళితులే. వారు చేసే పోరాటాలకు హిందూ వ్యతిరేక శక్తులు దళితులకు బాసటగా నిలవాల్సి ఉంది.

*(రచయిత 'మట్టిపూలు' రచయిత్రి)* వీ

*యురేనియంలో అణు విచ్ఛిత్తి జరిగే తీరును, అందులోంచి శక్తి ఉత్పన్నమయ్యే పద్ధతిని వివరిస్తున్నారు*

**డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్**

# గొలుసుకట్టుగా అణువిచ్ఛిత్తి

ప్రకృతిలో ఖనిజంగా దొరికే యురేనియం అణుకేంద్రకాలలో 99.28 శాతం యురేనియం-238 ఐసోటోప్ రకానివే. వీటికన్నా సులువుగా విచ్ఛిన్నమయే యురేనియం-235 అణువులు న్యూట్రాన్ల తాకిడికి రెండు ముక్కలుగా చీలిపోయే క్రమంలో (ఫిషన్) ఆ ముక్కలతోబాటుగా రెండు మూడు న్యూట్రాన్లు కూడా విడుదలఅవుతాయి (పటం). ఈ న్యూట్రాన్లు కనక మరికొన్ని యురేనియం-235 అణువులకు తగిలితే వాటిని మళ్ళీ విచ్ఛిన్నం చెయ్యగలుగుతాయి. ఈ పద్ధతిలో విచ్ఛిత్తి జరిగినప్పుడల్లా న్యూట్రాన్లు విడుదల అవుతూ మరికొన్ని అణువులను ఛేదించగలుగుతాయి. పరిస్థితులు ఒనగూడితే ఈ ప్రక్రియ గొలుసుకట్టు పద్ధతిలో కొనసాగే అవకాశం ఉంటుంది. దీన్నే న్యూక్లియర్ చెయిన్ రియాక్షన్ అంటారు. అణురియాక్టర్లయినా, అణుబాంబులయినా ఇదే సూత్రంమీద పనిచేస్తాయి.

ఈ ప్రక్రియల్లో ఒక న్యూట్రాన్ వల్ల రెండు మూడు న్యూట్రాన్లు ఉత్పత్తి అయేమాట నిజమేకాని కొత్తగా పుట్టిన న్యూట్రాన్లలో కొన్ని ఇతరత్రా ఖర్చయిపోయినట్టయితే అవి మరొక యురేనియం అణువును ఛేదించకుండా పోతాయి. మొత్తం యురేనియంలో యురేనియం-235 అణువులు కొన్నే ఉంటాయి కనక గొలుసుప్రక్రియ కొనసాగుతూ ఉండాలంటే అనేక పరిస్థితులు అనుకూలించాలి. లేకపోతే మొదట్లో కొన్ని అణువులు విచ్ఛిన్నం అయినప్పటికీ కాసేపటికి ఆ కార్యక్రమం నిలిచిపోతుంది. ప్రతి ఒక్క అణువిచ్ఛేదనమూ ఉత్పత్తి చేసే న్యూట్రాన్లలో పోయినవి పోగా కనీసం ఒక్కటైనా మరొక అణువిచ్ఛిత్తికి దారితీసే పరిస్థితి కనక ఏర్పడితే దాన్ని క్రిటికాలిటీ లేదా కీలకస్థితి అంటారు.

అణువిచ్ఛిత్తిలో విడుదల అయే న్యూట్రాన్ల వేగం చాలా ఎక్కువగా ఉంటుంది. వీటిలో మరింత అణువిచ్ఛిత్తికి పనికిరాకుండాపోయే న్యూట్రాన్లన్నీ ఎక్కడికి పోతాయి? వీటిలో కొన్ని అణుఇంధనం కడ్డీలను నిలిపి ఉంచడానికి అమర్చిన ఉక్కుకడ్డీలకో, ఇతర నిర్మాణపరికరాలకో తగిలే అవకాశం ఉంటుంది. అలాగే కొన్ని యురేనియం-238 అణువులకు తగులుతాయి. కొన్ని దేనికీ తగలకుండా బైటకు చొచ్చుకుపోతాయి. ఇలా న్యూట్రాన్లేవీ వృథా కాకుండా మళ్ళీ అణువిచ్ఛిత్తికి తోడ్పడాలంటే వాటి వేగాన్ని తగ్గించడం అవసరమవుతుంది. ఇలాంటి వేగనిరోధక పదార్థాన్ని మోడరేటర్ అంటారు. నీరుగాని, భారజలంగాని, పరిశుద్ధమైన కార్బన్‌గాని ఇందుకు



యురేనియం-235 అణువు విచ్ఛిత్తి, గొలుసుకట్టు అణువిచ్ఛిత్తి

పనికొస్తాయి. అలాగే అణువిచ్ఛిత్తివల్ల విపరీతమైన వేడిమి పుట్టుకొస్తుంది కనక దాన్ని తగ్గించే శీతలీకరణ కూలంట్ పదార్థాలు అవసరం అవుతాయి. ఇందుకు సందర్భాన్నిబట్టి నీరుగాని, భారజలంగాని, కార్బన్ డయాక్సైడ్ వాయువుగాని, సోడియం లోహంగాని పనికొస్తుంది. అణురియాక్టర్లనుంచి విద్యుత్తును ఉత్పత్తి చెయ్యదలుచు కున్నప్పుడు వాటిని చల్లబరిచే నీటిని ఆవిరిగా మార్చి దానితో టర్బైన్లను నడిపిస్తారు.

యురేనియంవంటి బరువైన అణుకేంద్రకాలు రెండుగా చీలినప్పుడు రెండు తేలికపాటి అణువులు రూపొందడం, ఈ పరిణామంలో అతిస్వల్పమోతాదులో ద్రవ్యరాశి శక్తిగా విడుదలకావడం జరుగుతాయి. ద్రవ్యరాశిలో తలెత్తే ఈ వ్యత్యాసం సుమారుగా రెండు న్యూట్రాన్లపాటి మాత్రమే అయినప్పటికీ ఇది శక్తిగా రూపాంతరం చెందినప్పుడు దాదాపు 20కోట్ల ఎలక్ట్రాన్ వోల్ట్‌లకు సమాన మవుతుంది. దీనితో పోలిస్తే బొగ్గువంటి ఇంధనాలు తగలబడినప్పుడు వెలువడేది కేవలం కొన్ని ఎలక్ట్రాన్ వోల్ట్‌లకు సమానమైన శక్తి మాత్రమే. ద్రవ్యరాశి ఎం అయితే, శక్తి ఇ అనుకుంటే అయిన్‌స్టయిన్ సూత్రం ప్రకారం (ఇ ఈక్వల్స్ ఎం సి స్క్వేర్) విపరీతంగా శక్తి బైట పడుతుంది. ఎందుకంటే సి అనేది కాంతివేగం (సెకండుకు 186 వేల మైళ్ళు).

యురేనియం అణువులన్నీ ఒకే పద్ధతిలో చీలకపోవచ్చు. అవి రెండయాక బేరియం, క్రిప్టాన్‌వంటి మూలకశకలాలు మిగులుతాయి. యురేనియం అణువుల్లో న్యూట్రాన్లు చాలా ఎక్కువ కనక విచ్ఛిత్తి జరిగాక వాటిలోని అదనపు కణాలన్నీ ప్రోటాన్లుగా మారి స్థిరపడతాయి. అందువల్ల అణువిచ్ఛిత్తిలో పుట్టుకొచ్చే పదార్థాలకు విపరీతమైన రేడియోధార్మికత ఉంటుంది. అవి స్థిరపడటానికి వేలకొద్దీ సంవత్సరాలు పట్టవచ్చు.

అణుకేంద్రకాల్లో ఉండే ప్రోటాన్లకు ధనవిద్యుత్తు ఉంటుంది కనక రెండు ప్రోటాన్లమధ్య వికర్షణ ఉంటుంది. న్యూట్రాన్లకు విద్యుదావేశం ఉండదు. అయితే విద్యుత్తుతో సంబంధంలేకుండా ఒకదాని కొకటి అతిదగ్గరగా వచ్చినప్పుడు ప్రోటాన్ల, న్యూట్రాన్లన్నిటి మధ్యనా విపరీతమైన ఆకర్షణ ఏర్పడుతుంది. ఈ ఆకర్షణ ఒకే రకమైన విద్యుత్తు కలిగించే వికర్షణకన్నా చాలా బలమైనది. అణు కేంద్రకాలు కలిసికట్టుగా ఉన్నాయంటే దానికి కారణం ఇదే. కేవలం ఒకటికన్నా ఎక్కువ ప్రోటాన్లు మాత్రమే ఉన్న కేంద్రకాలు మటుకు ఉండవు. బహుళంగా ప్రోటాన్లున్న కేంద్రకాలలో న్యూట్రాన్లుండడం తప్పనిసరి.

స్థిరంగా ఉన్న ఏ కేంద్రకాన్నయినా పగలగొట్టడానికి శక్తి వినియోగించవలసివస్తుంది. అయితే ప్రోటాన్ల సంఖ్య పెరుగుతున్నకొద్దీ, వాటిని కలిపి ఉంచడానికి అవసరమయే న్యూట్రాన్ల సంఖ్య మరింత ఎక్కువగా పెరుగుతుంది. ఈ పరిస్థితిలో కేంద్రకం పరిమాణం పెరగడంతో ప్రోటాన్ల మధ్యనుండే దూరం కాస్తకాస్తగా పెరుగుతుంది. అప్పుడు వాటి మధ్యనుండే ఆకర్షణశక్తి కాస్త తగ్గి, ధనవిద్యుత్తువల్ల కలిగే వికర్షణయొక్క ప్రభావం ఎక్కువవుతుంది. అందుకనే యురేనియంవంటి పెద్ద అణువుల కేంద్రకాలు అస్థిరంగా తయారవుతాయి. వీటిలో ఒక్కొక్కప్పుడు బైటి న్యూట్రాన్‌తో ప్రమేయం లేకుండా కూడా స్వయంప్రేరక పద్ధతిలో అణువిచ్ఛిత్తి జరగవచ్చు. దీన్ని స్పాంటేనియస్ ఫిషన్ అంటారు.

ఆఫ్రికాలోని గబోన్ దేశపు గనుల్లో యురేనియం-235 అణువులు సహజంగా ఉండవలసిన దానికన్నా కాస్త తక్కువగా ఉన్నట్టు తెలిసింది. దీనికి కారణం సహజంగా తలెత్తిన గొలుసు అణు విచ్ఛేదనమేనని భావిస్తున్నారు. ఇది జరిగి 200 కోట్ల ఏళ్ళయినట్టుగా లెక్కకట్టారు. అప్పట్లో ఇది కొన్ని లక్షల సంవత్సరాలపాటు కొనసాగి ఉంటుందని తెలుస్తోంది.

సహజంగా దొరికే యురేనియం-235లాగే కృత్రిమంగా తయారయే యురేనియం-233, ప్లూటోనియం-239 కూడా న్యూట్రాన్ల తాకిడికి సులువుగా విచ్ఛిత్తికి లోనవుతాయి. అందుచేత ఇవికూడా అణుఇంధనాలే. వీటిలో యురేనియం-233ను ఉత్పత్తి చెయ్యడానికి మన దేశంలో విరివిగా దొరికే థోరియం-232ను న్యూట్రాన్లచేత ఢీకొట్టించవచ్చు. అలాగే ప్లూటోనియం-239 ఉత్పత్తికి యురేనియం-238ను న్యూట్రాన్ల తాకిడికి గురిచేస్తారు. మన దేశంలో సహజ యురేనియం ఇంధనంగా పనిచేసే రియాక్టర్లలో గొలుసు ప్రక్రియకు లోనయేవి 1 శాతం కన్నా తక్కువగా ఉండే యురేనియం-235 అణువులే. రియాక్టర్ పనిచేస్తున్నప్పుడు వెలువడే న్యూట్రాన్లలో కొన్ని అణువిచ్ఛిత్తిలో పాల్గొనని యురేనియం-238 అణువులకు తగిలి వాటిని ప్లూటోనియం-239గా మారుస్తాయి. అందువల్ల ఖర్చైపోయిన అణుఇంధనాన్ని రీప్రోసెసింగ్ ప్రక్రియలకు లోనుచేసి భవిషత్తులో అణుఇంధనంగా పనికొచ్చే ప్లూటోనియం-239ను రాబట్టుకుంటారు.

ఇంధకవర్ధన బ్రీడర్ రియాక్టర్లను ప్రత్యేకంగా ఈ పద్ధతిలోనే నడుపుతారు. వీటిలో ఒకవంక సంప్రదాయకమైన యురేనియం-235వంటి ఇంధనంతో రియాక్టర్ పనిచేస్తూఉంటుంది. అందులో తప్పనిసరిగా ఉత్పత్తి అయే న్యూట్రాన్ల తాకిడికి చుట్టూతా అమర్చిన థోరియం-232, లేదా యురేనియం-238 కవచాన్ని గురిచేస్తారు. అందులో కనీసం కొంత భాగమైనా యురేనియం-233గానో, ప్లూటోనియం-239గానో మార్పుచెంది భవిష్యత్తులో రియాక్టర్ ఇంధనంగా పనికొస్తుంది. అణు ఇంధనాన్ని ఈ పద్ధతిలో తయారు చెయ్యగలిగే రియాక్టర్ ను బ్రీడర్ అంటారు.

*(రచయిత అణుధార్మిక శాస్త్రవేత్త)* వీ

# ఆలోచనల గూటికి పుల్లా పుడకా

సమాజంలోనూ, పుస్తకాలలోనూ, పత్రికలలోనూ, ఇతర ప్రచార సాధనాలలోనూ ఎన్నెన్నో తెలుసుకోవలసిన, ఆలోచించవలసిన విషయాలు ఉన్నప్పటికీ, వెలువడుతున్నప్పటికీ ప్రత్యేకంగా ఎత్తిచూపక పోవడం వల్ల వెలుగులోకి రాకుండా, ఆలోచనాపరుల దృష్టికి రాకుండా పోతున్నాయి. అటువంటి తెలుసుకోవలసిన విషయాలను మా దృష్టికి వచ్చినంతవరకు సేకరించి అందించడం ఈ శీర్షిక లక్ష్యం. ప్రజల అవగాహనల గూడును సుస్థిరంగా నిర్మించడానికే ఈ పుల్లా పుడకా.

* * * * *

భారత దేశంలో అత్యంత సంపన్నులుగా గుర్తింపు పొందేవాళ్లు ఎంత మంది? వాళ్ల సంపదలు ఎలా పెరుగుతున్నాయి? ఈ ప్రశ్నలకు అంతర్జాతీయ ద్రవ్య సేవా సంస్థలు కాప్ జెమిని, మెరిల్ లించ్ వెల్త్ మేనేజ్ మెంట్ విడుదల చేసే వార్షిక నివేదిక ఆసియా పసిఫిక్ వెల్త్ రిపోర్ట్ తాజా సంచిక (2009) జవాబు చెపుతోంది. ఆ జవాబు సంపూర్ణమైనది కాకపోవచ్చుగాని ఒక సూచికగానైనా పనికివస్తుంది. నివాసభవనం, అస్థిర ఆస్తులు, వినియోగ వస్తువులు, గృహోపకరణాలు లెక్క వేయకుండానే, కేవలం వారి దగ్గర మదుపు పెట్టగలిగిన ఆస్తులు ఐదు కోట్ల రూపాయలు ఉంటే వారిని "అతి ఎక్కువ నికర విలువ కలిగిన వ్యక్తులు" అని ఈ నివేదిక నిర్వచించింది. అలాంటి వారు భారత దేశంలో మొత్తం 1,20,000 మంది ఉన్నారు. అంటే జనాభాలో వారు 0.01 శాతం. కాని వారిదగ్గర ఉన్న సంపద మొత్తం జాతీయాదాయంలో మూడో వంతు (33 శాతం). ఈ సంస్థలే విడుదల చేసిన ప్రపంచ సంపద నివేదిక ప్రకారం ప్రపంచ వ్యాప్తంగా ఇంతకు ఫదిరెట్లు బడా సంపన్నుల సంఖ్య 1,03,000 (అంటే ప్రపంచ సంపన్నుల జనాభాలో ఒక శాతం మంది). వారి చేతుల్లో ప్రపంచ సంపదలో 36 శాతం పోగుపడి ఉంది. మరొకపక్క ప్రపంచబ్యాంకు నిర్వచనం ప్రకారం రోజుకు రెండు డాలర్ల కన్న తక్కువ ఆదాయంతో బతికేవారు నిరుపేదల కింద లెక్క. తాజా గణాంకాల ప్రకారం ప్రపంచంలో 270 కోట్ల మంది ప్రజలు ఈ నిర్వచనం కింద నిరుపేదలుగా ఉన్నారు. అది ప్రపంచ జనాభాలో సగం.

* * * * *

భారత దేశం ప్రస్తుతం అనుసరిస్తున్న అభివృద్ధి నమూనా, సేవారంగ అభివృద్ధి, ఉద్యోగ రహిత అభివృద్ధి నమూనా సుస్థిరమైనది కాదు. ఈ మాట అంటున్నది ప్రభుత్వ విమర్శకులు కాదు. భారత ఆర్థిక వ్యవస్థను నిర్వహించే అత్యున్నత పీఠాలలో ఒకటైన భారతీయ రిజర్వ్ బ్యాంక్ గవర్నర్ డి సుబ్బారావు ఆ మాట అన్నారు. "సేవారంగం గత ఇరవై సంవత్సరాలలో ఒక స్వతంత్ర చోదక శక్తిగా పనిచేసి ఉండవచ్చు. కాని ఇంకెంతో కాలం అది అలా పనిచేయజాలదు. మనం ఇక సుస్థిరత సాధించాలంటే పారిశ్రామిక రంగం మీద, వ్యవసాయ రంగం మీద శ్రద్ధ పెట్టాలి" అన్నారాయన. "జనాభా పెరుగుదల, ముఖ్యంగా పనిచేసే వయసులో ఉన్నవారి జనాభా పెరగడం మంచిదే. కాని వ్యవసాయ రంగం నుంచి సమీప భవిష్యత్తులో బయటికి తోయబడే 15-20 కోట్ల మందికి ఉపాధి కల్పించవలసిన అవసరం ఉంది. సేవారంగానికి ముందూ వెనుకల సంబంధాలలో వెనుక బాగానే ఉంటుంది, కాని ముందు బాగుండదు. అందువల్ల అది ఉద్యోగ కల్పన సాధించదు" అన్నారాయన.

* * * * *

ప్రభుత్వం ఇచ్చే గణాంకాల మీద, అది సరఫరా చేసే నివేదికల మీద ఆధారపడి నిర్ధారణలు తీసేవారికి ఒక హెచ్చరిక. ప్రభుత్వ లెక్కలు తప్పుల తడకలట. ఆ మాట స్వయంగా రిజర్వ్ బ్యాంక్ గవర్నర్ డి సుబ్బారావు సరిగ్గా రిజర్వ్ బ్యాంక్ నిర్వహించే గణాంక దినోత్సవంలో మాట్లాడుతూ అన్నారు. ప్రభుత్వం విడుదల చేసే గణాంకాల ఆధారంగా విధాన పరమైన నిర్ణయాలు తీసుకోవడం అసాధ్యమని, స్థూల జాతీయోత్పత్తి ముందస్తు అంచనాలు, పారిశ్రామికోత్పత్తి గణాంకాల సవరణలు, టోకు ధరల సూచి ఆధారంగా ద్రవ్యోల్బణ గణాంకాలు వంటి ప్రభుత్వం సరఫరాచేసే లెక్కలన్నీ తప్పులతడకలుగా ఉంటున్నాయని, వాటివల్ల తమ తల తిరిగిపోతోందని ఆయన అన్నారు. "విధాన నిర్ణయాలు తీసుకోవడంలో మేం ఉపయోగించే మౌలిక గణాంకాల విశ్వసనీయతవల్ల మేం దెబ్బతింటున్నాం. గణాంకాల నాణ్యత సరిగా లేకపోవడం వల్ల తప్పుడు నిర్ణయాలు తీసుకునే ప్రమాదం ఉంది" అన్నారు. ఇటీవల ప్రభుత్వం స్థూల జాతీయ ఉత్పత్తి గణాంకాలను పదే పదే సవరించిందని, ఈ అంకె విధాన నిర్ణేతలకు, మదుపుదార్లకు, ఆర్థిక శాస్త్రవేత్తలకు చాల ముఖ్యమైనదని ఆయన అన్నారు. ఉదాహరణకు 2009-10 సంవత్సరపు స్థూల జాతీయోత్పత్తి వృద్ధిరేటు 6.8 శాతం ఉండవచ్చునని 2010 ఫిబ్రవరిలో అంచనా వేశారు. మూడునెలలు తిరగకుండానే దాన్ని 7.7 శాతంగా సవరించారు. మళ్లీ 2011 ఫిబ్రవరిలో దాన్ని 9.1 శాతంగా సవరించారు. అంటే ఒక్క ఏడాదిలో ఈ అంకె 40 శాతం పెరుగుదలను చూపెట్టింది. నిజం ఏమిటో చెప్పగలవారు లేరు. ఇక దానిమీద ఆధారపడి ఏ నిర్ణయం తీసుకున్నా అది తప్పు కాకుండా ఎలా ఉంటుంది?

* * * * *

కేంద్ర హోంమంత్రిత్వ శాఖ కింద పనిచేసే బ్యూరో ఆఫ్ పోలీస్ రిసర్చ్ అండ్ డెవలప్ మెంట్ అనే సంస్థ "తీవ్రవాద ప్రభావిత ప్రాంతాల్లో

సామాజిక, ఆర్థిక, రాజకీయ చలనాలు" అనే అంశం మీద గువాహటికి చెందిన సెంటర్ ఫర్ డెవలప్ మెంట్ అండ్ పీస్ స్టడీస్ చేత ఒక పరిశోధన జరిపించింది. అస్సాం, మణిపూర్, నాగాలాండ్, త్రిపుర, మేఘాలయలలో 700 మంది సాధారణ ప్రజలను, 250 మంది నిపుణులను, ఆంధ్రప్రదేశ, చత్తీస్‌ఘడ్, జార్ఖండ్‌లలో 600 మంది సాధారణ ప్రజలను, 150 మంది నిపుణులను కలిసి సమాచారం సేకరించిన ఈ పరిశోధనా నివేదిక ఇటీవలనే వెలువడింది. ఈ నివేదిక కొన్ని అభివృద్ధి సిఫారసులనూ (ఈశాన్య రాష్ట్రాలకు 11, నక్సలైట్/మావోయిస్టు ప్రభావిత రాష్ట్రాలకు 13), కొన్ని నిర్వహణా సిఫారసులనూ (ఈశాన్య రాష్ట్రాలకు 9, నక్సలైట్/మావోయిస్ట్ ప్రభావిత రాష్ట్రాలకు 9) సూచించింది. అభివృద్ధి సిఫారసులలో దశాబ్దాలుగా చెపుతున్న సంక్షేమ చర్యలను పునరుక్తం చేయగా, నిర్వహణా సిఫారసులు మాత్రం పోలీసు దమననీతికి కొనసాగింపుగా ఉన్నాయి. నక్సలైట్ల అనుకూల ప్రచారం సాగుతున్నదని, ఇటీవల "సమాజంలోని కీలక మేధావులు" కూడ ఈ ప్రచార బృందంలో చేరుతున్నారని వాపోయిన నివేదిక "నక్సల్ కార్యకర్తలకు, వారి సమర్థకులకు మధ్య, రెచ్చగొట్టడానికీ సమర్థనకూ మధ్య, నేరస్వభావంగల కుట్రలకూ భావజాల మద్దతుకూ మధ్య తేడా చూడాలి. బహిరంగ జీవితంలో నక్సలైట్ కార్యకర్తల మీద రాజ్యం అన్ని చర్యలూ తీసుకోవచ్చుగాని, సమర్థకుల మీద కక్ష చూపుతున్నారనే ఆరోపణల నేపథ్యంలో అటువంటివి నిష్ప్రయోజకం. రాజ్యం భిన్నాభిప్రాయాన్ని సహించదనీ, దమననీతిని అమలుచేస్తుందనీ నక్సలైట్లు చేసే ప్రచారానికే అది ఉపయోగపడుతుంది. సమర్థకులు తమ చర్యలను సమావేశ మందిరాలకు పరిమితం చేసినంతవరకూ వారిని పట్టించుకోకుండా వదిలివేయవచ్చు" అని రాసింది.

* * * * *

కేంద్ర ప్రభుత్వ గణాంక, పథకాల అమలు మంత్రిత్వశాఖ కింద ఉన్న జాతీయ నమూనా సర్వే కార్యాలయం (ఎన్ ఎస్ ఎస్ ఒ) దేశ వ్యాప్తంగా అనేక అంశాల మీద సర్వేలు నిర్వహించి గణాంకాలను విడుదల చేస్తుంది. ఈ ఎన్ ఎస్ ఎస్ ఒ 2009 జులై - 2010 జూన్ ల మధ్య 66వ దఫా దేశవ్యాప్త ఉద్యోగ, నిరుద్యోగ సూచికలను సర్వే చేసి జూన్ 24న నివేదిక విడుదల చేసింది. దేశవ్యాప్తంగా 7,402 గ్రామాలలో, 5,252 పట్టణ ప్రాంతాలలో 1,00,957 (59,129 గ్రామీణ, 41,828 పట్టణ) కుటుంబాలను సర్వే చేసి ఈ ఫలితాలను ప్రకటించారు. వాటి ప్రకారం జాతీయ స్థాయిలో మొత్తం శ్రామికులలో 51 శాతం సొంత ఉపాధి కల్పించుకున్నారు. 33.5 శాతం ఏరోజుకారోజు కూలి వెతుక్కునే స్థితిలో ఉన్నారు. కేవలం 15.6 శాతం మాత్రమే స్థిరవేతన ఉద్యోగాలలో ఉన్నారు. మొత్తం దేశం స్థితి ఇది కాగా, గ్రామీణ ప్రాంతాలలో 54.2 శాతం సొంత ఉపాధికింద, 38.6 శాతం ఏరోజుకారోజు, 7.3 శాతం స్థిరవేతనపు ఉద్యోగాలలో ఉన్నారు. పట్టణ ప్రాంతాలలో 41.1 శాతం సొంత ఉపాధి కింద, 17.5 శాతం ఏరోజుకారోజు, 41.4 శాతం స్థిర వేతన ఉద్యోగాలలో ఉన్నారు. ఇక ఈ శ్రామికులు ఏ రంగాలలో ఉపాధి పొందుతున్నారో చూస్తే, గ్రామీణ ప్రాంతాలలో 63 శాతం మంది పురుషులు, 79 శాతం మంది స్త్రీలు వ్యవసాయ రంగంలో, 19 శాతం మంది పురుషులు, 13 శాతం మంది స్త్రీలు ద్వితీయ రంగంలో, 18 శాతం మంది పురుషులు, 8 శాతం మంది స్త్రీలు తృతీయ రంగంలో ఉన్నారు. పట్టణ ప్రాంతాలలోనైతే తృతీయ రంగంలో 59 శాతం మంది పురుషులు, 53 శాతం మంది స్త్రీలు, ద్వితీయ రంగంలో 35 శాతం మంది పురుషులు, 33 శాతం మంది స్త్రీలు, వ్యవసాయ రంగంలో 6 శాతం మంది పురుషులు, 14 శాతం మంది స్త్రీలు ఉన్నారు. ఇక సగటు రోజు కూలి గ్రామీణ ప్రాంతాలలో రు. 232 గా, పట్టణ ప్రాంతాలలో రు. 365 గా ఉంది. ఈ సగటును స్త్రీ పురుషుల మధ్య విభజించి చూస్తే, గ్రామీణ ప్రాంతాలలో పురుషులకు రు. 249, స్త్రీలకు రు. 156, పట్టణ ప్రాంతాలలో పురుషులకు రు. 377, స్త్రీలకు రు. 309 గా ఉంది.

* * * * *

ఎన్ ఎస్ ఎస్ ఒ 66వ దఫా సర్వేలో కుటుంబ వినియోగ వ్యయ సూచికలను కూడ పరిశీలించి నివేదిక వెలువరించారు. నెలవారీ తలసరి వినియోగ వ్యయాన్ని గణించిన ఈ సూచిక సంక్లిష్టమైన, సాంకేతికపరమైన లెక్కల మీద, కొలతల మీద ఆధారపడింది గాని, ఆ సంక్లిష్టతలలోకి వెళ్లకుండా అంతిమ నిర్ధారణలను చూస్తే, దేశంలో నెలవారీ తలసరి వినియోగ ఖర్చు గ్రామీణ ప్రాంతాలలో రు. 1053.64 గా, పట్టణ ప్రాంతాలలో రు. 1984.46గా ఉంది. (ప్రపంచబ్యాంకు లెక్కల ప్రకారం రెండు డాలర్ల కన్న తక్కువ రోజువారీ వినియోగం, అంటే నెలవారీ వినియోగం రు. 2700 కన్న తక్కువ ఉంటే, నిరుపేదలన్నమాట. ఆ లెక్కన మొత్తం భారతదేశమే నిరుపేద నిర్వచనం కన్నా ఎంత తక్కువ ఉందో చూడండి). ఈ అంకే ఘోరమనుకుంటే, గ్రామీణ జనాభాలోని అతి పేద వర్గానికి చెందిన 10 శాతం మందికి ఈ అంకె రు. 453 మాత్రమే. పట్టణ జనాభాలోని అతి పేద వర్గానికి చెందిన 10 శాతం మందికి అది రు. 599. కాగా గ్రామీణ ప్రాంతాలలో అతి ఎక్కువ ఆదాయం ఉన్న పై పది శాతం మందికి ఈ అంకె రు. 2517గా ఉంది. పట్టణ ప్రజలలో పై పది శాతానికి ఈ అంకె రు. 5863 గా ఉంది. ఇక మొత్తం కుటుంబ ఖర్చులో ఆహారపదార్థాల వాటా గ్రామీణ ప్రాంతాలలో 57 శాతంగా, పట్టణ ప్రాంతాలలో 44 శాతంగా ఉంది. వీ

## 'ముఖ్య'మంత్రులను మార్చిన గనులు

కర్ణాటక బి.జె.పి ప్రభుత్వంలోని ముఖ్యమంత్రితో సహా నలుగురు మంత్రులూ, 787 మంది అధికారులూ రు.16,085 కోట్ల ఖనిజాన్ని దోచుకున్నట్లుగా కర్ణాటక లోకాయుక్త తేల్చింది. ఈ కారణంగానే బి.జె.పి కర్ణాటకలో ముఖ్యమంత్రి యద్యూరప్పను తొలగించింది. కొత్త ముఖ్యమంత్రిగా డి.వి. సదానందగౌడ ఆగస్ట్ 4న ప్రమాణ స్వీకారం చేశారు.

## కారాగారాలుగా పాఠశాలలు

పోస్కోను వ్యతిరేకిస్తూ పోరాడుతున్న ప్రజలను అరెస్ట్‌చేసి పాఠశాలల్లో ఉంచడంపై నాలుగు వారాల్లో వివరణ ఇవ్వాలని జాతీయ మానవ హక్కుల కమిషన్ (ఎన్.హెచ్.ఆర్.సి) ఒడిశా ప్రభుత్వాన్ని ఆదేశించింది. పాఠశాలలను కారాగారాలుగా మారుస్తున్నారంటూ మీడియాలో వచ్చిన కథనాలను సుమోటాగా తీసుకుని ఎన్.హెచ్.ఆర్.సి విచారణ చేపట్టింది.

## బూటకపు ఎన్‌కౌంటర్లు

బూటకపు ఎన్‌కౌంటర్‌లలో వ్యక్తుల ప్రాణాలను తీయడం అత్యంత దారుణమైన హత్యగా సుప్రీంకోర్టు పేర్కొంది. బాధ్యులైన పోలీసులకు ఉరి శిక్ష విధించాలని న్యాయమూర్తులు మార్కండేయ కట్జూ, సి.కె. ప్రసాద్‌లతో కూడిన సుప్రీంకోర్టు బెంచ్ ఆగస్ట్ 8న పేర్కొంది. 2006 అక్టోబర్ 23న రాజస్థాన్‌లో దారాసింగ్‌ను బూటకపు ఎన్‌కౌంటర్‌లో కాల్చిచంపిన అదనపు డి.జి.పి. అరవింద్ జైన్, ఎస్.పి. అర్షద్‌లను కోర్టులో లొంగిపోవాలని ఆదేశించింది. దారాసింగ్ భార్య సుశీలాదేవి వేసిన పిటిషన్‌పై 2010 ఏప్రిల్‌లో సుప్రీంకోర్టు సి.బి.ఐ. దర్యాప్తుకు ఆదేశించింది.

## ఔషధ ప్రయోగాలు

దేశంలో ప్రాణంతకంగా పరిణమిస్తున్న ఔషధ ప్రయోగాలపై నాలుగు వారాల్లో నివేదిక ఇవ్వాలని జాతీయ మానవ హక్కుల కమిషన్ (ఎన్‌హెచ్‌ఆర్‌సి) ఆదేశించింది. ఈ విషయంపై కేంద్ర ఆరోగ్య మంత్రిత్వ శాఖకు, ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ మెడికల్ రీసెర్చ్‌కు, డ్రగ్ కంట్రోలర్ జనరల్ ఆఫ్ ఇండియాకు ఎన్‌హెచ్‌ఆర్‌సి నోటీసులిచ్చింది. గత నాలుగేళ్లలో ఔషధ ప్రయోగాల వల్ల దేశంలో 1725 మంది ప్రాణాలు కోల్పోయారని కథనాలు వెలువడ్డాయి. వీటిని కమిషన్ సుమోటాగా తీసుకుంది. డిజిసిఐ అధికారిక లెక్కల ప్రకారమే దేశంలో 1,868 ఔషధ ప్రయోగాలు జరుగుతున్నట్లు తెలిపింది.

## బ్యాంకు సిబ్బంది సమ్మె

బ్యాంకింగ్ రంగంలో చేపడుతున్న సంస్కరణలను వ్యతిరేకిస్తూ ఐదు ప్రధాన కార్మిక సంఘాలు, నాలుగు ఆఫీసర్ల యూనియన్‌లు ఆగస్ట్ 5న సమ్మెలో పాల్గొన్నాయి. ఇందులో దేశ వ్యాప్తంగా పది లక్షల మంది సిబ్బంది పాల్గొన్నట్లు ఆల్ ఇండియా బ్యాంక్ ఎంప్లాయిస్ అసోసియేషన్ (ఏఐబిఇఏ) కన్వీనర్ సి.హెచ్. వెంకటాచలం తెలిపారు. దీంతో ప్రభుత్వ బ్యాంకుల లావాదేవీలు పూర్తిగా స్తంభించాయి. సంస్కరణల పేరుతో ఉద్యోగాలను ఔటుసోర్స్ చేస్తోందని, పెట్టుబడులను తగ్గిస్తోందని దీంతో ప్రైవేటు బ్యాంకుల ఆధిపత్యం పెరుగుతుందని ఫోరమ్ కన్వీనర్ అన్నారు.

## రైతులపై పోలీసుల కాల్పులు

మహారాష్ట్రలోని మావల్ గ్రామం వద్ద ఎక్స్‌ప్రెస్ హైవేపై ఆగస్ట్ 9న ఆందోళన చేస్తున్న రైతులపై పోలీసులు జరిపిన కాల్పుల్లో నలుగురు రైతులు మరణించారు. పౌనా డ్యాం నుంచి పింప్రి-చించ్వాడ్‌లోని పారిశ్రామిక టౌన్‌షిప్ అవసరాలకోసం నీటిని తీసుకెళ్లడాన్ని, ఆ ప్రాజెక్ట్‌కు అవసరమైన భూసేకరణను రైతులు వ్యతిరేకిస్తున్నారు. ఇందులో భాగంగా ఆ ప్రాంత రైతులు 400 మంది ర్యాలీగా వచ్చి పుణెకు దగ్గరలోని మావల్ వద్ద రాకపోకలను అడ్డుకున్నారు. ఆందోళన చేస్తున్న రైతులపై లాఠీచార్జ్ చేసి పారిపోతున్న రైతులపై పోలీసులు కాల్పులు జరిపారు.

## మరణ శిక్ష

ఎర్రకోటపై 2000 డిసెంబర్ 22న జరిగిన దాడి జరిగిన కేసులో లష్కరే తోయిబాకు చెందిన మహ్మద్ ఆరిఫ్‌కు దిగువ కోర్టు విధించిన మరణ శిక్షను ఆగస్ట్ 10న సుప్రీం కోర్టు సమర్ధించింది. ఎర్రకోటపై జరిగిన దాడి దేశ సార్వభౌమత్వానికే సవాలు విసిరిందని పేర్కొంది. మొదట సెషన్ కోర్టు ఆరిఫ్‌కు మరణ శిక్ష విధించింది. ఈ తీర్పును సవాల్ చేస్తూ ఢిల్లీ హైకోర్టులో వేసిన పిటిషన్ పై విచారణ చేసిన హైకోర్టు కింది కోర్టు ఇచ్చిన తీర్పును సమర్ధిస్తూ పిటిషన్‌ను తిరస్కరించింది.

## రూపం మారిన ఎస్‌పిఓలు

నక్సల్స్‌పై పోరాటానికి గిరిజనులను ప్రత్యేక పోలీసు అధికారులు (సల్వాజుడుం-ఎస్‌పిఓలు)గా నియమించడాన్ని నిలిపివేశామని ఛత్తీస్‌గఢ్ ప్రభుత్వం సుప్రీం కోర్టుకు తెలిపింది. సల్వాజుడుంలో పనిచేసిన వారందరినీ రాష్ట్ర పోలీసు శాఖలో చేర్చుకుంటామని పేర్కొంది. ఈ మేరకు ఆర్డినెన్స్ జారీ చేశామని కోర్టుకు సమర్పించిన అఫిడవిట్‌లో ప్రభుత్వం వెల్లడించింది. ప్రత్యేక పోలీసు అధికారుల (ఎస్‌పిఓ) ను రద్దు చేయాలని సుప్రీంకోర్టు జూలై 5న ఆదేశాలను జారీచేసింది. ఎస్‌పిఓలను వినియోగించేందుకు కేంద్రం ప్రత్యక్షంగా లేదా పరోక్షంగా నిధులను వాడరాదని సుప్రీం కోర్టు తన ఆదేశాల్లో స్పష్టం చేసింది.

## నక్సల్స్ అణచివేతకు..

మావోయిస్టు ఉద్యమాన్ని అణచివేయడానికి భద్రతా దళాల కోసం, అద్దె ప్రాతిపదికన హెలికాప్టర్లను తీసుకునేందుకు రాష్ట్రాలకు అనుమతి ఇస్తున్నట్లు ఆగస్ట్ 23న కేంద్ర హోంశాఖ సహాయ మంత్రి జితేంద్ర సింగ్ వెల్లడించారు. మావోయిస్టు ఉద్యమ ప్రాంతాల్లో ఎనభై వేలకు పైగా బలగాలను వినియోగిస్తున్నట్లు పేర్కొన్నారు. 71 బెటాలియన్ల సి.ఆర్.పి.ఎఫ్. బలగాలు, ఒక నాగాల్యాండ్ ఇండియా రిజర్వ్ బెటాలియన్, తొమ్మిది కోబ్రా దళాలు నక్సల్స్ అణచివేతలో ఆయా రాష్ట్రాల పోలీసులకు సహకరిస్తున్నాయని తెలిపారు.

## రాం శరణ్ శర్మ ఇక లేరు

ప్రముఖ మార్క్సిస్ట్ చరిత్రకారుడు రాంశరణ్ శర్మ (92) ఆగస్ట్ 20న అనారోగ్యంతో చనిపోయారు. బీహార్‌లోని బెగుసరాయ్ జిల్లాలోని బరౌని టౌన్‌కు దగ్గరలోని ఒక గ్రామంలో పేద కుటుంబంలో జన్మించారు. ఆయన చరిత్ర పరిశోధనలో, చరిత్ర రచనలో ఎన్నదగిన కృషి చేశారు. వందకు పైగా పుస్తకాలు కూడా రాశారు. ఆయన రాసిన పుస్తకాలు పదిహేను భాషల్లోకి అనువాదం అయ్యాయి. ఆయన పురాతన, మధ్యయుగాల భారత చరిత్రను పాట్నా, ఢిల్లీ, టొరొంటో విశ్వవిద్యాలయాల్లో బోధించారు. ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ హిస్టారికల్ రీసర్చ్‌కు 1972లో వ్యవస్థాపక చైర్మన్‌గా వ్యవహరించారు. ఇండియన్ హిస్టరీ కాంగ్రెస్‌కు 1975లో ప్రెసిడెంట్‌గా ఉన్నారు. ఆయన రాసిన 'ఏన్సెంట్-ఇండియా' పుస్తకం 1978లో నిషేధానికి గురైంది. ఆయన బతికినంత కాలం హిందూ మతోన్మాద భావాలకు వ్యతిరేకంగా అవిశ్రాంత పోరాటం చేశారు. భారతీయ జనతాపార్టీ అధికారంలో ఉన్నకాలంలో చేపట్టిన ఎన్.సి.ఇ.ఆర్.టి. చరిత్ర పాఠ్యపుస్తకాల కాషాయీకరణను బయటపెట్టారు. వీ

## థాయ్‌లాండ్ ప్రధానిగా షినవత్రా

థాయ్‌లాండ్‌కు తొలిసారిగా ప్రధానమంత్రిగా మహిళ ఎన్నికయ్యారు. పార్లమెంట్‌కు జరిగిన ఎన్నికల్లో ఇంగ్లక్ షినవత్రా ప్రాతినిధ్యం వహిస్తున్న ఫ్యూ థాయ్ పార్టీ విజయం సాధించింది. దీంతో థాయ్ తొలి మహిళా ప్రధానమంత్రిగా షినవత్రా ఎన్నికయ్యారు. రాజకీయంగా తీవ్ర సంక్షోభంలో ఉన్న దేశంలో సుస్థిరత తీసుకువస్తానన్న వాగ్దానంతో షినవత్రా ఎన్నికల్లో గెలిచారు. ప్రధానమంత్రిగా బాధ్యతలు స్వీకరించిన తరువాత ప్రజల ఆకాంక్షల మేరకు పనిచేస్తానని షినవత్రా హామీ ఇచ్చారు.

## ఇంగ్లండ్‌లో అల్లర్లు

ఉత్తర లండన్‌లోని టాటెన్‌హామ్‌లో ఆఫ్రో – కరీబియన్ వర్గానికి చెందిన మార్క్ డగ్గన్ అనే వ్యక్తి పోలీసు కాల్పులలో చనిపోవడంతో లండన్‌లో ఒక్కసారిగా అల్లర్లు చెలరేగాయి. ఆగస్ట్ 6న జరిగిన ఈ సంఘటనతో లండన్ మొత్తం అల్లర్లు చెలరేగాయి. ఆఫ్రో – కరీబియన్ జాతికి చెందిన వేలాది మంది వీధుల్లోకి వచ్చి నిరసన తెలిపారు. పోలీసులు దుగ్గన్‌ను కాల్చి చంపడంతో ఈ ఆందోళనలు ప్రారంభమైనాయి.. లండన్ నగరం మొత్తంగా దాడులూ, లూటీలూ, విధ్వంసాలకూ గురయ్యింది. ఈ దాడులు ఇంగ్లండ్ అంతా పాకింది. వేలాది దుకాణాలు, ఇళ్లు, వ్యాపార సముదాయాలు లూటీలకు గురయ్యాయి. పోలీసులు వందలాది మందిని అరెస్టు చేసి జైళ్లలో వేశారు.

## నేపాల్ ప్రధాని రాజీనామా

నేపాల్ ప్రధాని ఝలానాథ్ ఖనాల్ ఆగస్ట్ 14న రాజీనామా చేశారు. ప్రధాన ప్రతిపక్షం నేపాలీ కాంగ్రెస్, మిత్రపక్షం మావోయిస్టు పార్టీల నుంచి ఒత్తిళ్లకు తలొగ్గి ఆయన రాజీనామా చేశారు. దీంతో నేపాల్‌లో తాజాగా మళ్లీ అస్థిరత ఏర్పడింది. అధ్యక్షుడు రామ్‌భరన్ యాదవ్ ఖనాల్ రాజీనామాను ఆమోదించారు. కొత్త ప్రధానిని ఎన్నుకునే వరకు ఆపద్ధర్మ ప్రధానిగా కొనసాగాలని ఖనాల్‌ను కోరారు.

## ఇటలీలో నిరసనలు

ఇటలీ ప్రకటించిన రెండవ పొదుపు చర్యల ప్యాకేజీపై కార్మిక సంఘాలు తీవ్ర అభ్యంతరాలు తెలిపాయి. ఈ ప్యాకేజీలో నిష్పాక్షికత లోపించిందనీ, దీనివల్ల మధ్యతరగతిపై ఎక్కువగా భారం పెరుగుతోందనీ తెలిపాయి. ఈ అన్యాయమైన చర్యలకు వ్యతిరేకంగా సార్వత్రిక సమ్మెకు దిగుతామని కార్మిక సంఘాలు హెచ్చరించాయి.

## పాకిస్తాన్‌లో దాడులు

పాకిస్తాన్‌లోని పెషావర్‌కు సమీపంలోని గిరిజన ప్రాంతాలలో జరిగిన బాంబు పేలుడులో 53 మంది మరణించారు. 120 మందికి పైగా గాయపడ్డారు. ఆగస్ట్ 19న పవిత్ర రంజాన్ మాసం సందర్భంగా శుక్రవారం ప్రార్థనలు జరుగుతున్న మసీదును లక్ష్యంగా చేసుకుని ఒక బాలుడు ఆత్మాహుతికి పాల్పడ్డాడు. ఆ సమయంలో మసీదులో మూడు వందల మంది ప్రార్థనలు చేస్తున్నారు. మృతుల సంఖ్య ఇంకా పెరగవచ్చునని స్థానిక అధికారులు తెలిపారు.

## బ్యాంక్ ఆఫ్ అమెరికాలో ఉద్యోగుల కోత

అమెరికాలోని అతిపెద్ద బ్యాంక్ అయిన బ్యాంక్ ఆఫ్ అమెరికా పదివేల మందికి పైగా లేదా తన మొత్తం శ్రమశక్తిలో 3.5 శాతం మందిని తొలగించబోతోంది. హౌసింగ్ సంక్షోభంతో అతలాకుతలమైన బిఒఎ పుంజుకొనే చర్యల్లో భాగంగా చేస్తున్న యత్నాల్లో భాగంగా ఈ తొలగింపులున్నాయి. బ్యాంకు వాటాల ధర ఈ సంవత్సరం ఇప్పటి వరకూ దాదాపు 50 శాతం పడిపోయింది.

## గనులపై మావోయిస్టుల దాడి

ఫిలిప్పైన్స్‌లోని రెండు గనులపై మావోయిస్టులు దాడి చేశారు. నెగ్రోస్ దీవిలోని డ్రిల్ కార్పొరేషన్, ఫిలెక్స్ మైనింగ్ కార్పొరేషన్ అనే మైన్స్‌పై న్యూ పీపుల్స్ ఆర్మీ (ఎన్.పి.ఎ.) కు చెందిన దాదాపు యాభై మంది మావోయిస్టులు దాడి చేసి వాహనాలు, భవనాలు, సామగ్రిని ధ్వంసం చేశారు. ఫిలిప్పైన్స్‌లో దాదాపు ఒక ట్రిలియన్ డాలర్ల ఖనిజ వనరుల నిక్షేపాలు ఉన్నాయి. వాటిని వెలికితీసేందుకు ప్రభుత్వం తీవ్ర ప్రయత్నాలు చేస్తోంది. ఈ విధ్వంసం వల్ల నిరుపేద ఫిలిప్పైన్స్ ప్రజల జీవనం ఛిన్నాభిన్నం అవుతుందనీ, పర్యావరణం దెబ్బతింటుందని మావోయిస్టులు ప్రభుత్వానికి హెచ్చరికలు జారీచేశారు.

## ఇరాక్‌లో విధ్వంసం

ఆగస్ట్ 15న ఇరాక్‌లోని పదిహేడు నగరాలలో బాంబు పేలుళ్లు, తుపాకి కాల్పులతో దద్దరిల్లింది. ఈ దాడులలో మొత్తం 66 మంది ప్రాణాలు కోల్పోగా, రెండు వందల మందికి పైగా గాయపడ్డారు. కిర్కుక్, నజాఫ్, కర్బాలా తదితర నగరాలలో ఈ దాడులు జరిగాయి.

## సిరియాలో ఆందోళనలు

సిరియాలో అధ్యక్షుడు బషర్ అసద్ పదవి నుంచి తప్పుకోవాలని నినదిస్తూ ప్రజలు నిరసన ప్రదర్శనలు చేపట్టారు. ఆందోళనకారులను అణచివేసేందుకు సైన్యం తీవ్రంగా ప్రయత్నాలు చేస్తోంది. వీధుల్లోకి వచ్చి నిరసన ప్రదర్శనలు చేస్తున్న ప్రజలపై కాల్పులు జరుపుతోంది. గత మార్చ్ నుంచి సిరియాలో జరుగుతన్న ఆందోళనల్లో ప్రభుత్వ అణచివేత కారణంగా కనీసం రెండు వేల మంది సామాన్య పౌరులు ప్రాణాలు కోల్పోయారని ఐక్య రాజ్య సమితి అధికారులు తెలిపారు. దీంతో సిరియాపై తీవ్ర ఆంక్షలు విధించాలని బ్రిటన్, జర్మనీ, ఫ్రాన్స్, పోర్చుగల్ తదితర దేశాలు డిమాండ్ చేశాయి.

## ట్రిపోలిలో తిరుగుబాటుదారుల పాగా

లిబియా రాజధాని ట్రిపోలీని తిరుగుబాటుదారులు తమ ఆధీనంలోకి తెచ్చుకున్నారు. నగరంలోని గడాఫీ కాంప్లెక్స్ బాబ్ అల్ అజీజియా సమీపంలో తిరుగుబాటుదారులకు గడాఫీ దళాలకు మధ్య భారీ పోరు జరిగింది. గడాఫీ కాంపౌండ్‌లోకి తిరుగుబాటుదారులు చొచ్చుకుపోయారు. గడాఫీ ఆచూకీ లభ్యం కాలేదు. అతను దేశం వదిలి పారిపోయినట్లు తిరుగుబాటుదార్ల ప్రతినిధి ఒకరు తెలిపారు. కాగా, గడాఫీ కుమారుల్లో ఒకరైన ముహమ్మద్‌ను గృహ నిర్బంధంలో ఉంచారు. మరొకరు సైఫ్ అల్ ఇస్లాంను పట్టుకొన్నట్లు తిరుగుబాటుదారులు చెబుతున్నారు. వి

